# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)




ఫిబ్రవరి - 1985

సంపుటము : 62 సంచిక : 2

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1985



ముఖచిత్రం :

నర్తకి. శ్రీమతి నిరుపమా నిత్యానందన్

ఫొటో : శ్రీ వి.ఎ. కె. రంగారావు

# శుభాకాంక్ష

## డాక్టర్. టి. బి. యం. అయ్యావారు

వసద్గృహారామ భాగ్య సంపద హసింప
మొన్న ఆమనిలో నీవు పుట్టినావు
పికవధూటీసమాజ గీతికల చాలు
లోలసిమధురీకరింప వాయూర్మిపాళి—

నీ రమ్యోదయ గాధలెల్ల కడలన్
హిందోళ రాగమ్ములన్
జారుప్రౌఢిమఁబాడె మత్త మధులిట్
సందోహముల్ వత్స ! నిన్
దూరంబందునఁ జూచి పంకరుహ బం
ధుం డల్ల ప్రాగద్రిపై
కారుణ్యమ్మున సాచెఁబైడి కరముల్
గాఢోప గూహార్థియై—

నీవనిన నెంత ప్రేమయో ? నికటభూజ
విటప ఘటిత కులాయముల్వీడచి వచ్చి
ద్విజకులమ్ము వేఁబోక దీవించె నిన్ను
నరస పుణ్యాహవాచనోత్సవ మెసంగ—

నిను మాకంద నవాంకురమ్మును, జగ
న్నేత్రోత్సవ శ్రీ విధా
యిని - వాత్సల్యముతోడఁ జూచెదరు గా
కెంతేని సారంగ లాం
ఛన గంధానిల శాబకమ్ములు - భవ
జ్జన్మంబు ధన్యత్వమున్
గను కాంక్షాయుత చిత్త సంభవ శతాం
గమ్మై, నితాంత ప్రభన్—

ఆ తప తాపితాధ్వగ చ
యంబుల ఖేద మడంచుచున్, సుధా
పాత మనోహరమ్ములగు
స్వప్నములన్ ఘటియించుగాత ! నీ
ఆతతమైన ఛాయ, ప్రణ
య వ్రత దీక్షితులైన వారికిన్
నీతలిరాకు లెల్లరస
నిర్భరలేఖికలై తనర్చుతన్—

కాళిదాస మహాకవి కావ్యమట్లు
మా మనసు దోచుకొను భవన్మధురమూర్తి
భావి కాలమ్మునందు - గవాక్షమింత
తెఱువఁగినలయ ఫలరాజి దీప్తితోడ—



# అదితి

## డాక్టర్ నాయని కృష్ణకుమారి

కాలమూ దూరమూ తాకలే
వెలుతురు కొలతను మించి
కరిగే సరిహద్దు వేపు
జారి పోయే మనస్సు.

కన్నెదుట సాక్షాత్కరించి
సుప్త చైతన్య పీచిక దిద్దిన
కాంక్షాకృతి.

అయ్యో ఈ కాంక్ష
కళ్ళూ ముక్కూ చెవులూ
ఏవీలేక
ఎటుపడితే అటుసాగే
జెల్లీ చేప..

గుప్పిట పట్టే పూనికతో
మనసు చేయై ముందుకుసాగితే
చుట్టలు చుట్టలుగా పైకి పారే
ఆవిరి భూతం

అది,
కళ్ళల్లో కాపురముండదు కానీ
రెప్పల్ని తాకి గిలికింతలు పెట్టే
వెలుగు సూదుల వయ్యారి

అది
గుండెల్ని తెరిచి మంటల్ని ఆర్పదు కానీ
అల్లుకు పోతూ ప్రాణాల్ని తడిపే
పరిమళాల చిత్తడిజల్లు

అది
నన్నో యినపముక్కను చేసి
తనికేసి లాక్కుంటున్న
అయస్కాంత శిలా రాశి

దాని సమక్షంలో
మనసంతా మమతా మార్దవమూ అయి
గుండె నిండా పలుకులూ పులకరింతలూ అయి
ఎంత పడతాను నేను !

నాకేమీ తోచడం లేదు.
ఒకప్పుడు
నా చుట్టూ ఉన్న గాలిని
అనాసక్తంగా పీలుస్తూ
సూర్య చంద్ర తేజః పుంజంలో
గమ్య రహితంగా జీవిస్తూ
వెచ్చదనాన్నీ చలిమిడినీ
వెలుగునూ చీకటినీ
నిర్మమంగా అనుభవిస్తూ
క్షుబ్ధ యాత్రాను వర్తిత
స్తబ్ధ జీవన ప్రేయసిని నేను !

మరి యీ క్షణాన !
నాలో ఒకటే కదలిక
అసిత వివరాభి ముఖమై దూకే
విశ్వ పరిభ్రమణ ధారా సదృశమీ
నా మనః పరిచలనం

అస్తిత్వాన్నుంచి
శూన్యంలోకి
శూన్యంనుండి అనంతత్వం వేపు
అక్కడెక్కడో అందని దూరంలో
రెక్కలు విప్పుకున్న
రాజ హంసిలా
అదుగో
నా ప్రాణ సమాకర్షక
కాంక్షాకృతి :

శ్రీ చేకూరి రామారావు

# కవిత్వమూ పరిమితి

'భారతి' పత్రికవారు గ్రంథ సమీక్షకు పుస్తకాలు పంపే టప్పుడు వాటితో పాటు ఒక కార్డు పంపుతారు దాంట్లో గ్రంథ వివరాలతో పాటు పరిమితిని గురించి రాస్తూ 'తగు పరిమితి' అని రాస్తారు. కవిత్వమూ, పరిమితి గురించి ఆలోచిస్తుంటే నాకు ఈ మాట గుర్తు వస్తుంది కవిత్వం ఏ పరిమాణంలో ఉండాలంటే మనం చెప్పగలిగే సమాధానం 'తగు పరిమితి' అని.

కవిత్వానికి పరిమితిని నిర్ణయించే అంశాలు కర్త, వస్తువుతో పాటు దాని వాడకందార్లు, (అంటే వినేవాళ్లు, చదివేవాళ్లు) వాహకాలు. పెద్ద కావ్యం రాయాలా, చిన్నది రాయాలా అనేది కొంతవరకు కర్త కోరిక మీద ఆధారపడి ఉంటుంది. ఒక పెద్ద కథ తీసుకుంటే పెద్ద కావ్యం చిన్న వస్తువు తీసుకుంటే చిన్న కావ్యం రాయొచ్చు. ఒక్కోసారి వాడకందార్ల అభిరుచి చిన్న కావ్యాల వేపు మొగ్గితే చిన్న కావ్యాలు పెద్ద కావ్యాల వేపు మొగ్గితే పెద్ద కావ్యాలు వస్తాయి.

ఆధునిక కవిత్వంలో జరిగిన ప్రధానమైన మార్పు కథను వదిలెయ్యటం. ప్రాచీన కావ్యాల్లో ముక్తకాలూ, చాటువులూ, వదిలేస్తే ప్రధానమైన కవిత్వమంతా కథా ప్రధానంగా ఉంది. వీటిని ప్రధాన కవితా మార్గంగా పూర్వపు వాడకందార్లు గుర్తించలేదు. 'సరదాకో చమత్కారానికో' కొన్ని చాటువులు కవులు చెప్పేవారు. అయితే వాటి ప్రయోజనాన్ని గురించి వాళ్ళకు ఏమీ భ్రమలున్నట్లుఆధారాల్లేవు. వాటిల్లోనూ కొన్నిటిని సీరియస్ పోయెట్రీగా తీసుకున్నారనటానికి గాథాసప్తశతి వంటి సంకలనాలు ఆధారాలు.

అతి ప్రాచీన కాలం నుంచీ రకరకాల పరిమాణాలలో కవిత్వం వస్తున్నట్టు మనకున్న సాహిత్యం సాక్ష్యమిస్తున్నది. పురాణాలు, ప్రబంధాలు, శతకాలు, యక్షగానాలు, కీర్తనలు, పాటలు, పదాలు, బుర్రకథలు, గేయాలు, ఇవన్నీ ఒకే పరిమాణం కలవి కావు. అందుకే మినీ కవిత్వం మీద రాసిన కొందరు ఈ రకమైన కవిత్వ మూలాలు వేదాల వరకు తీసుకెళ్ళారు. ( తిరుమలరావు, 1980 )

మినీ కవిత అంటే చిన్న చిన్న కవితా ఖండికలు అనే అర్థం అయినట్లయితే వీటి మూలాలు వెదకటం అర్థంలేని పని. భాష పుట్టి నప్పటినుంచీ కవిత్వం ఉందనుకుంటే, కవిత్వం పుట్టినప్పటినుంచీ మినీ కవిత్వం ఉందనుకోవచ్చు. చాలా తెలుగు సామెతలు చిన్నచిన్న కవితా ఖండికలే.

సన్నగుడ్డ చినిగినా అందం
చక్కనమ్మ చిక్కినా అందం

ఈ సామెతలో కాళిదాసుతో పోటీపడే ఉపమానం ఉంది. అట్లాగే పొడుపు కథలు చిన్న సైజు సింబాలిక్ కవితా ఖండికలు. "చింపిరి, చింపిరి జుట్టు, ముత్యాలవంటి బిడ్డలు" అనేది కవితాఖండిక కాదూ, ఇదే విషయాన్ని సర్దేశాయి తిరుమలరావుగారు భారతిలో సూచించారు. గురజాడలోనూ, గాథాసప్తశతిలోనూ మినీ కవిత్వాన్ని గుర్తించిన రామమోహనరావుగారు దీన్ని "వచన కవితా యౌవన రూపంగా" అభిభాషిస్తున్నారు. (రామమోహనరావు, 1980)

మినీ కవిత్వానికి సైజు ప్రధానం కాదని మినీకవితాభిమానులు బుకాయిస్తున్నా సైజు ప్రధాన గుణం అని ఒప్పుకోక తప్పదు. లేకపోతే

"మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయి రప్పల
కన్న కనిష్టంగాను చూస్తావేల ? "

అనే గురజాడ గేయం "ఒక చక్కని మినీ కవితవుతుంది" అని రామమోహనరావుగారు ఎట్లా అనగలిగారు ? లేకపోతే "మినీకవితకు కావలసిన ఆధునికతా, ధ్వని కూడా ఈ గేయంలో ఉన్నాయి" అన్నారు. వారనుకునే ఆధునికత, ధ్వని పూర్ణమ్మలో ఎక్కువగా చూపించొచ్చు. కాని సైజు వల్లే ఈపైది మినీ కవిత్వం అవుతుంది.

వచన కవిత్వం గురించి పూర్వం కొంత చర్చ జరిగింది. వచన కవితా లక్షణాల గురించి చేసిన అస్పష్ట ప్రతిపాదనలు అనాడే పత్రికలనిండా చాలా కనిపించేవి. వాటి వివరాలు రామారావు, సంపత్కుమారల మధ్య జరిగిన వివాదంలో (రామారావు, సంపత్కుమార 1978) ప్రసక్తమయినై. వాటి గురించి వేరే వివరించాల్సిన అవసరం లేదు. అయితే చరిత్ర మళ్ళీ వెనక్కి మళ్లుతున్నదా అన్నట్టు మళ్ళీ అప్పట్లాగే అట్లాంటి అస్పష్ట ప్రతిపాదనలు ఇప్పటికీ వస్తున్నై.

విమర్శ రంగంలో మన వెనకబాటుతనాన్ని వేలెత్తి చూపుతూ ఉన్నై. అట్లాంటి కొన్నిటిని పాఠకుల దృష్టికి తీసుకురావటం ఈ వ్యాసలక్ష్యం.

ఉదాహరణకి రామ్మోహనరావుగారి ప్రతిపాదనలనే చూడండి. మినీ విప్లవానికి 'మేక్సి' ఆహ్వానం అనే వ్యాసం ప్రారంభంలో మినీ కవిత్వాన్ని "వచన కవితా యౌవన రూపంగా" చెప్పి నాలుగు పేజీల అవతల గురజాడ అప్పారావుగారి 'మనిషి' అనే ఛందరి ఖండికను మినీ కవిత్వం అని ఎట్లా అనగలిగారు ?

అస్పష్టమైన ప్రతిపాదనలకు ఈ విమర్శల్లో కొదువలేదు. కవిత్వాన్ని గురించి మరికొన్ని ప్రమాదకర సూచనలూ ఉన్నై. ఉదాహరణకి కొన్ని చూడండి.

"మినీ కవితలో భావాన్ని చెప్పే ప్రత్యేక ధోరణి ఏదో ఒక రూపాన ఉన్నదని" చెప్పారు. ఏదో ఒకరూపాన అనటం ఆలోచనలో ఉన్న అస్పష్టతను సూచిస్తుంది.

అట్లాగే "మినీ కవితలో ఒక విధమైన శిల్ప వైచిత్రి పరాకాష్టకు పోతున్నది" ఏమిటి ఆ ఒక విధమైన శిల్ప వైచిత్రి ?

రామమోహనరావుగారి ప్రకారం మినీ కవితకు రెండు ప్రధాన లక్షణాలు మినీ కవితకు ఉచ్ఛ్వాసం 'క్లుప్తత' నిశ్వాసం 'ధ్వని'" అని ఆయన ఉద్దేశం చిన్నసైజు పద్యాన్ని ఎన్నుకుంటే క్లుప్తంగా చెప్పటం తప్పనిసరి

గాథాసప్తశతిని అనువదించటానికి రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారు కంద, గీత, ఆటవెలది పద్యాల్ని ఎన్నుకున్నారు వాటిని ఇతర అనువాదాలతో పోల్చి చూస్తే క్లుప్తత సాధించిన పద్ధతి తెలుస్తుంది. సైజు క్లుప్తతను నిర్ణయిస్తుందనడానికి సందేహించక్కర్లేదు. అందువల్ల మినీ కవిత్వానికి సైజు లక్షణం కాదని నిరాకరించక్కర్లేదు క్లుప్తత వేరే లక్షణంగా చెప్పక్కర్లేదు

ఇక ధ్వనివాదం . మినీ కవితకి ధ్వని తప్పకుండా ఉండాలనటం ప్రమాదకరమైన ధోరణి ధ్వని లేనిదాన్ని కవిత్వం కాదని తోసెయ్యాల్సి వస్తుంది "ఒక భావాన్ని బలంగా చెప్పటానికి" మినీ కవిత కొత్తవాహిక అంటున్న రామమోహన్‌రావుగారు 'ధ్వని'ని తప్పనిసరి లక్షణంగా ఎట్లా ప్రతిపాదించగలుగుతున్నారు ? 'ధ్వని' లేకుండా బలంగా చెప్పడం కుదరదా? లేక బలంగా చెప్పటం ధ్వనితో చెప్పటం ఒకటేనా ?

రామమోహన్‌రావుగారు తమ విమర్శల్లో దొర్లే వైరుధ్యాలను గమనించినట్టు లేదు "మినీ కవితను వాచ్యంగా పొడిగించటం సాధ్యం కాదు. ఏదో ఒక చమత్కారం, వైచిత్రి స్వయం సమగ్రంగా ఉండవలసిందే. అవి ఉన్నంతలో భావప్రచారానికి మినీకవిత పనికిరాదనుకోనక్కర్లేదు భావాన్ని బాగా చెప్పగలవాడికి, మినీ కవితలు వేమన కవితల్లా గుండు దెబ్బల్లా ఉపయోగపడగలవు" అని రాసిన మూడు వాక్యాల్లో మొదటి దానికీ మూడో దానికి వైరుధ్యం ఉంది చాలా వేమన పద్యాలు వాచ్యంగా ఉంటాయి వ్యంగ్యం, వైచిత్రి కావాలంటూ వేమన పద్యాలను పోలిక తీసుకురావటం వైరుధ్యం కాదా ?

రామమోహనరావుగారు చాలా విషయాలను కలగలిపేసి మనని కన్‌ఫ్యూజ్ చేస్తున్నారు. 'చమత్కారం', 'వైచిత్రి', 'శిల్ప వైచిత్రి', 'ధ్వని', 'బలంగా చెప్పటం' — ఇవన్నీ ఒకటే ననుకుంటున్నారు. సైజుని మించిన లక్షణం ఏదో చూపించాలనే తపన వల్ల వచ్చినై ఈ వైరుధ్యాలు. రామమోహనరావుగారు పూర్వం వచన కవిత్వం మీద వ్యాసాలు రాశారు. ఇప్పుడు మినీ కవిత్వం మీద రాస్తున్నారు. రెండిట్లోనూ స్పష్టత పాలు తక్కువ.

రామమోహనరావుగారి క్లుప్తత లాగే రావి రంగారావుగారు 'సంక్షిప్తత' అనే ఒక లక్షణాన్ని ప్రతిపాదించారు. సైజూ ఇదీ ఒకటి కాదు కాని, సైజువల్లే ఇదీ నిర్ణీత మవుతుందని పూర్వం చెప్పుకున్నాం

ఒక్క లైనులో మూడు నాలుగు పదాలు మించకుండా అట్లాంటి లైన్లు పదిపన్నెండుకు మించకుండా ఉండటం సంక్షిప్తతలో భాగంగా చెప్పారు రంగారావుగారు దీన్నిబట్టి సంక్షిప్తతకు, పరిమాణానికి ఉన్న సంబంధం స్పష్టమే "భావప్రకటనకు చాలినన్ని సాధ్యమైనంత అతి తక్కువ సంఖ్యలో తూచి వాడబడటం" సంక్షిప్తతలో భాగంగా చెప్పారు. (రంగారావు 1981) ఇక్కడకూడా సంఖ్య ప్రసక్తి రావటం గుర్తించదగింది పూర్వపు వ్యాసంలో (రంగారావు 1980) "అనవసరమైన పదాలుగాని, భాషాడంబరం గాని వుండకపోవడం సంక్షిప్తతగా" నిర్వచించారు సంక్షిప్తత, పరిమాణం ఎట్లా పరస్పరాధారాలో రంగారావుగారు క్రమంగా గుర్తించినట్టు పై వ్యాసాల బట్టి తెలుసుకోవచ్చు.

ఇక ఆయన ప్రతిపాదించిన రెండో లక్షణం'నవ్య బంధుర శైలి' మొదటి వ్యాసంలో (రంగారావు 1980) దీన్ని 'ఖచ్చితమైన పద నిర్మాణం' అని పేర్కొన్నారు. అంటే ఒక పదాన్ని తీసివేసి ఇంకో పదంతో పూరించటానికి వీలుకాని కూర్పును కలిగిఉండటం (రంగారావు 1981) 'ఒకవేళ అలా చేస్తే సహజత్వం తగ్గిపోవటం కాని, ఒకోసారి పూర్తిగా సారహీనం కావటం కాని జరుగగల దన్నమాట." (రంగారావు 1980) అని వివరించారు.

సామాన్య భాష విషయ ప్రధానమైంది విషయాన్ని గ్రహించగానే దాన్ని బోధించిన వాక్యాన్ని వాక్య సముదాయాన్ని మరిచిపోతాం.

అందువల్ల ఒకరు చెప్పిందాన్ని మరొకరికి చెప్పేటప్పుడు ప్రధాన విషయ బోధ జరిగినా వాక్యనిర్మాణం, పదసంయోజన వేరు కావటం మన అనుభవ పరిధిలోదే అదే కవిత్వం విషయంలో అట్లా జరగ నియ్యం అంటే కవిత్వంలో విషయాన్ని ప్రతిపాదించే శబ్ద సంయోజన కూడ ముఖ్యమే. కోమండూరి అనంతాచార్యులుగారి తాత్పర్యం ఎంత గొప్పగాఉన్నా అది మనుచరిత్ర కావ్యంకాదు.ఆ దేశఅసహిష్ణుత అన్ని కవితా రూపాలకూ సమానమే. అది రచయిత శ్రద్ధను బట్టి, ఉద్దేశాన్ని బట్టి అన్ని కవితారూపాలకు సమానంగా వర్తిస్తుంది.

ఈ నవ్యబంధుర శైలిలో భాగంగా 'లయనిరాసం అనేదాన్ని (ఆయన ఈ మాట వాడలేదు ) సూచిస్తున్నారు. "ఆద్యక్షరమైత్రి అంత్యప్రాసాదులతోపాటు వచనకవితకు అవసరమనుకునే లయకూడా నిర్బంధంగా వుండకపోవడం (ఒకవేళ ఉంటే కృతకంగా వుండకపోవటం") వచన కవిత్వాన్ని గురించి ఆయన అవగాహన అంతస్పష్టంగా లేనట్టు ఈ వాక్యాల ద్వారా తెలుస్తుంది వచన కవిత్వంలో లయ అవసరమని ఎవరన్నారు? ఎవరనుకుంటున్నారు? 'లయ' అంటే ఏమిటి? ఈ విషయాలను గూర్చి వేరే ఇంకో చోట (రామారావు, సంపత్కుమార 1978) విపులంగా చర్చించి ఉండటం వల్ల ఇక్కడప్రస్తావించను. సమధ్వని సంయోజన ద్వారా వచ్చే ధ్వని మైత్రి, నియత విరామ పూర్వక సమపరిమాణాక్షర సంయోజన ద్వారా వచ్చే లయ మినీ కవితా స్వాదనకు భంజకాలని రంగారావుగారి ఉద్దేశంగా గ్రహించ కూడదు పద్య గేయాల్లో ఉండే ధ్వని సంబంధి పద్యత్వాన్ని కవిత్వంలో లేకుండా చేయాలనే లక్ష్యంతోనే వచనకవిత్వం పరిణామం చెందింది అది మినీ కవిత్వానికైనా, పెద్ద వచన కవిత్వానికైనా ఒకటే

నవ్యబంధుర శైలిలో భాగంగా రంగారావుగారు ఇంకో విషయం చెప్పారు. "కవితల్లోపల చెప్పిన మాటల్నే శీర్షికలుగా ఉంచకుండా అదనంగా భావ విశేషానుకూలమైన శీర్షికానామాల్ని కలిగి వుండటం" ఈలక్షణం ఉండాల్సినంత అస్పష్టంగాఉంది జింబో(1980) ఇంతకన్నా స్పష్టంగా ఇట్లా చెప్పారు "మినీకవిత క్లుప్తంగా ఉంటుంది కనుక కొన్ని కవితల్లో శీర్షిక కూడా కవితలో భాగమై పోయి అర్థవంతంగా స్పష్టంగా అర్థం కావటానికి దోహద పడుతుంది" అన్నారు

సాధారణంగా ఒక కవితకు శీర్షిక ఉన్నా లేకపోయినా ఆ ఖండిక అర్థం అవుతుంది ఉదాహరణకు రౌతుబుక్ డిపోవారు అచ్చేసిన కృష్ణశాస్త్రి కృతులలో చాలా వాటికి శీర్షికలు లేవు తరువాత సన్మాన సంఘం అచ్చేసిన సంపుటంలో శీర్షికలు కొత్తగా వచ్చినై. నాయని సుబ్బారావుగారి సౌభద్రుని ప్రణయయాత్రలో 'ఫలశ్రుతి' అనే భాగంలో ఉన్న 21 ఖండికలకు శీర్షికలు లేవు అంటే చాలా కవితా ఖండికలకు శీర్షిక తెలీకపోయినా కవితా స్వాదనకు ఆటంకం లేదని భావం. అయితే మినీ కవితలో శీర్షికను సార్థకంగా ఉపయోగించుకో వచ్చునని రంగారావు, జింబోగార్లు అభిప్రాయపడుతున్నారు. అయితే ఈ రకమైన టెక్నిక్కు ఇతరులు కూడా పూర్వం వాడుకున్నారు. బసవరాజు అప్పారావుగారు "మామిడి చెట్టును అల్లుకున్నదీ మాధవీ లతొకటి" అని ఒక పాట రాశారు దానికి 'తాజమహల్' అనే శీర్షిక పెట్టారు. ఆ శీర్షిక లేకపోతే అది అర్థం కాదు. శీర్షిక కవిత్వంలో భాగం కావటం ఒక మంచి టెక్నిక్ అనటానికి అభ్యంతరం లేదు. అయితే అది మినీ కవితకు ప్రత్యేక లక్షణంగా చెప్పడం కుదరదు. పైగా అన్ని మినీకవితలకూ అది వర్తించదు. కొన్ని మినీకవితలకు పెద్ద కవితలకు వర్తించినప్పుడు అది మినీ కవిత్వాన్ని నిర్వచించే లక్షణం ఎట్లా కాగలదు ?

రంగారావు (1981) గారు మూడో లక్షణంగా 'భావాధిక్యము' అనే అంశం ఒకటి ప్రతిపాదించారు ఈ అంశం కింద మూడు విషయాలు ప్రస్తావించారు. వాటిని ఇక్కడ ఉటంకిస్తాను.

7 "తక్కువ జ్ఞానం మినీ (కవిత) లో నుండి సాధ్యమైనంత ఎక్కువ అవగాహన (లోతైన భావాలు) ను ఆవిష్కరించుకొనగలిగే శక్తి పాఠకులలో పెంపొందింపజేసేటట్లు వుంటాలి."

8 "భావాలలో గాని ఉపమానాలలో గాని ...... కనీసం ఒక్కటిలోనైనా సరికొత్త సోకడ (ఎంగిలి కానివి) కలిగివుండటం"

9, "హృదయానందాను భూతి ద్వారా పాఠకులలో స్పందన కలిగించే చమత్కారం కలిగి వుండటం"

"భావాధిక్యం" పేరుతో చెప్పిన ఈ విషయాలు చర్చకు కూడా లొంగనంత అస్పష్టంగా ఉన్నాయి. 'చమత్కారం' అనేది మాత్రమే అర్థమవుతున్నది దీన్నే శిల్పవైచిత్రి, ధ్వని అని రామమోహనరావు గారు అన్నారు. జింబో దీన్నే 'మలుపు' అన్నారు ఆయన మాటల్లో, చాలా మినీ కవితల్లో చివర్లో మలుపుంటుంది. దాంతో ఆ కవిత అందం వస్తుంది. గమ్మత్తైన మార్పు జరుగుతుంది," (జింబో 1980) మురళీధర్ చమత్కారం, వ్యంగ్యోక్తి అని పిల్చారు. అయితే అన ప్రాసను, ఈ 'మలుపు'కు గుర్తుగా గుర్తించి ఒక మినీకవితను ఉదాహరించారు

'మాకు కావాలి ఉక్కు
దిక్కు లేక చిరాకు
ఇది మా మంత్రుల పరాకు

దీన్నిబట్టి చూస్తే కవిత చివరి భాగంలో అంతకు పూర్వపు పద్ధతికన్నా నిర్మాణరీత్యాగాని అర్థరీత్యాగాని భిన్నత్వం ఉండాలని వీరి భావంగా గ్రహించవచ్చు. చాలా చర్చకు గురైన జయధీర్ తిరుమలరావుగారి ఈ కవితను చూడండి.

"ఆకాశం
చుక్కల రవికెను చించి
వెన్నెల బ్రాహుక్కు
చంద్రుణ్ణి పీకి
నీలం అంగా
నలుపోణీ లాగి పారేస్తేగాని
రేపు కాదు"

ఇందులో ఉపయోగించిన రూప కౌచిత్యం సంగతి వదిలేద్దాం. 'రేప్'- 'రేపు' అనే ఇంగ్లీషు తెలుగు మాటల స్ఫూర్తి వల్ల వచ్చిన చమత్కారం ఇది. ఇట్లా కవిత చివర్లో రకరకాల మార్గాల అన్ఎక్స్పెక్టెడ్నెస్ ని శబ్దార్థాల సహాయంతో చెయ్యొచ్చు. అయితే ఇది మినీకవితకు మాత్రం దత్తమైన వరం కాదు. గేయాల్లో ఇట్లాంటివి చాలా ఉన్నాయి. ఎంకిపాటల్లో 'కలలోన నా యెంకి' అనే పాటలో "ఒక నేనే నీకు పెక్కు నీవులు నాకు" అనే చివరి లైన్లలో భిన్నత్వం ఉంది. కృష్ణ శాస్త్రిగారి 'ఆమె కనులు' అనే పద్యంలో "ఏదియో అపూర్వ మధురశక్తి స్ఫురియించుగాని అర్థమ్ము గాని భావగీతమ్ము లవి" అన్న చోట ఇట్లాంటి భిన్నత్వం ఉంది. నాయని సుబ్బారావుగారి ఫల్గుణతి లోనూ, మాతృగీతాల్లోనూ ఇట్లాటింవి చాలా ఉన్నై.

వత్సలా ఫాలమున నెలవంక గుఱుతు
కందళించి వికాసించి కళలు దేరి
తరుణ శారద రాకా సుధాకరాచ్ఛ
బింబములనంతములు లెక్క పెట్టుకొనెడు.
ఈ యమర్త్యాచ్ఛ చంద్రికలెన్నినాళ్లు
నా తనువు ముంచుకొను నన్నినాళ్ళు ఒక్క
యీ శరత్తేమి నాది సదా శివతత్వ
పదవి

(సదా=ఎల్లప్పుడు, శివతత్వ పదవి = మంగళప్రదమైన పదవి. ఇంకో అర్థంలో సదాశివునితో పోలిక)

అన్నమాచార్యులవారి సంకీర్తనల నిర్మాణాన్ని పరిశీలిస్తూ ముగింపులో విశిష్టతను గూర్చి వేరేచోట చూపించాను (రామారావు 1982)

ఇంతకు కొందరు సెటైర్ అని (జింబో, 1980) మరికొందరు 'ఆటోప్రిన్సిపుల్' అనీ (రంగారావు 1981) ఆటో ఇంటర్ప్రెటేషన్ అనీ (స్వవ్యాఖ్యానం) (హరిశ్చంద్రరెడ్డి 1980) బహుళార్థక సాధకత అనీ (రంగారావు 1980, 1981) ఇట్లా రకరకాల కాన్సెప్ట్స్ ప్రతి పాదించారు. చర్చించదగిన స్పష్టత వాటికి లేకపోవటం వలన వీటని గురించి చర్చించను.

ఇంతకి మినీకవిత్వానికి మాత్రమే పట్టే లక్షణాలేమిటి ? అని చూస్తే ఒకటేననిపిస్తుంది. అది సైజు మాత్రమే. అయితే ఇది కూడా అబ్సల్యూట్ వాల్యూ కాదు. రిలెటివ్ వాల్యూ కవిత్వం ఏ సైజులో ఉన్నా కవిత్వమే.

## రిఫరెన్సులు


1 జింబో (1980)... మినీ కవిత్వం. భారతి 57. 9. 65-68

2. తిరుమలరావు, సర్దేశాయి (1980) మినీ కవిత, మార్క్సివ్యాఖ్య భారతి: 57. 5. 64 - 66.

3. మురళీధర్ (1980) మినీ కవిత భారతి 57. 9. 74 -75.

4. రంగారావు, రావి (1980) మినీ కవిత. భారతి 57.4. 60-64

5. ,, ,, (1981) ఆధునిక కవిత్వం - మినీ కవిత భారతి 58.2.51 - 54.

6. ,, ,, (1983) మినీ కవిత – పాదవిభజన భారతి 60 10 68 - 70

7. రామమోహనరావు, అద్దేపల్లి (1980) మినీ విప్లవానికి మార్క్సి ఆహ్వానం కొల్లూరి (సం.) 'మినీ కవితా విప్లవం' లో అమలాపురం ; ఎక్సరే పబ్లిషర్సు

8. "రామారావు, చేకూరి (1982) పద నిర్మాణంలో భాషాదృష్టి భారతి 59.5.49 – 9

9. రామారావు చేకూరి అండ్ కోవెల సంపత్కుమార (1978) వచన పద్యం · లక్షణ చర్చ హైదరాబాదు : నాగార్జున ప్రింటర్స్

10. షమా (1981) మినీకవితలు, మెస్నీప్రశ్నలు భారతి 58. 1. 74-75

11. హరిశ్చంద్రా రెడ్డి ఎచ్, (1980) శ్రీ రావి రంగారావుకు మినీ సలహా. భారతి 57.6.71

# పరమాత్ములు కండి!

శ్రీ రంధి సోమరాజు

అనంతానంత ఆశామధురిమల
గోళాకృతీ సిద్ధాంత ప్రవచనాల
సోకు లెగజిమ్ముకున్న పాలపుంత కుక్షిలో
తల ఎత్తిన భవిష్యత్ సౌధం!

ఏకోశానా మమతా మానవతలు కలలు కనని
సుంతైనా ప్రేమాభిమానాల వాస్తవికత తెలియని
అక్కున చేర్చుకోని అసలు అవగాహనే లేని
మార్వలెస్ కంప్యూటరైజ్డ్ సూపర్బ్ డాక్టరేట్ బుర్ర
బురగుంజులేని వృత్తతాట్టెంక!

ఏమీకాని ఏమీలేని వియత్తలా అది
మనోమోహనానంద నక్షత్ర దీపికా భద్ర శయనాగారం
బ్లడీ బ్లూ సౌందర్యం!

అందుకే యీనాడు అశ్లీల ప్రసూనాల వెలిగిన
నయనాల వెర్రెత్తిన బ్లూ ఫిల్ముల
యింటింటి వీడియో దూతికల
కలర్‌ఫుల్ కల్చరల్ మహోత్సవాలు!

అంతటావృత్తి నైచ్యాల గూడు పురాణీలు
అనంతస్త్రీటజీల ప్రాణాలతోడేసే పొల్యూషన్ కంపు
మధురోన్మత్త వ్యూహా సౌరభాల చేజిక్కిన సౌఖ్యాల
తలెత్తిన హింసా ప్రవృత్తి!

తల్లీ కొడుకూ, తండ్రీ కూతురు, అన్నా చెల్లీ
అనుబంధాల సభ్యతలు కిందమీదై
ఎరగని ఎరిగిన విపరీత మనస్కులు—
సెక్స్‌పశువులు....
అలినమమానించి, అసిస్టెంటుల
శాస్త్రోక్తంగా ఉసిగొల్పే గేట్‌కొజ్జా ప్రొఫెసర్లు
ప్రేమా జాలీ, ఉత్సుకత, ఆప్యాయత, తృప్తి
పరమానందం బ్రహ్మానందం చెత్తావేదాంతం

మూల మూలల కిసిరేసి
రంగుల రాట్నాన మోహనంగా తిరుగుళ్ళ తిరుగుతూన్న
బడా దేశ దేశాధ్యక్షులు!

కళ్ళు తిరిగినా వెనక్కి ముందుకు తూలిపడనివారు
ఓడ్కా, షాంపేన్‌ల తెగ తాగినా మైకం రానివారు
సవాలక్ష శక్రటరీల వీపుల దాపులున్న వారు
క్షణక్షణావగాహనా దక్షులు
చూపులున్నా అక్కర్లేని వారు
విశ్వావధుల నువ్వేక్కడున్నా చూడగల దేగలు
మహత్తరమైన టాక్యూన్ కిరణర్యక్షుల కోసం కృషి చేస్తున్నవారు
హేమాహేమీ మల్లయుద్ధ ప్రవీణులు
(రే)గన్ (ఆండ్రి) పోప్(పూవు) గన్ పూలు—

వాళ్ళకే తెలియని ఏక్టివ్ లాభాల లాలూచీ పోటీ మనస్కులు
నేనింత నువ్వంత, నువ్వింత నేనంతగా
చేతులు కలిపేసుకొని కనబడకుండా ఒకే ఒక్క, వ్యక్తిగా రూపొంది
అర్థనారీశ్వరులై నంజుకు తింటున్నవారు
ఎడమొగం పెడమొగం మొగుడూ పెళ్ళాల ఆటలాడు కిలాడీలు
సృష్టించిన అస్యవ్యస్త ప్రపంచార్థిక పెనుమంటల వేగించు కిరాతకులు
వెన్నెల శాఫో యిచ్చిన ఫచ్చి రొమాన్టిక్ కలల ఉన్మాదులు
హృద్యమచిత్రమాలికా మాన సోల్లాస
కలర్డ్ వీడియో టేపుల గడసానులు!

ఆకుల్లేని మొండి వికాలాకారాల కొమ్మల కాండాల
వికృత రూపాల చూడనొల్లని అసలే ఒల్లని మొగుళ్ళ
అణువుల చీల్చేసే క్షుధార్తుల కేకలు పట్టించుకోని
వ్యధాకులిత మనస్కులుకాని అదృష్టవంతులు!

లేమితో దుఃఖాశ్రు రోదనల కృశించి పోతూన్న
స్త్రీ దేశాల వేవిళ్ళు చూసి
కారు చీకటి నవ్వుల మొగాన మెరిపించువారు
వారు అణ్వస్త్ర సౌందర్యాల ఊరువులు

ఫేషన్డ్‌బ్లౌజ్ జిప్పుల నక్కిన బ్రాల ఒదిగిన
స్తనద్వయం పిండుకొన్న నెత్తుటేరలుచూసి
కళ్లు చెమర్చని వారు
ఆరీఆరని మరకల పండిన అరచేతి
గోరింటాకు రొమాన్స్ పిచ్చుకలూ వారే...
వచన కవితా నేకెడ్ డాన్సుల ఊపులూవారే...
ఏ.సి. ప్లిమత్ బులెట్‌ప్రూఫ్ కారు పరుగుళ్ళ
సుతిమెత్తని మనోజ్ఞ బృందావనీ
వనవిహారాల మధురోహల ఎదిగిన
ఎమోషన్డ్ ఓవర్ హెల్మ్‌డ్ ఎంజాయిమెంట్ల
రమణీయార్ధ రమణీయకతలూ వారే...
టెస్ట్‌ట్యూబ్ బేబీల ననంతంగా పుట్టించి
క్లోనింగ్ మైరావణుల ఉసిగొల్పి
జనాభాను అంతం చేయజూస్తున్న వారూవారే ...
వారు....వారు....
ఉన్నఇంటిని కూల్చేసుకొని గ్రహాలచుట్టూ తిరుగు గ్రహాలు !

సామాన్యులు నిరుపేదలు వారి కళ్ళకాపడే మార్గం ఎక్కడ ?
కొండగోపురాల నిండుకాపురాల గుడి కొండల ముండదాకిరీలు కన్న
నికృష్ట ప్రజ!
కినక తప్పదు మరో శిశువుని... అనంతుణ్ణి... !

కూడుపెట్టని ఎవర్ గ్రీన్ ఎర్త్ యిచ్చిన సమన్లు చేతబట్టి
బతికేందుకు వీలులేని సమస్యల వెడల్ప యిరుక్కొని
దొంగలుగా బందిపోటులుగా దోపిడీదారుల కండగా
దొంగనోట్ల కంపోజిటర్లుగా
స్మగ్లర్లుగా ఏలాగో ఎలాగో యెదిగి, ఎదిగి
సర్వ సన్యాసోత్తమ మోక్షమార్గా దృక్పథుడు
యోగ విద్యా ప్రయోగాధ్యక్షుడు
పప్పులో కాలువేసి
ప్రభవింపజేసిన మరో క్షిపణీజన్మ నూడబెరుక్కొని
కయ్యమన్న గోముఖ వ్యాఘ్రం అంబా అరుపుల
నమ్రగంగ అవగాహన చేసుకొని
అడల్ట్రేటెడ్ కాని విషపూరిత క్షీరానలం గడగడత్రాగి
కోడి రామ్మూర్తులై
ప్రపంచాధి నేతలు కాక తప్పదు !

ఓ నా బంగారు తండ్రులూ...
విరుచుకపడండి ఫ్లేష్‌లా ఉరకండి అంతటావ్యాపించండి
విజయోత్సవాల చిరునవ్వుల మొలిచిన చలిచీమల పుట్టై

నియో మోడరన్ ఎలక్ట్రానిక్ గన్నై
ఐ. బి. ఎమ్. ఫ్యూచర్ పోరాటాల శక్తియుక్తుల చిరంజీవులై
అడుగిడండి...

అజంతా ఎల్లోరా కోణార్క చిత్రాల శిల్పాల
చూసి చూసి బ్యుర తిరిగి
క్షుద్ర గోపికల చుట్టూ పరిభ్రమించాలన్న కోరికలను చంపుకొని
జీవితాన్ని సమప్ చేసుకుంటూన్న
మనసును కుదుట పరచుకుంటూన్న
"నేనే సమస్తం.. " అన్నమాటలోని అర్థం
నియంతల సృష్టించినందుకు కుమిలిపోతూ
మాస్కో న్యూయార్క మల్టీ స్టోరీడ్ భవనాల
చిట్ట చిరారు కొమ్మల అంతస్తుల
ఈ కొసనుంచి ఆ కొసకు శయనించిన
శ్రీ కృష్ణపరమాత్మణ్ణి—
వారి కాలి బొటన వ్రేలిపూవుల ఆలోచనలనూతన వేదాంతం సహించలేక

ఫెర్‌ఫెక్ట్‌గా షూటుచేసి
దారుణంగా చంపిన పాపానికి
అవధిలేని జీవనాడుల చెలరేగిన సంక్షోభం శిక్షై
అదే అదే... వటుడింతింతై నట్లు తిరిగి తిరిగి
కక్షగాతల ఎత్తిన పరమాణువై
కుమ్ములాటల విజృంభించి వాళ్ళల్లో వాళ్ళే
నరుక్కు చచ్చేట్టు చేయగా మిగిలిన యాదవులు
యింకా బతికే వున్నారు!
ఆఫ్గనిస్థాన్ గ్రెనెడాల దిగమింగి
నోబిల్ ప్రైజ్ విన్నర్ వాలెసాకు సమన్ల శుభలేఖలంపి
ఇరాన్ ఇరాక్‌ల నెగళ్ళ ఎగదోస్తూ
తైలరాజ్యాల ఆయిలంతా తమ నెత్తురై శరీరాన
ప్రవహించే ఎత్తులేస్తూ....
లెబనాన్ సిరియాల చల్లగ కాలిడుతూ
మెల్ల మెల్లగ బులి బుల్లి చేపల మింగే
ఆకలి లేని ఆకటి తిమింగలాలు !

పాకిస్తాన్ కాళ్ళకి
భారతావని మెదడుకూ
జవసత్వాల వైద్యం చేయ
మడికట్టుకొన్న కొంగ డాక్టర్లు!

మడితడితో ఏపిల్‌పళ్ళ వక్షోజాలు
ఊరకనే బయిటపడి పోతూ వుంటే

నేకెడ్ తొడల చిక్కని అందాలు మరి మరి చూపి
అప్పుల కూరట, పచ్చళ్ల వొయ్యారంగ వడ్డిస్తూ
ముద్దుల క్షిపణీ తాంబూలాలు
మురిపిస్తూ ఊరిస్తూ నోటబెట్టి
మట్టి కరిపింప జూస్తున్న మేధావులు
అరపండిన దానవులు !

ఉత్త పిరికివారు
అణు ఆయుధాల తమచుట్టూ కాపలా ఉంచుకున్నవారు
లంకాకు చుట్టలు రెండు ప్రెజెంట్ చేసి
చిన్ని అగ్గిపుల్లతో
సస్నేహంగా ముట్టించండి... ఆ మాత్రం వేడి తగిలితేచాలు
గోవిందో.... గోవింద...
సంస్కారం సున్నగా
సౌభాగ్యం మిన్నగా
ఎదిగిన వాళ్ళు... వాళ్లు...
పరమ మూర్ఖులు
మానాభి మానాలు లేని బాస్టర్డ్స్...

వద్దు వద్దు వధించకండి
మిమ్మల్ని మీరే ఉద్ధరించుకొని
మారిన సత్పురుషులు మీరు
సజ్జనులు ...మానవతా వాదులు...
మీరు విజ్ఞాన నేత్రులు
అంతః శక్తుల సౌజన్యంతో

మహోన్నత శిఖరాగ్రాన ఉన్న వారు
చెట్ల చిగుళ్ల అంటినాలుగా చేయచూస్తూ
సిలికాన్ చిప్స్ కంప్యూటర్లుగా విజృంభింపచేస్తూన్న ఈ రోజున
మీలోదాగిన మానవతా మనోనేత్రం మహాగ్ని జ్వాలగా ప్రజ్వలింపజేసి
ఈ అనర్థశక్తుల నరికట్టండి...

ఈ చుప్పనాతి సానులమీద
లోచూపు లేని తుపాకి కొండముచ్చుల మీద
ఉడికిపోయి ఉమ్మొద్దు
కడుపు మండి కొట్టొద్దు
అణుకురుపుల వికృత ముళ్ళ జంతువులు వారు
వాళ్ల ఉత్త ఆకతాయి కుర్రాళ్లు
సిగరెట్ ముట్టించిన లైటరుతోనే
నిండు జాలీ ప్రపంచ థియేటర్ను తగలెట్టేస్తున్నారు.
కుళ్ళకుండా దాచండి వారిని
పసివాళ్లు చూసి ఎంచక్క పళ్ళికిలిస్తారు !

మీరు మాత్రం—
కటిలిట్ చిలకల సత్యవార్తల జాంపళ్ల పెడ్తూ
ఊర్వశీ అంతరిక్ష నౌకల మానవతా దివ్యగానాలు వినిపిస్తూ
నికొలస్‌రోరిక్ గుండెలోని రంగుల చైతన్యం
దివినిండా చూసి మానసోల్లాసాన్ని పొంది
ప్రశాంతంగా మనండి ..
పరమాత్ములు కండి !

# కిటికీ

## శ్రీ రాణి శివశంకరశర్మ

కిటికీలో ఉదయాలు అస్తమయాలు
నక్షత్రాలు సూర్య చంద్రులు
బాటసారుల ముఖాలు
క్షణాలు రోజులు సంవత్సరాలు
క్షణం నిలకడ లేకుండా కరిగిపోతాయి
ఎప్పటికప్పుడు కిటికీ ఖాళీ అయిపోయి
కొత్తవాటితో నిండు కుంటుంది.
ఎప్పటికప్పు డన్నిటినీ చిల్లుజేబులా పారవేసుకుంటూ
పురాతన స్మృతిగా మిగిలిపోతుంది కిటికీ.
ఇంకిపోయిన పూర్ణిమల్ని మళ్ళీ వెనక్కి తిప్పలేదు కిటికీ

అనంత సంగీతాన్ని తనలో దాచుకొన్న శూన్యమైన వెదురు బొంగులా
ఇంత విశ్వాన్ని ఊచల వెనుక బంధించుకొన్న కిటికీ
పారిపోతున్న ప్రాణాల్ని పట్టుకోలేని దేహంలా
గడిచిపోతున్న కరిగిపోతున్న అద్భుతమైన కాలాన్ని
పట్టుకొని నిలపలేదు క్షణమైనా
ఇట్లా జారిపోతున్న నక్షత్రాల్ని వెన్నెలల్ని లేయెండల్ని
చూస్తూ కిటికీని ప్రతిమాలుకుంటాను.
"ఆ నక్షత్రాల్ని ఇంకొక్క క్షణం నిలుపు
ఆ వెన్నెలని ఒక్క క్షణం అలాగే వెలగనీ."

అంకితం- "గోపీచంద్‌కి"

శ్రీ ఎ. విజయ దత్తాత్రేయ శర్మ

# నెల్లూరు జిల్లా గ్రామనామములు ఒక పరిశీలన

( గత సంచిక తరువాయి )

### సంస్థానములు/జమీందారులు

**వెంకటగిరి :**

వెంకటగిరి వెలుగోటి వారిమూలపురుషుడు చెవిరెడ్డి. అతనికి ఆరవ తరము వాడు మాదన. చెవిరెడ్డిపల్లి (వెం), మాదన్నగారి పాలెం (ఆ) పైవారి నామముల నేర్పడియుండును. వెలుగోటిపాలకులకు సాధారణమైన "యాచ" తరంగా వెలసిన పెదయాచవరం, యాచవరం యాచసముద్రం, పెదయాచసముద్రం గ్రామములు వెంకటగిరి తాలూలోనే వున్నవి. ఈ వంశములోని కస్తూరి రంగప్పనాయని (1570_1600) పేర కస్తూరినాయుడుపల్లి (కా) వున్నది. అతని ఆరవ పుత్రుడు,విజయనగర శ్రీరంగరాయల (1642-59)సమకాలీనుడైన కుమార యాచమ.'విద్వత్' సర్వజ్ఞ కుమారయాచమ (1695-1748), కుమార యాచమ (1776_1804)లలో ఎవరి పేరునైనగాని వీరకుమార యాచసముద్రం (వెం) రూపెత్తి యుండును. నాయుడు పేట (సూ) బంగారుయాచమ నాయని పేరును తెచ్చుకొన్నదిగా గుర్తించబడినది.[32] అయితే వెలుగోటివారిలో ఇరవైరెండవ తరము వారైన బంగారుయాచమ (1755_77), బంగారు యాచమ (1776_1804)లలో ఎవరు పై గ్రామనామ కారకులో ఇదమిద్ధముగా తెలియదు. అదే సమస్య బంగారుయాచసముద్రం (వెం), స్వర్ణయాచసముద్రం (వెం) గ్రామనామ ప్రేరకవ్యక్తుల నిర్ణయములోనూ తల యెత్తును. పాపమాంబ. అక్కమాంబ బంగారుయాచమ (1755-77) భార్యలు వారి పేర పాపమాంబాపురం (వెం) అక్కమాంబాపురం (వెం) జాతిపల్లి అక్కమాంబాపురం (రా) వేపినాపి అక్కమాంబాపురం (రా) వెలసినవి. అక్కమాంబా బంగారుయాచమల పుత్రుడైన సర్వజ్ఞకుమార యాచమనాయనికి (1695_1748) విద్వత్కుమార యాచేంద్రులని పర్యాయనామములుగలవు. విద్వత్ కుమార యాచసముద్రం(వెం) అతని పేరున రూపెత్తినది. వెంకటగిరివారి కూటస్థుడైన పినకొండపనాయకుని భార్యలలో నొకయామె పేరు కూడా అక్కమాంబయను సంగతి పై అక్కమాంబా పురగ్రామ నామచరిత్రా చర్చసందర్భమున దృష్టి యుంచుకొనవలసియున్నది. పినకొండపనాయకుని మరియొక భార్యయైన సింగమాంబ పేరుననే సింగమాంబాపురం (వెం) వెలసి యుండును. రాజగోపాలకృష్ణ యాచేంద్రులు (1857-1916) వీరు "వెంకటగిరి తాలూకాలోని గొల్లపల్లి"యను గ్రామమును తృణకాష్ఠజల సమృద్ధిగా వృద్ధిపరిచి లక్ష్మీనరసమాంబాపురమని తల్లిపేర దానిని అగ్రహారమొనర్చి కవి పండితుల కర్పించారట "33" వెంకటగిరి జమిందారొకాయన ఇక్కడ (సూళ్లూరుపేట తా॥) గల కల్యాణి వెంకటేశ్వర దేవాలయాభివృద్ధికి పదెకరాల మాన్యం ఇచ్చారు. తన అక్కగారి పేరుమీదుగా ఈ ప్రాంతాన్ని అభివృద్ధి పరిచారుట. అందుకే దానికి అక్కమ్మపేట అని పేరు వచ్చింది వాడుకలో అదే అక్కంపేట అయినది [34]

**కాళహస్తి :**

కాళహస్తి సంస్థానము నెల్లూరుమండలములో కూడ విస్తరించుకొని యుండెడిది. అంతేకాక వెంకటగిరి వారితో వివాహసంబంధములు కూడ కలవు. కామినేనిరామానాయుడు కాళహస్తి పాలకుల మూలపురుషుడు. కామినేనిపాలేం (కో), రామసాగరం (రా) రామాపురం (సూ&వెం)గ్రామములలో నేదైన అతనికి సంబంధించినది కావచ్చును. వారిసంతతిలో ముఖ్యుడైన చెన్నప్పపేరుమీదుగ చెన్నసముద్రం (వెం) చెన్నప్పగారిమిట్ట (గూ), చెన్నయపాలెం (కా) గ్రామనామములేర్పడియుండును కాళహస్తి దామెర్ల వారిలోను, వెంకటగిరి వెలుగోటి వారిలోను కూడ తిమ్మనామధారులున్నారు. వెంకటగిరి తాలుకాలోనివైన తిమ్మనగుంట, తిమ్మాజి కండ్రిక తిమ్మాయిపాలెం గ్రామములు రెండవ వారికే చెందినవనుటకు ఎక్కువ ఆస్కారమున్నది. వెలుగోటి తిమ్మభూపాలుని కుమార్తె వెంగళాంబిక దామెర్ల ధర్మభూపతి భార్య. వెంగమాంబాపురం (వెం&సూ&గూ), ధర్మారావుచెరువుపల్లి, ధర్మారావు చెరువు కండ్రిక (ఆ) వారివలన నేర్పడినవై యుండును. వెంగళాంబ కోడలులక్ష్మమ్మ. లక్ష్మక్క కండ్రిక గూడూరు తా॥లో ఉన్నది.

లక్ష్మమ్మ కుమార్తె వెంకటాంబ వెలుగోటి కస్తూరిరంగని భార్య వెంకటమ్మ పేట ఉదయగిరి తా॥ ఉన్నది

ముస్లింపాలనా ప్రభావము :

ఈ జిల్లాలో పూర్వంసాగిన ముస్లిం పాలనా ప్రభావ సూచితము లుగ ఈ క్రింది గ్రామనామములు కానవచ్చుచున్నవి,

అక్బర్‌నివాసఖండ్రిక, లాలాపేట్ (వెం) అల్లీపురం (నె), అబ్బా సాహెబ్ పేట, అక్బర్‌బాద్, హాసన్‌పురం (ఆ) జఫాల్‌పురం (రా) మహమ్మదాపురం (ఉ)

మహారాష్ట్ర ప్రభావమును సూచించు నొక గ్రామము కన్పట్టు చున్నది. అది మురహరిరావు దండోరావు ఖండ్రిక (వెం)విజయనగరం శ్రీరంగరాయల కాలం (1572-85)లో మాలిక్ ఇబ్రహీం కుతుబ్‌షాచే నియుక్తుడై కర్నూలు పేరును కల్లోలపరిచి కొండవీడును కూడా ఆక్ర మించుకున్న (క్రీ.శ. 1580) మురహరిరావు అనే మరాఠా బ్రాహ్మణ సేనాని పేరున ఇది మా రూపెత్తినదేమో ?

## వ్యక్తినామ ప్రభావము :

తుమ్మలతలపూరు :

గ్రామనిర్మాత పరంగా తలప్పనాయడూరుగా మొదట్లో పిలువ బడి తర్వాత తలుపూరుగా పరిణామం చెందినదని ఇక్కడ తుమ్మచెట్లు విస్తారంగా ఉండేవి కావున తుమ్మలతలుపూరుగా వ్యవహరింపబడు చున్నదని తెలుస్తోంది.[35]

బుచ్చిరెడ్డిపాలెం (కో) :

బుచ్చిరెడ్డి అనేవ్యక్తి ఈ గ్రామనిర్మాతకావడం చేత అతని పేరే గ్రామనామమైనట్లు తెలియుచున్నది.[36]

మహిమలూరు (ఆ) :

పాకనాటినుంచి వలస వచ్చిన ఒకానొక "మహిమలు" అనే వ్యక్తి గావున అతని పేరే గ్రామనామమైనదని ఒక వివరణ[37]

బాలయపల్లి (వెం&ఉ)కొండయపాలెం (నె&ఉ) నాయుడుపాలెం (కొ&వెం), మల్లయపాలెం (కా&సూ): బసవాయిగుంట. చక్రకాచార్యుల ఖండ్రిక,చిన్ననపేట,చింతగుంటవెంగన్నఖండ్రిక,జోస్యులఅప్పలాచార్యుల ఖండ్రిక, కుప్పయిపాలెం, లింగంనాయుడుపల్లి, లింగారెడ్డిపల్లి, ముమ్మయ పాలెం, మురహరిరావు దండోరావు ఖండ్రిక నాయుడువేరువు ఖండ్రిక పాపిరెడ్డిపల్లి, పూలరంగడుపల్లి, రాఘవరెడ్డిపాలెం రామశాస్త్రులవారి ఖండ్రిక. సూరయపాలెం, తిమ్మనగుంట, తిమ్మాజి ఖండ్రిక, తిమ్మాయి పాలెం, వర్ధన్నపల్లి, య్యెరంసెట్టిపాలెం, వెంగమనాయుడుపల్లి, వెంకట రెడ్డిపల్లి (అన్నివెం). అద్దాన్నపు నారాయణకట్టుబడి, గోనునరసాయ పాలెం, గురవాయిపాలెం, కేశమనేనిపాలెం కృష్ణారెడ్డిపల్లి, తిమ్మనరాయ పురం,తిప్పారెడ్డిపల్లి,వీరయ్యపాలెం(అన్నిరా)గోపాలరెడ్డిపాలెం,కానూరు ధర్మారాయి ఖండ్రిక, కారికాడుదామరాయ ఖండ్రిక, కేశవరెడ్డిపాలెం కొమ్మినేని పల్లి, కృష్ణారెడ్డికాగెలు, రామచంద్రగంట, సర్వారెడ్డిఖండ్రిక (అన్నిసూ) చింతారెడ్డిపాలెం, వేదయపాలెం వెంకనపాలెం (అన్నినె) అయ్యపరెడ్డిపాలెం, గంగనపాలెం పోతునాయనిపల్లి రుద్రయపాలెం, వెంకటరెడ్డిపాలెం (అన్నిగూ) చిట్టయపాలెం ధర్మారావుచెరువుపల్లి, కాలయపాలెం, కామిరెడ్డిపాడు, నాలయపాలెం (అన్ని ఆ) చెన్నయి పాలెం, కాటాయిపాడు, వీరన్నకొల్లు, వెంకనపాలెం, (అన్నికా) అయ్యన్నపల్లి బండగానిపల్లి, బాసినేనిపల్లి, కదిరినేనిపల్లి,కోటయపాలెం, మందలనాయుడుపల్లి, మారమ్‌రెడ్డిపల్లి, నాగినేనిగుంట, పెద్దిరెడ్డిపల్లి, పుల్లయ్యపల్లి, సింగారెడ్డిపల్లి, ఎర్రబొట్లపాలెం, ఎర్రంరెడ్డిపల్లి (అన్నిఉ) చల్లయపాలెం అలగానిపాడు కామినేనిపాలెం, రామన్నపాలెం, పోలి రెడ్డిపాలెం, రమణయ్యపాలెం, వెంకన్నపురం. ఎల్లయపాలెం (అన్నికో)

ఊరిపేర్లు : ఇంటిపేర్లు

గ్రామనామములకు గృహనామములకు అవినాభావ సంబంధ మున్నది ఇంటిపేర్లే గ్రామనామములుగా నున్న సందర్భమునకు ఉదాహరణలు క్రింద ఈయబడుచున్నవి

చింతపల్లివారిఖండ్రిక కండలవారిఖండ్రిక కోవూరివారిగుంట బోగులవారిపల్లి. సుంకరవారిపల్లి, సురభివారిఖండ్రిక, వెంపటివారి పల్లి, యెల్లావఝలపల్లి (అన్ని వెం) భీమలవారిపల్లి కారుమంచివారి ఖండ్రిక నాదెళ్ళవారిఖండ్రిక, పొదిలివారిఖండ్రిక,(అన్నిసూ) బంగారు వారి దొరువు ఖండ్రిక, వల్లూరివారిఖండ్రిక (నె), ఉడతావారిపాలెం పాకాటివారిఖండ్రిక, (గూ) కుంకావారి పాలెం (కా), గంగులవారి చెరువుపల్లి ఉప్పలవారిపల్లి సున్నంవారి చింతల (ఉ) ఆనెం భట్లవారిఖండ్రిక, బొడ్డువారిపాలెం, కాలంభొట్లవారి ఖండ్రిక(అన్ని కో సముద్రాలవారి ఖండ్రిక (రా)

పైవాటిలో చింతపల్లి, కోవూరి, కారుమంచి, నాదెళ్ళ వల్లూరి పాకాటి (పాకాడు) మొ॥ గృహనామములు వైరొకచోట్ల గ్రామనామ ములై యుండుట గమనించదగిన విషయమైయున్నది.

కాసులనాటివారిఖండ్రిక రాపూరు తాలూకాలో నున్నది. కాసులనాటి-కాసలనాటి-కాసలనాడు ఇది విప్రశాఖలలో నొకటి "తెలం గాణములోని పటం (ప్రోట్ల) బెజవాడ ప్రాంతమున నివసించు వారికి కో లేయులని వాడుక. ఆ ప్రాంతమునకు కాలక్రమమున కాసలనాడని పేరు కల్గెను. అందలి వైదిక బ్రాహ్మణులకు కాసలనాట్లపేరు"[38] కాగా "కాసలనాడు" అనగా వనపతి దీర్ఘాసిశాసనమున చేర్కొనబడిన దశి

కోసల. ఇది ఉత్కళ దేశమునకు దక్షిణ పశ్చిమ ప్రాంతముననున్నది. తూర్పు సముద్ర తీరమునకు నూరుమైళ్ళ దూరముననున్న ప్రదేశము. ఈ ప్రాంతమునుండి వచ్చిన బ్రాహ్మణులకు "కోసలేయులు" లేక కాసలనాటు" లని యందురు [39] ప్రస్తుత సందర్భమునకు కాసలనాటి యదార్థస్థల నిర్ణయావశ్యకత లేదుగావి వారీ జిల్లా ప్రాంతీయులు కార నుటి స్పష్టము ఇందుమూలమున పూర్వకాలమున జరిగిన 'వలస'ల వలన ఏర్పడిన గ్రామనామములుండిన వని తేలుచున్నది.

కుల వృత్తి సంబంధములు : చాకలపల్లి బోయినగుంట, గొల్లివారి గుంట, కమ్మపల్లి, కోనేటిరాచపాలెం, కుమ్మరగుంట, కమ్మరపేట కె. ఉప్పర డి ఉప్పరపల్లి, వెలంపల్లి (అన్ని వెం) గొల్లకందుకూరు (నె) గొల్లపల్లి గొల్లలములవ, ఎమ్ జంగాలపల్లి (సూ) గొల్లపాలెం కాపులూరు, రాచపాలెం, రాజుపాలెం, రెడ్డిగుంట రెడ్డిపాలెం (అన్ని గూ) అయ్యగారి పల్లి, జోగిపల్లి, (రా) బ్రహ్మంకాక సెట్టిపాలెం, తూర్పు బ్రాహ్మణ పల్లి, తూర్పుజంగాలపల్లి, అన్ని (కా) అయ్యవారిపల్లి, చాకలకొండ రాచవారిపల్లి, తూర్పుబోయ మడుగు (అన్ని ఉ) జంగాలఖండ్రిక నార్త్ రాజుపాలెం (కొ) బ్రాహ్మణపల్లి (ఉ&అ)

పంటలు, వృక్షములు మొ॥ సంబంధములు :

నెల్లూరు:

పినాకినీనదీ జలాల వలన ఇచట భూములు సారవంతమై 'వడ్ల'ను ఉత్పత్తి చేయుచున్నవనీ, వడ్లకు, 'నెల్లు' అని (అరవభాషలో) నామాంతరముండుటచే వడ్లకు సమృద్ధిగాంచిన పట్టణము గనుక ఈ పట్టణము "నెల్లూరు" అనే నామధేయంతో పిలువబడుచున్నదని నెల్లూరీ యులెల్లవారికి విదితమే.[40] "నెల్లూరు" కన్నముందు 'నల్లఊరు' అని వ్యవహరించెడివారని నల్లఊరు నెల్లూర్‌గా మారిందని కొందరు చెపు తారు. "మరియొకవాదము ప్రకారము నల్ల, ఊరు అనుపదములనను సరించి ఏర్పడినదట. నల్ల అనగా మంచి అర్థము (తమిళభాషలో) నల్ల ఊరు అనగా మంచిగ్రామమని భావము "[42]

గురివిందపూడి (నె&రా) చింతలపాలెం (అ&రా) అరిమాను పాడు, చిగురుపాడు, చిగురుపాడు అగ్రహారం, చిల్లమానిచేను, చింత గుంట, గారుడుగుంట, జువ్విమానిఖండ్రిక, కార్జమేడు, మడిచేనుఖండ్రిక మానులపేట, మొగళ్ళగుంట, మొక్కలపూడి, పాలిపొలం, వెదురు గుంట, (అన్ని వెం) ఆముదాలపాడు, చెరుకుమూడి, పెద్దచెరుకూరు, చిన్నచెరుకూరు, మామిడిపూడి, మొగళ్ళపాలెం, నారికేళపల్లి, పెనుబర్తి పొట్టపూడి, తోటపల్లి తోటపల్లిగూడూరు, (అన్ని నె): అల్లంపాడు చెరుకుమూలం, చింతవరం, నాగులమర్రి ఉత్తరపొలం (అన్ని గూ) దూబగుంట, కాకర్లపాడు, కారుగోగులపాడు, మాముడూరు నువ్వూరు పాడు (అన్ని ఆ) కాకరమూల మావిళ్ళపాడు, మొదుగులపల్లి, మొలకలపూడి నూకలపాలెం, పడమటిఖండ్రిక పూలతోట, వెదురుపట్టు, వెలగలపన్నూరు, తుమ్మూరు. తాడిమేడు, (అన్ని సూ,) చింతలమకురు, గరిమెనపెంట, గురువిందపూడి, మొలకలపూండ్ల మునగ పాడు, పొదలకూరు, తాటిపల్లి, వడ్లపూడి, (అన్ని రా) చింతలదీవి, దూబగుంట, జువ్వలదిన్నె, మారెళ్ళపాడు, మర్రిగుంట, తాళ్ళపాలెం (అన్ని కా) గోగులపల్లి, జొన్నవాడ, మర్రిపాడు (అన్ని కొ) గరి మెనపెంట. నావిపాడు (ఉ)

జంతు, పక్షి సంబంధములు : నాగులపాడు (వెం&అ) గ్రద్ద గుంట (సూ&కొ) చావలపల్లి. ఏనుగువాడ. గుర్రంకొండ, నాగవోలు నెమళ్ళపూడి (అన్ని వెం) నాగులవరం (నె) చీమలపాడు, చిలకూరు పులికొర్ర (అన్ని గూ) డేగపూడి. (రా) బాతులపల్లి, బాతులపల్లిపాడు, ఎనమదల, నాగులవెల్లటూరు. (అన్ని ఆ) పులింజేరికొట్టం పులివెంద్ర (అన్నిసూ) చిలకపాడు, నెమళ్ళదిన్నె. (ఉ)

జలసూచితములు

సంగం (కో)

బొగ్గేరు, బీరపేరు, పెన్నార్‌ల సంగమస్థలమైన ఈ గ్రామము నకు త్రివేణీ సంగం అను పేరేర్పడినది [43]

గ్రామనామ ఉత్తరభాగమున సముద్రం, సాగరం, చెఱువు మడుగు, మొ॥ జలసూచితములైన గ్రామనామములీజిల్లాలో విరివిగా నున్నవి ఉదా . అక్కసముద్రం, బాలసముద్రం, బంగారు యాచసముద్రం, చెన్నసముద్రం చెర్లోపల్లి, దాచెరువు, గుండ్లసముద్రం, కొత్తచెఱువు, లింగసముద్రం, మహాసముద్రం, మాటుమడుగు, నూతల చెఱువు, పెదయాచసముద్రం, రంగరాజసముద్రం, స్వర్ణయాచ సముద్రం, వీరకుమార యాచసముద్రం, విద్వత్‌కుమారయాచసముద్రం (అన్నివెం), అనంత మడుగు, లింగసముద్రం, రామసాగరం, తానం చెర్ల. తేగచెర్ల (అన్నిరా) బురదమడుగు, లక్ష్మిఅనంతసాగరం, సోమసముద్రం, సుద్దమిడుగు తాగేల (అన్ని సూ) అక్కల చెరువు పాలెం ఆమంచెర్ల, కొలను కుదురు (అన్ని నె), బుడిదలవాగు, కొండ గుంట, కొత్తచెరువు, నక్కలకాలవ ఖండ్రిక, పెద్దచెరువు ఎంజవాక, వేడిచర్ల (అన్ని గూ) అనంతసాగరం, అనుమసముద్రం, భోగ సముద్రం, చేజెర్ల, ధర్మారావు చెరువుపల్లి (అన్ని ఆ), అల్లిమడుగు, బిట్టగుంట, చలమచర్ల, నాగసముద్రం, రంగసముద్రం రావులకొల్లు, (అన్ని కా) అప్పసముద్రం, దామచర్ల గంగులవారి చెరువుపల్లి, కంపసముద్రం, కానుచెరువు. తోటచెరువుపల్లి, తూర్పుబోయ మడు

గుల, (అన్ని ఆ) చేకచెర్ల, దామరమడుగు, ఇనమడుగు, వెలిచర్ల (అన్నికొ)

'గుంట' కు కొలను, పల్లము, చిన్నచెరువు, కొండ్ర, భూపరిమాణ విశేషమని అర్థములున్నవి. ఈక్రింది వాటిలో కొన్నైనా జలసంబంధములై యుండును. బండారుగుంట, బొమ్మగుంట, బోయనగుంట, మన్నెగుంట, చెలికంపాడుమన్నెగుంట, చినగొల్లగుంట, గొల్లగుంట చింతగుంట, గరుడగుంట, గొల్లవారిగొంట ఇను గుంట, కాడగుంట, కరిమనగుంట, కొమ్మలగుంట కోనవగుంట, కోమ్మరగుంట, కూర్జగంట, మార్లగుంట, మెగల్లగుంట, సిద్ధగుంట, సోమసానిగుంట, తిమ్మనగుంట, వడ్డిగుంట ఖండ్రిక, వెదురుగుంట, (అన్ని వెం) పోలిగుంట, (రా) దేవడిగుంట, గ్రద్ద గుంట, ముచ్చెలగుంట, పండలగుంట, రామచంద్రగుంట, రావులగుంట, సురగుంటకాగెల, (అన్ని సూ) కొండగుంట, పుట్రగుంట, రెడ్డిగుంట, (అన్ని గూ) దూబగుంట, మర్రికుంట, (కా) నాగినేనిగుంట, నందిగుంట, గుంట, (ఉ), దండిగుంట, గ్రద్దగుంట మోడెగుంట, (అన్ని కొ)

గంగపట్నం, (నె), గంగవరం, (ఉ), ముంగలదొరువు, పొగ్గడదొరువు ఖండ్రిక (నె) వంటివి కూడ జలసూచిత గ్రామనామములై యున్నవి. గుంటగ్రామనామాంత్యమున గల గ్రామముల పూర్వ భాగమున వ్యక్తి నామములున్నచో అట్టివి భూపరిమాణ విశేష సూచితములని ఎంచుటకు వీలున్నది. ఉదా: రామచంద్ర గుంట (గూ), సోమసానిగుంట (వెం) నాగినేనిగుంట (ఉ)

## శిలాసంబంధములు :

కొండమీది కొండూరు (ఆ) కలిగిరి కొండూరు, కొండనల పాడు (వెం) కొండూరు (సూ) పెదకొండూరు, కమ్మరకొండూరు, సిద్దన కొండూరు (కా) కొండమూరు (నె) చాకలకొండ, నల్లగొండ (ఉ) కొండూరు, కలవకొండ, కొండగుంట, కొండాపురం, కురుగొండ, (గూ) పల్లకొండ (రా).

## నామాంతరములు :

నెల్లూరుకు యుండిన మరియొకపేరు విక్రమ సింహపురము "పూర్వ కాలంలో ఈ ఊరిలోని ప్రతి పౌరుడూ పరాక్రమంలోను, ధైర్యసాహసాలలోను, సింహాలను మరిపించేవారట అందుకే దీనిని "విక్రమసింహపురము" అన్నారు.[44] నెల్లూరు మండలములోని నొక శాసనములో 'సురులూరని యెడిసింగలంత పుర' మని సూళ్ళూరుపేట పేర్కొనబడినది.[45] 18 శ॥ నాటి నొక శాసనములో కృష్ణపట్నం (నె) 'కొల్లిత్తురై' శేక 'గండగోపాల పట్న' మని పేర్కొనబడినది.[46] అదియే మొదటి దేవరాయలకాలం(1406-22)లోనిదైన శ॥సం 1330 (క్రీ. శ 1408-9) నాటి శాసనముకో దేవరాయలకు గల "రాజ విభాళ" బిరుద పరంగాల'రాజ విభాళ' పట్టణ మని పేర్కొనబడినది.[47] గండవరము(కొ) పూర్వపుశాసన మొకదానిలో కరరనారాయణపురమను కులోత్తుంగ చోళపురమని పేర్కొనబడినది[48]. వేరొకశాసనములో పెనుబరితి(రా) 'కృష్ణరాయ సముద్రమని పేర్కొనబడినది[49]. నెల్లటూరు(గూ) శ॥సం॥ 1452నాటిదగు అచ్యుతదేవరాయల కాలములోని నొకశాసనములో 'అచ్యుతాపుర'మనే ప్రతినామధేయంతో పేర్కొనబడినది[50]. ఆధునిక యుగములోకూడ పాలకవ్యక్తులు గ్రామాలకు నూత్ననామకరణం చేయడం జరిగినదని ఇంతకుముందుగానే గమనించడం జరిగినది. చూ॥ సోమసానిగుంట / రాధాకృష్ణపురం (వెం), గొల్లపల్లి/లక్ష్మీనరసమాంబాపురం(వెం).

## ఒకే-ఊరు రెండు పేర్లు :

పైన వివరించిన సందర్భములలో చాలవరకు నూత్ననామములు నిలువలేదు. పురాతననామములే పాతుకునిపోయినవి. అట్లుగాక నాడు గూడ రెండుపేర్లతో చెలామణియగుచున్న గ్రామములున్నవి. ఉదా॥ వేంపల్లితోక -రావిమానుదిన్నె, దామంచెర్ల-పొలంగానిపల్లి -ఉదయగిరి-కొండయపాలెం(అన్ని ఉ), ఓరుపల్లి- తురిమెర్ల, ఆనెపూడి-నడిమిఖండ్రిక అరిగుండం - పడమటి ఖండ్రిక (సూ), కోటితీర్థాలు - తూర్పు కంబంపాడు (ఆ).సున్నంవారిచింతల-తిరుమలనాయనిపల్లి(ఆ)

## తమిళ భాషాప్రభావము :

తమిళనాడు ఈజిల్లాకు దక్షిణ సరిహద్దుగనున్నది కావున తమిళభాషా ప్రభావము ఈజిల్లా గ్రామనామములపైనుండుట సహజము ప్రాచీన పాలనావిభాగ నామములపైయుండిన అట్టిప్రభావమును ఇంతకు ముందుగనే గుర్తించుటజరిగినది. జిల్లాముఖ్యపట్టణమైన 'నెల్లూరు' పేరునకుగల రెండు అర్థములను కూడ తమిళ భాషాప్రభావమునే సూచించుట ప్రత్యేకముగా గమనించదగినవి గండవర (కో) మునకుపూర్వ నామధేయము 'కొల్లితురై' అనగా పెద్దపట్టణమని అర్థము సంపూర్ణముగనో నామాంత్యమునందునో అరవభాషా ప్రభావమునుస్పష్టీకరించు గ్రామములుకొన్ని గలవు ఉదా॥ పెరుతువరం, కుప్పంపల్లి(వెం), పెరుమాళ్ళపాడు(రా). అన్నంబాక, ముత్తెంబాక, తిరుమూరు(గూ), అబాక అరవపెరిమిడి, చట్రాసికుప్పం, పెరియవట్టు, పులింజేరికుప్పం, వెనుంబాక(అన్ని సూ), తిరువీధిపాలెం(కో), పెరియపల్లి(కా).

## ఒక గమనిక :

1971సం॥ 'సెన్ సెస్'అనంతరం ప్రభుత్వం వారు 'సర్వే'అండ్ సెటిల్ మెంట్ కార్యక్రమంలో కొన్నిగ్రామాలను సమీప గ్రామాలతో

కలిపి వేయడవలసిన అట్టిగ్రామాలు ప్రస్తుతం'రెవెన్యూగ్రామాలుగా లెక్కలలోనికిరావు[51] ఉదా॥ వెంకటగిరి తాలూకాలో స్వర్ణయాచ సముద్రం, విద్వత్ కుమారయాచ సముద్రంతో కలిపి వేయబడినది.

ముగింపు :

ఆంధ్ర జిల్లాలలో చివరిదైన ఈ జిల్లాగ్రామనామములు, ఈ విభాగము నందలి మిగిలిన జిల్లాలలోని గ్రామనామము లట్లే, పాలక వర్గ, మతసంబంధిత విశ్వాసప్రభావము కలిగియున్నవి. అట్లే భౌగోళిక పరిస్థితులు, స్థానికముగ లభించు 'వనరులు' కూడ యధోచితముగ తమప్రభావమును గ్రామనామములపై చూపినవి. ఉదాహరణ ప్రాయముగ సాగిన ఈ ప్రాథమిక పరిశీలన, ఈ జిల్లా గ్రామ నామములపై ఇంకను విస్తృత శాస్త్రీయపరిశోధన జరుగవలసిన ఆవశ్యకతను తేటపరచుచున్నది.

## అధోజ్ఞాపికలు

1. వై. వి. కృష్ణారావు అండ్ ఏటుకూరి బలరామమూర్తి(సం) ఆంధ్ర దేశ దర్శిని (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1976), పు. 1061.

** సౌలభ్యముకొరకు తాలూకాలపేర్లు కుండలీకరణములలో సంక్షిప్తముగా పేర్కొన బడినవి. ఆ సంజ్ఞావివరణ, ఆ=ఆత్మకూరు, గూ= గూడూరు, కా=కావలి, కో=కోవూరు, నె=నెల్లూరు, రా=రాపూరు సూ=సూళ్ళూరుపేట, ఉ=ఉదయగిరి, వెం = వెంకటగిరి.

*** ఈ ప్రకరణమునకు, పట్టిక-2నకు, ప్రధాన ఆధారగ్రంథము కుందూరి ఈశ్వరదత్తు, ప్రాచీనాంధ్ర చారిత్రక భౌగోళము, ఆం॥ప్ర॥ సాహిత్య అకాడమి, హైదరాబాద్, 1979) ఇకపై ప్రా. చా. భూ. అని సూచిరపబడుతురది

2. పైది, పు 266.

3. ఎమ్. వి. రాజగోపాల్ (సం), ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిక్ట్ గజిటీర్స్, నెల్లూరు, (రివైస్డ్ ఎడిషన్, హైదరాబాద్, 1977) పు 16 ఇకపై నెల్లూరు గజిటీరు అని సూచింపబడుతుంది.

4. ప్రా. చా. భూ. పు 330.

5. బి. వి. కృష్ణారావు, ఎర్లి డైనాస్టీస్ అఫ్ ఆంధ్రదేశ, (మద్రాస్, 1942) పు 46.

6. కంబంపాటి సత్యనారాయణ, ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర (సంక్షిప్తానువాదం మహీధర రామమోహనరావు, హైదరాబాద్, బుక్ట్రస్ట్, హైదరాబాదు 1981] పు 144

7. ఖండవల్లి లక్ష్మీరంజనం (సం) ఆంధ్రదేశచరిత్ర - భూగోళసర్వస్వము, మూడవసంపుటము (ఆంధ్రరచయితల సంఘం, హైదరాబాద్, 1976), పు 581.

8. సి. డి. మేక్లిన్ (సం), గ్లోసరి అఫ్ ది మద్రాస్ ప్రెసిడెన్సి" (ఏషియన్ ఎడ్యుకేషనల్ సర్వీసెస్, న్యూఢిల్లీ, 1982), పుట 47 ఇక పై 'గ్లొసరి' అని సూచింపబడుతుంది.

9. పైది, పు151

10. ఆంధ్రభూమి, (తెలుగువారపత్రిక, సికింద్రాబాద్, 2-6-1983), పు 36.

11. గ్లొసరి పు 150

12. పైది పు 585

13. పైది, పు 586

14 పైది, పు 163

15. మామిడిపూడి వేంకట గంగయ్య (సం), సంగ్రహ ఆంధ్రవిజ్ఞాన కోశము, ఐదవ సంపుటము, (సం॥ఆ॥వి. కో. సమితి, హైదరాబాద్, 1966), పు. 332

16. గ్లొసరి. పు 585

17. పైది.

18 పైది, పు 586

19. పైది, 151

20. పైది, పు 608

21. నెల్లూరు గజిటీరు 1 పు 220

22. డా. తూమాటిదోణప్ప. ఆంధ్రసంస్థానములు సాహిత్య పోషణము (వాల్తేరు, 1969),పు 462

23. నెల్లూరు గజిటీరు, పు 16

24. యస్ గోపాలకృష్ణమూర్తి, జైన్ వెస్టీజెస్" ఇన్ ఆంధ్ర (హైదరాబాద్, 1963)' పు 38

25. నెల్లూరు గజిటీరు. పు. 18

26. భావరాజు వెంకటకృష్ణారావు, హిస్టరి ఆఫ్ ది ఈస్టరన్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి (610-1210) (ఆం, ప్ర సాహిత్య అకాడమి, హైదరాబాద్, ప్రథమముద్రణ, 1973). పు 282, 283

27. ఆంధ్రప్రదేశ్ దర్శిని, పు 1066

28. ఎమ్. పట్టాభిరామిరెడ్డి. 'ఫీచర్స్ ఆఫ్ నెల్లూరు మండలం. ఇతిహాస్, 5 నెం. 2. (హైదరాబాద్, 1977), పు 53

29. పల్లవరాజన్యులైన యువమహారాజు మొదటివిష్ణుగోపవర్మ, రెండవ విష్ణు గోపవర్మల శాసనములీ జిల్లాలో లభించినవి. అట్లే కంచి దండయాత్ర నిర్వహించిన పల్లవ మూడవనందివర్మ ప్రభావంనంది వాయి(రా), నందవరం, నందిగుంట నందిపాడు (అన్ని ఉ) వంటి గ్రామనామములపై గలదని ఊహించుటకు ఆధారము కేవలము నామసాదృశ్యము, మాత్రమే.

30. ఖండవిల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రదేశచరిత్ర, భూగోళసర్వస్వము, మొదటిసంపుటము, (ఆంధ్రరచయితల సంఘము, హైదరాబాద్, 1971). పు 205

31. ఆంధ్రభూమి (14.6.84) పు 76

32. నెల్లూరు గజిటీరు పు, 220

33. డా. తూమాటి దొణప్ప, ఆంధ్ర సంస్థానముల సాహిత్య పోషణము పు 468

34. ఆంధ్రభూమి (1-3-1984) పు 85

35. పైది (22 9 1983) . పు 74

36. నెల్లూరు గజిటీరు, పు 215

37. గ్లోసరి, పు 615

38. ముసునూరి వెంకటశాస్త్రి (సం) విపులఇండ్లపేర్లు–శాఖలు(దీపక్ బుక్‌సెంటర్, రాజమండ్రి. మూడవముద్రణ) పు 10

39. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, ఐదవ సంపుటము, పు 199.

40 ఆంధ్రపత్రిక (దినపత్రిక, విజయవాడ, 1. 10. 1983) పు 4 మా నెల్లూరు (వా) శేషయ్య

41. పైది (11. 8.1984) పు 8 జిల్లాలపాత పేర్లు (వ్యాసం) మారం రెడ్డి, జనార్దనరెడ్డి.

42. సంగ్రహఆంధ్ర విజ్ఞానకోశము, ఐదవసంపుటము, పు 332

43. నెల్లూరు గజిటీరు పు 216

44. ఆంధ్రపత్రిక (దినపత్రిక విజయవాడ, 2.10.1984). మా నెల్లూరు (వ్యా) పి శశిధర్. పు 4.

45. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము పు 305.

46. పైది మూడవప్రకరణము, పు 63

47. డా. సి. వి. రామచంద్రరావు టు తెలుగుచోడ టెంపుల్స్ ఇన్ కృష్ణపట్నం ఇన్ నెల్లూరు డిస్ట్రిక్టు ఇతిహాస్, వాల్యూం 8 నెం. 1 (హైదరాబాద్, 1981) పు 99–100

48. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 265-66

49 నెల్లూరు శాసనాలు (రాపూరు) నెం 49 పైది. పు 280

50. పైది (గూడూరు) నెం. 107 పైది పు 144

51 ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిక్ట్ సెన్సస్ హేండ్‌బుక్కు. పార్ట్స్ 10 ఎ&బి విలేజ్ అండ్ టౌన్ డైరక్టరి, నెల్లూరు డిస్ట్రిక్ట్, (ఆంధ్రప్రభుత్వము హైదరాబాద్, 1974) పు. 48. అధస్సూచికలోవ్యాఖ్య.

( అయిపోయింది )



# ఉగ్గుపాలలోనే....

## డాక్టర్. గుమ్మనూరు రమేష్‌బాబు

ప్రియా !

ఈ నిండు శిశిరంలో
నీ గుండె కొండలు తడిసి పోయినప్పుడు
నా రెండు పెదవులు పెనవేసు కొన్నప్పుడు
నేరేడు పండు ఎరుపు
నీ కళ్ళమెరుపు !
మంచు చినుకుల విరుపు !

ఆకులు రాలిన ఈ చలిరాతిరి
నీలో భోగి మంటల మకర సంక్రాంతి !
ఆకుల సోలిన ఈ జాబిలి ముత్యాలు
నీలో సవ్వడి చేసే శివరాత్రి బృందగానాలు !
నవశకానికి ఉషస్సులు !
ఉగాదుల చరితకు రామనవములు !

అభీష్ట సిద్ధ్యర్థం
విఘ్నోపశాంతం
అభ్యుదయార్థం
విజయదశమీ పూజా విశేషం !
ఆర్ష ధర్మ ప్రతిష్ఠాపనా సంరంభం
అశ్వయుజ ఆనందగానం !
అపురూపం
అమోఘం !

చెలీ !

నూరు వత్సరాల
ఆరు నూర్ల ఋతువుల
దొరలాడే శాశ్వత సత్యాలు
పండిపోయే నిండు జీవితాలు !

కాలం తీరని ప్రకృతి
అసూర్యంపశ్య !
పసివాడని ఈ దివ్యకృతి
పరబ్రహ్మాంశ !
కాని, అనుక్షణం అది మారుతూ ఉంటుంది
ప్రతి అణువునూ మారుస్తూ ఉంటుంది
ప్రతి మార్పూ
ఒక మహోదయానికి నాంది !
ప్రతి ఉదయమూ
సరిక్రొత్తగమ్యానికి ఊపిరి !
ఏది ఎంతవరకో !
ఎంతకూ తెలియని విచిత్రం !

డార్విన్‌నిజమైనా
వేదంచెప్పిన పచ్చినిజమైనా
ఇంకెవరు చెప్పినా
ఇంకా ఎందరో చెబుతున్నా
అది తిరుగులేని మాట
శాస్త్రీయత నిండుకొన్న రాచబాట !
ఈ మాట నా సంస్కృతి ఎప్పుడో చెప్పింది....
ఈ బాటను ఉగ్గుపాలలోనే చూపెట్టింది !

# వృత్తులు-ప్రవృత్తులు

జి.భాను



రైలుబండి ఆ స్టేషన్లోకి వచ్చేటప్పటికి వర్షం ఇంకా ఎక్కువైంది. సమయమేమో సాయంత్రం ఆరుగంటలైంది. వర్షంమూలంగా మసకచీకటి క్రమ్మినట్లుగా అయిపోయింది.

బండిదిగాడు నాగభూషణరావు. అతనితోపాటు రెండు ట్రంకులు ఒక టేబుల్ ఫేను మాత్రమే ఉన్నవి. లైసెన్సుపోర్టర్లు ఆ లగేజి స్టేషన్లో టికెట్ కలెక్టరు ఉండే గేటుదగ్గిర దింపి వెళ్ళారు.వానవల్ల జనం ఎక్కడివాళ్లు అక్కడే ఆగిపోయారు.

హోరున వర్షం వస్తున్నది !

భూమి ఆశకు ఆకాశం ఏడుస్తున్నట్లుగా ఎడతెగని ధారాల్లాగా వాన !

స్టేషన్ రేకులపైన అనవసరమైన హంగామాచేస్తున్న కేకల్లాగా వాన !

నేలమీదపడి బుడగలైన వెంటనే పగిలిపోయి, ఒక జీవన సత్యాన్ని స్ఫురింపజేస్తూ ప్రవాహంలో కలిసిపోతున్నవాన!

ఆ ఊరికి క్రొత్తవాడైన నాగభూషణరావు చంకల్లో చేతులు పెట్టుకొని నుంచున్నాడు. దూరంగా దృష్టి సారిస్తే స్పష్టాస్పష్టంగా ఊరు కనబడుతున్నది బస్సులు,లారీలు వెళ్తున్న బ్రిడ్జి కనబడుతున్నది. స్టేషన్ రోడ్డుకు రెండువైపులా ఉన్న మహోన్నతమైన నిద్రగన్నేరు చెట్లు కనబడుతున్నవి. వానవల్ల వాటి ఆకులు ముడుచుకొనిపోయి,చలికి బిగుసుకుపోయిన ముసలి రాక్షసుల్లా అగుపిస్తున్నవి

నాగభూషణరావు జేబులోఉన్న అడ్రసును ఇంకోసారి చూచుకొన్నాడు. ఆ ఇంటిని చేరుకొన్న తర్వాత ఎంతగా కురిసినా ఇబ్బంది ఉండకపోను! ఇది ఎప్పుడు వదిలిపెడుతుందో ఏమో! ఆ ఇల్లుస్టేషన్ దగ్గిరేనట! ఏ రిక్షావాడైనా సులువుగా తీసుకొని వెళ్తాడుట మరి. అని మనసులో అనుకున్నాడు.

ఆ ఉత్తరం రాసిన మిత్రుడే ఇల్లు నచ్చితే అక్కడే ఉండవచ్చు, లేకపోతే ఇంకోటి అన్వేషించుకోవచ్చు. అర్జంటుపనిమూలంగా స్టేషన్‌కు రాలేకపోతున్నానని రాశాడు. ఆ మిత్రుడేవస్తే ఎంతోబాగుణ్ణు! మనస్సుకు చికాకులేకుండా ఉండేది! ఈ బదిలీల మూలంగా ఎన్ని బాదరబందీలు! అంతా క్రొత్త! పాత బడేవరకు ఇంతే.

వాన విజృంభణ తగ్గింది. ప్రయాణికులు ఒక్కరొక్కరే జారుకొంటున్నారు. అప్పుడే రిక్షాలవాళ్లు కందిరీగల్లాగ చుట్టుకొన్నారు.

'గాడీ కావాలా... గాడి....' ప్రయాణికులకు ఊపిరి సలపనివ్వడంలేదు వాళ్ళు. నాగభూషణరావు నిబ్బరంగా నుంచున్నాడు. స్టేషన్‌లో దిగిన జనం దాదాపు వెళ్ళిపోయారు.

'ఏటిసార్! గాడి కావాలా?'

'ఊ... కావాలి'

'ఎక్కడకు సార్?'

'టు టౌను పోలీసుస్టేషన్ దగ్గర మరిండీ మహాలక్ష్మిగుడిముందు రోడ్డు చివర, మునిసిపల్ పార్కుదగ్గర ఉన్న ఇల్లు...'

'సామాను లేముండాయి'?

'ఇవే రెండు ట్రంకులు... ఫేను'

'అబ్బో! బలువే!'

'ఉన్న సామాను ఇది... ఎంతిమ్మంటావ్?'

'మీకు తెలియదేటి ? మీరే సెప్పండి...'

'ఇదే మొదటిసారా బాబు ఈ ఊరు రావడం నువ్వే అడుగు'

'అలాగండీ... అయితే అయిదురూపాయలిప్పించండి...'

'అయిదా? దగ్గరే నన్నాడే మా స్నేహితుడు...'

'లాగొద్దండి గాడీ....' బీడీ ముట్టించుకున్నాడు.

ఇంకోరిక్షా మాట్లాడు కొంటాలే'

'అయి బాబోయ్.... మీ ఇష్టం....' అక్కడే నుంచున్నాడు దమ్ములాగుతూ.

ఎదురుగా ఉన్న ఇంకో రిక్షాని నాగభూషణరావు పిల్చాడు. ఐనీను కేప్‌లో మహాదర్జాగా ఉన్నాడా రిక్షాడ్రైవరు.

టు టౌన్ పోలీసు స్టేషన్‌దగ్గర.. అదే మరిడీ మహాలక్ష్మి గుడి ముందు వీధిలో చివరి ఇంటికి... రెండుట్రంకులు, పేను... ఎంత కొస్తావ్.

'మీకు తెల్దేటండీ అరిప్పించండి'

అరిక్షా కైదయితే నీ కారా?'

'పరే ఆ అయిదే ఇప్పించండి' అన్నాడు. అక్కడే నుంచున్న ఇందాకటి రిక్షాడ్రైవరు చేతివేళ్లుచూపించడం నాగభూషణరావు గమనించాడు. అతనికి ఒళ్ళుమండిపోయింది. అనువు గానిచోట అధికులమన రాదు అన్న మహాకవి సూక్తి గుర్తొచ్చి సంబాళించుకున్నాడు. ఒకే మాటపై ఉన్న వీళ్ళకి తలవొగ్గవలసిందే, గత్యంతరం లేదు.

'సరే కానియ్'

'అద్గదీ' అని రిక్షాతిప్పి లగేజి పెట్టి 'ఎక్కండి' అన్నాడు.

సన్నని చినుకులు లైట్లకాంతిలో మెరుస్తూ రాలుతున్నవి. చలి గాలి వీస్తున్నది. పట్టాలపైనుండి ఉన్న దారివెంట రిక్షాలాగుతున్నాడు.

'స్టేషన్ దగ్గిరే ఆ ఇలు అని మా స్నేహితుడు రాశాడు. మీ వాళ్లు ఐదులు అర్లు అడుగుతున్నారు దూరాన్నిబట్టికాదా మీరు అడగటం మా అవసరాన్ని బట్టి డబ్బు గుంజడం ఏం న్యాయం...?'

'అచ్చరం ముక్కలాసే వోళ్లు యిట్టమొచ్చినట్లు రాస్తారు బాబూ! క్రెమక్రెమకి ఇలవ కట్టటం మీకేటి తెలస్తది. అప్పనంగా యిస్తన్నారేటి? కండలు కరిగిత్తన్నాం. లాగుతున్నాం,పొలాలు పండిత్తన్నాం,నాలుగు దబ్బులియ్యటానికి గిరిగిరి బేరాలు సేస్తారు మీరు. బాబో! అసలు ఈప్రపంచాన్ని నడిపిత్తన్నది ఎవులూ? మేం బాబు!మెం మరేటి, జోరుగా మాట్లాడుతున్నాడు.

'అబ్బో...వీడెవడో ఘటికుడే. మాటలు వంటబట్టిన రిక్షానాయకుడు! మాటలు నేర్చిన కుక్కను వేటకు తీసుకెళ్తే ఇస్కో అంటే మీ బాబు ఇస్కో, మీ తాత ఇస్కో అందట. ఇటువంటి వాళ్ళ జోలికిపోకూడదు. డబ్బు పోతే పింగా బోయె' అని మనసులో అనుకొన్నాడు నాగభూషణరావు.

'నీపేరేమిటోయ్ ?'

'నాది బాబు... పోలినాయ్డు...'

'ఏవూరు నీది ?'

సికాకోళం జిల్లాలో పాత పట్టనం...'

'ఎందుకొచ్చారు ఇక్కడికి ? ఎప్పుడొచ్చారు ?'

"అక్కడ వోనలు లేకపోతే ...మా గుడ్లు (మెట్టపొలాలు), బక్కలు (పసువులు) అమ్ముకొని, యెప్పుడో వొచ్చేసినాం. బాగుంటే ఎల్లిపోతాం...'

రిక్షా తొక్కుతూ మాట్లాడుతున్నాడు. బ్రిడ్జిమీద నుంచి రిక్షా వెళ్తున్నది. లైట్ల వెలుగులో తడి ఆయిల్ లాగా మెరుస్తున్నది బ్రిడ్జి పైకి వెళ్ళిన తర్వాత రిక్షా స్పీడుగా సాగుతున్నది. బ్రిడ్జి చివర షాపులు కనబడుతున్నవి రంగు రంగుల లైట్లు! హడావుడిగా నడుస్తున్న మనుషులు, బస్సులు, లారీలు, సైకిళ్ళు, టు టౌన్ పోలీసు స్టేషన్ కనబడింది. దాని ఎదురుగా ఉన్న రోడ్డువైపు రిక్షా వెళ్తున్నది. వందగజాలు వెళ్ళిన తర్వాత తెల్లగా ఉన్నగుడి అది మరిడి మహాలక్ష్మి గుడి అన్నమాట. లైట్ల కాంతిలో విచ్చిన తెల్లని పద్మంలా ఉంది.

రిక్షా దాని ముందున్న వీధిలోకి తిరిగింది. ఓ ఫర్లాంగుదూరం వెళ్ళిన తర్వాత రిక్షా ఆపాడు. 'కనుక్కోండి బాబు! ఏ ఇల్లో?'

రిక్షా దిగి నాగభూషణరావు ఒక గేటు దగ్గిరకు వెళ్ళి 'పురుషోత్తం గారిల్లు ఇదేనండీ' అడిగాడు.

'అవును. ..ఇదే మీరెవరు ?'

'నా పేరు నాగభూషణరావు .. నా మిత్రుడు వెంకట్రావు నా కోసం ఈ ఇంట్లో పోర్షన్ ఫిక్స్ చేసినట్లు రాశాడు .'

'ఓ అలాగా ..రండి. మీ కోసమే చూస్తున్నాం. రైలిప్పుడే వచ్చిందన్నమాట.' ఆ ఇంటి యజమాని ఆహ్వానించాడు. రిక్షాడ్రైవరు సామాన్లు వరండాలో పెట్టి డబ్బు తీసుకొని వెళ్ళిపోయాడు.

"అదే మీ పోర్షన్. స్నానం చేయండి. ఈ పూట మా ఇంట్లో భోంచెయ్యండి." అన్నారు. ప్రాణం లేచివచ్చింది నాగభూషణరావుకు.

మరుసటిరోజు బేంక్‌లో జాయినింగ్ రిపోర్టు యిచ్చాడు. తెలిసిన మిత్రులే ఎక్కువమంది కన్పించారు. రెండో రోజున కుటుంబాన్ని రమ్మని ఉత్తరం రాసి పోస్టు చేయడానికి బయల్దేరాడు నాగభూషణరావు. ఇంటిముందే ఎదురైనాడు పురుషోత్తం.

'ఎక్కడిదాకా ?'

'ఉత్తరం పోస్టు చేద్దామని పోస్టాఫీసుకు బయల్దేరాను'

"మీరు ఈ మాత్రందానికి ఎక్కడికో వెళ్ళనక్కరలేదు. ఈ ప్రక్కనే ఆర్. ఎమ్. ఎస్ పోస్టాఫీసు ఉంది. అదిగో కుడిచేతివైపు రోడ్డు వెంట వెళ్తే, నిద్రగన్నేరు చెట్లు కనబడతాయి. అక్కడ నుండి ఎడమవైపు తిరిగితే స్టేషన్ ప్రక్కే పోస్టాఫీసు ... వెళ్ళండి'

ఆ ప్రకారంగానే నాగభూషణరావు వెళ్లాడు. రెండు నిముషాల వ్యవధిలోనే పోస్టాఫీసు వచ్చింది. ఉత్తరం పోస్టు బాక్సులో వేశాడు.

తర్వాత దిక్కులు పరికాయించి చూశాడు. ఎదురుగా రైల్వేబ్రిడ్జి! నిద గన్నేరు చెట్లు ! రిక్షాలు ! రెండురోజుల క్రిందట తాను దిగిన రైల్వే స్టేషన్ !

నాగభూషణరావు తలలో ఆశ్చర్యం అవుపించింది.

ఈ రెండు నిముషాల దూరానికి ఆ రిక్షా డ్రైవరు తన దగ్గర కాజేసింది ఐదురూపాయలు ! కాకపోతే పట్టాలు దాటించి బ్రిడ్జిమీద నుంచి లాక్కొచ్చి, చెవులమీద నుండి ముక్కు చూపించినట్లుగా, ఇంటిని చూపించిన మహాచమత్కారి ఆ రిక్షాడ్రైవరు! తన తెలియని తనాన్ని డబ్బు చేసుకోవడమేకాకుండా, బుకాయించి, చదువుకొన్న వాళ్ళను విమర్శించి తన నోరు కట్టేసిన అతగాని తాకిన జ్ఞానం, చిలక పలుకుల్లా వల్లించిన సిద్ధాంత జ్ఞానం ముందు తల దించుకోవలసి వచ్చింది. ఆ రోజు కానీ అంత మోసం క్షంతవ్యం కాదు !

అంత ఇదిగా మస్కా కొట్టిన పోలినాయుడు కనబడక పోతాడా ? గుణపాఠం నేర్పక పోతానా ? అని మనస్సులోనే జరగ బోయే సంభాషణ గుణించుకున్నాడు నాగభూషణరావు. కాని అతణ్ణి ఎట్లా కనుక్కోడం ? అతని ముఖకవళికలు సరిగా గుర్తులేవుగదా! కాబట్టి ఆ సంఘటన తనకే గుణపాఠం అని తన్ను తాను సముదాయించుకున్నాడు.

ఆరు నెలలు గడిచాయి. సూర్యుడు మంటలు చెరుగుతున్నాడు. గాలి, వేడి కబుర్లు చెబుతున్నది చెట్ల ఆకులు మౌనమంత్రం పఠిస్తున్నాయి.

నాగభూషణరావు, అతని మిత్రుడు ఆఫీసు పనిమీద హైదరాబాద్ వెళ్ళడం కోసం టికెట్లు రిజర్వు చేసుకోడానికి స్టేషన్‌కు వెళ్ళి, తిరిగి నిద్రగన్నేరు చెట్ల క్రిందుగా వస్తున్నారు. నీడగా ఉన్న ఆ చెట్ల క్రింద రిక్షా డ్రైవర్లు కొందరు రిక్షాల్లోనే నిద్రపోతూ ఉంటే, కొందరు పులి జూదం ఆడుతున్నారు. కొంతమంది అక్కడ కట్టేసిన మచ్చికైన కోతులతో ఆడుకొంటున్నారు.

ఆ సమయంలో అక్కడ ఆడుతున్న వాళ్ళలో ఒకడికి ఉత్తరం ఇచ్చి పోస్టుమేన్ వెళ్తున్నాడు నాగభూషణరావు, అతని మిత్రుడు అక్కడికి రాగానే 'బాబుగారూ ! ఈ ఉత్తరం సదివి సెప్పండి . . . ఏటో' అని ఒకతను భూషణరావు మిత్రుడికి ఇన్ లేండ్ కవరు ఇచ్చాడు.

కవరు చించి 'చిరంజీవి పోలినాయుకుడు అప్పలకొండ ఆశీ దించి వ్రాయించు సమాచారములు. . .' అని చదవబోతుంటే 'వెంకట్రావ్ ఒక్క నిమిషం. నన్ను చూడనీయండి.' అని నాగభూషణరావు ఇంగ్లీషులో అని ఆ ఉత్తరాన్ని తీసుకొని అడ్రస్ చూశాడు. ఎక్కడినుంచి వచ్చిందో చూశాడు.

అతని కళ్ళు మెరిశాయి. క్రీ పెదవి కొరికాడు.

ఆ ఉత్తరం నాలుగు పంక్తులు చదివి 'అరెపాపం !' అన్నాడు.

'ఏటి బాబు ! యేమైంది ?' గాభరాగా ప్రశ్నించాడు.

అది పట్టించుకోకుండా ఇంకో నాలుగు వాక్యాలు చదువుతూ 'ఆహా !'అన్నాడు.

'అసలేమైందో సదవండి పైకి ... మరీ కంగారుపడుతున్నాడు

ఉత్తరం పూర్తిగా చదివి 'ప్చ్' అని అతనిచేతిలో దాన్ని పెట్టేశాడు.

"ఏటి బాబు... మీరు... సదివి సెప్పరేటి..." అన్నాడు నమ్మశక్యం కాకుండా ఉత్తరాన్ని చూచుకొంటూ.

"ఉత్తరం చదవాలంటే...డబ్బవుతుంది." అన్నాడు నాగ భూషణరావు సీరియస్‌గా

"ఆదేటి బాబు... ఎటకాలాడతన్నరు . సదవడానికి డబ్బు లేటి? సదువు ప్రెజల కోసరం గందా!"

అప్పుడు అక్కడున్న జనం అంతా చుట్టూ మూగారు. ఆ సంఘటన చిత్రంగా ఎప్పుడూ అనుభవానికి రానివిధంగా ఉన్నది.

"అదంతే ఇష్టమైతే డబ్బిచ్చి చదివించుకో లేకపోతేలేదు" నిష్కర్షగా అన్నాడు.

"మాకు సదవటం రాదనేగా మీగరవం...ఎంతిచ్చుకుంటారో సెప్పండి...అచ్చరం ముక్కలొచ్చినోళ్ళు ఇలాగే మాటాడితే మా లాంటోళ్లు యామై పోవాల..." కోపంగా అంటున్నాడు

"భూషణరావుగారూ ! ఏమిటి... మీరు... ఇలాగా..." వెంకట్రావు అమితాశ్చర్యంగా ప్రశ్నించాడు.

"మీరు చూస్తుండండి... అంతా అర్థమౌతుంది" ఇంగ్లీషులో అన్నాడు.

"ఈ ఉత్తరం చదవాలంటే మూడు రూపాయలౌతుంది... తర్వాత నీ ఇష్టం..."

"యింతకు ముందు ఔలు (ఎవ్వరు) పైసాలిచ్చుకోలేదు సర్లే గాని రెండిత్తాను సదివిపెట్టండి... ఈ అన్నేయంగా పైసాల్దీసుకొని మీరే బాగుపడండి..." అన్నాడు రోషంగా

అతనిచేతిలోని ఉత్తరాన్ని, రెండురూపాయల్ని తీసుకొని చదివాడు నాగభూషణరావు.

చిరంజీవి పోలినాయుడుకు అప్పలకొండ ఆశీర్వాదించి వ్రాయించు సమాచారములు. నువ్వు ఉత్తరాలు వ్రాయించడంలేదట. అందరం యెదురు సూస్తున్నాము. ఇక్కడ పూష్ణంలో పదిరోజులు మంచాన పడి మీ అమ్మమ్మ సచ్చిపోనాది. సెరువు దగ్గర 10 కుంచాల పొలం నీకు రాసింది బందుగులు చాలామంది ఈ సంగతి విని,దగ్గరున్న వాల్లని వొదిలేసి ఎక్కడో వున్నవోడికి రాయటమేటని ?ఏష్ట పోయేరు. నీమీద ప్రేమచేత ముసలిదాయి అలాగ చేసింది. వచ్చే సోమవారం పెద్దికర్మ. కాబట్టి నువ్వు, నీ పెల్లాము, పిల్లలతో ఇక్కడికి రావలెను. ఇక్కడ అందరూ బాగున్నారు.

ఇట్లు,
తండ్రి
అప్పలకొండ

పోలినాయుడు కళ్ళల్లో విషాదం, ఆనందం కలగలుపుగా కనబడ్డాయి.

ఒక్కక్షణం ఆగి నాగభూషణరావు "ఈ అక్షరంముక్కలు రాడానికి పదేళ్ళ కన్నా పైనే పట్టింది ఎంత ఖర్చు పెట్టి చదివానో దానికి ఫలితం రావొద్దూ! చదువు ప్రజలకోసమే. అయితే శ్రమకూడా ప్రజలకోసమే. చెయ్యరాదూ? కావాలంటే రిక్షా నేనూ తొక్కగల్ను. కానీ నువ్వు చదవటం అంతతేలికకాదు. నేను చదువుకొన్నానని న్యాయంగానే తీసుకొన్నానుగాని నీకులాగా... అక్రమంగా తీసుకోలేదు..."

"నే నన్నేయంగా తీసుకోడమేటి ? మీరేటో మాట్లాడతన్నారు. అనవసరంగా..."

"అహాఁ అనవసరంగా మాట్లాడుతున్నానా? పోలినాయుడూ ఆరునెలల క్రిందట ఒక వర్షంరోజు సాయంత్రం! ఈ స్టేషన్ నుండి అదుగో ఆమూల కనబడుతున్న ఇంటిదగ్గరకు, రిక్షాకు నా దగ్గర ఎంతతీసుకొన్నావో గుర్తుందా? ఆరురూపాయలడిగి, తర్వాత ఐదు తీసుకొని, దగ్గరదారినుండి వెళ్ళకుండా ఆ బ్రిడ్జిమీద నుండి చుట్టూ తిప్పి తీసుకొనివెళ్లావు. అది అన్యాయం, అక్రమం కాదా? ఈ వూరు అప్పుడే నాకు క్రొత్తని అట్లా మోసం చేయడం మంచిదేనా? నువ్వు మాత్రం ఆ డబ్బులు తీసుకొని బాగుపడతావా? చెప్పు...మాట్లాడవేం! రెట్టించాడు.

వెంకట్రావుకు అర్థమైంది.

"ఓస్...అదా సంగతి ... నాయుడూ! నువ్వే అలా చేశావ్రా?" రిక్షాడ్రైవర్లందరూ పోలినాయుణ్ణి గుచ్చిగుచ్చి అడుగుతున్నారు.

తలదించుకున్నాడు పోలినాయుడు.

"చూడు నాయుడూ! రిక్షా తొక్కడం నీ వృత్తి. ఉద్యోగాలు చేయడం నా వృత్తి. ఏ వృత్తి చేసినా బ్రతకడమే పరమార్థం. ఆ బ్రతుకుకోసం నన్ను నువ్వు, నిన్ను నేను, దగా చేసుకోడం మంచిది కాదు. నీ అవసరాన్ని ఇపుడు నేను డబ్బుకు మార్చుకొన్నట్లుగా, జనం అవసరాన్నిబట్టి నువ్వు ఆకాశంలో కూర్చోడం కూడా అన్యాయమే. ఈ బ్రతుకురోడ్డుమీద అందరం సవ్యంగా, సామరస్యంగా నడిస్తేఅదే తృప్తి. ఇదిగో నీ రెండురూపాయలు" అని స్నేహితుడితో ముందుకు కదిలాడు నాగభూషణరావు.

ఎవరూ మాట్లాడలేదు. అర్థమైన పోలినాయుడు వంచిన తల ఎత్తాడు.

# పరిమాణాల తమాషా

## శ్రీ వసంతరావు వేంకటరావు

ఒక పరిమాణం తెలిసిన జీవికి
లోక మంతయును సరళరేఖయే !

చంద్రుడు, సూర్యుడు, నక్షత్రాలును
సన్నగీతలుగ మాత్రమె కన్పడు
పక్షులు, మృగాలు, నీవూ, నేనే
పచ్చటి చెట్లును, పెద్దభవనములు
ఎత్తు వెడల్పులు లేని గీతలటు
బొత్తిగ పొడవుగ మాత్రమె కన్పడు.

ప్రపంచ మంతా ఒకే గీతగా
భావించెదరా వర్గపు జీవులు.
ఒక పరిమాణపు తిన్నగీత వే
రొక పరిమాణమ్మాక్రమించి నపు
డది వంగును, పూర్తిగ వంగి నప్పు
డది చక్కని చక్రాకృతి దాల్చును.

చక్ర పరిధిపై సూటిగపోయే
ఒక పరిమాణపు జీవికి మార్గం
సుకరంగా అంతం కనబడకే
సూటిగ తోచును వంక మాయమౌ !

వాని అనుభవం వానికి నిజమే
కాని, మనకు ఎబ్బెట్టుగ తోచదె ?
పొడవు వెడల్పో, వెడల్పు ఎత్తో
పొడవూ ఎత్తో, రెండు మాత్రమే
పరిమాణమ్ములు తెలిసిన జీవికి
బల్లపరుపుగా నున్న తలమువలె
లోకమంతయును గోచరించునని
వాకొందురు, ధీమంతులు, జ్ఞానులు
సమతలమంటే రెండే పరిమా
ణముల నుండగల చదునగు తలమటు ;

సమతల మింకొక పరిమాణములో
సమముగ వంగిన గోళాకృతిగొను !
గోళపు వైశాల్యము పరిమితమే
గోళ తలమునకు హద్దులు లేవట.
గోళంపైనడయాడు జీవులకు
గోళమనంతంగా కనిపించును.

ఇంతకు వారికి గోళతలముగా
నుంతైనను కనిపించదు వక్రత ;
అవధులెరుంగని అనంత సమతల
మందురు పరిమిత వక్రతలమునే !

పరిమాణమ్ములు మూడు వరకు మన
మెరుగుట నిజమే ! కానీ, కాలమును
పరిమాణములో నాల్గవ దానిగ
పరిగణించు సామర్థ్యము లేదట.
కాలం సూటిగ పోవు చున్నదని
కల కాలం భావించు చుంటచే
నాలుగు పరిమాణమ్ముల కలిగిన
కాలాకాశం[1] ఊహకందదటు !

కాలాకాశం వక్రమైనదని
కాంతి కిరణమును వంగితీరునని
చెప్పిన జోస్యం మంచి ప్రయోగాల్
చేసి సత్యమని నిర్ధారించిరి.

కుడి ఎడమల వ్యత్యాసంతో కడు
చిడు ముడి పడు సామాన్యుడు నాల్గవ
పరిమాణమ్మగు కాల తత్త్వమును
సరిగా అర్థం చేసుకొన్నచో
కుడీ ఎడమైనా ఫర్వాలేదను
గడసరి కాగల డందురు విజ్ఞులు !

స్పేస్-టైమ్

---

డాక్టర్. ఎస్. గంగప్ప.

# నన్నయ నానారుచిరార్థ సూక్తి నిధిత్వం

'సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తిలో
నారసి మేలునా, నితరు లక్షర రమ్యత నాదరింప, నా
నారుచి రార్థ సూక్తి నిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్'
(1-1-26)

ఇందులో ఆదికవి అయిన నన్నయ కవితా సిద్ధాంతాల్ని తెలుపడం గమనించవచ్చు. నన్నయకు పూర్వం శాసనాలు తప్ప మనకు గ్రంథస్థ ఆధారాలు లేకపోవడంవల్ల ఆ కవుల కవితా ఆశయాలు ఏమిటో తెలియడంలేదు. ప్రస్తుతం నన్నయ కవితా సిద్ధాంతాలనుగూర్చి అందులోను ప్రధానంగా- ఆయన 'నానారుచిరార్థ సూక్తి నిధిత్వాన్ని'గూర్చి తెలుసుకోవడమే ఈ వ్యాసోద్దేశం.

ఇందులో నన్నయ మూడు విధాలైన తన కవితా సిద్ధాంతాల్ని పేర్కొన్నాడు. 1. ప్రసన్న కథా కలి(వి)తార్థయుక్తి 2. అక్షర రమ్యత. 3. నానా రుచిరార్థ సూక్తి నిధిత్వం. వీటిని పేర్కొన్న క్రమం పరిశీలనార్హం. మొదటిదైన ప్రసన్న కథాకలి(వి)తార్థయుక్తిని గూర్చి 'సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలి(వి)తార్థ యుక్తిలో నారసి మేలునాన్' అనడంలో విశేషముంది. అంటే సారమతులైన కవి శ్రేష్ఠులుమాత్రమే తనకావ్యంలోని 'ప్రసన్న కథాకలి(వి)తార్థ యుక్తి'ని 'లోనారసి' లోలోపలే మనస్సులో పరిశీలించి. 'మేలునాన్' భేషని మెచ్చుకొంటారనీ నన్నయ ఉద్దేశం. పోతే 'ఇతరులు' అంటే 'సారమతులైన కవీంద్రులు' కాని వారు తన కవితలోని 'అక్షరరమ్యత' ని గ్రహించ గలరనీ అర్థం. కాగా అటు సారమతులైన కవీంద్రులుగాని ఇటు ఇతరులుగాని గ్రహించలేని మరో కావ్యలక్షణం తనలో గలదనీ అదే 'నానా రుచిరార్థ సూక్తి నిధిత్వం' అనీ పేర్కొన్నాడు నన్నయ. ఈ విషయం స్వతఃగా తానే చెప్పవలసి వచ్చిన దన్నమాట. కారణం తన సమకాలికులు సైతం తన ప్రసన్న కలి(వి)తార్థయుక్తిని, అక్షర రమ్యతనీ గుర్తించారు. కానీ తనలోని 'నానారుచిరార్థ సూక్తినిధిత్వాన్ని' గమనించినట్లు లేదు. కనుకనే స్వయంగా చెప్పవలసిన అవసరం ఏర్పడింది.

1.1. దీన్ని పరిశీలించేముందు నన్నయ తన విశిష్టగుణాల్ని పేర్కొన్న 'తనకుల బ్రాహ్మణు' అనే పద్యంలోని ప్రధాన లక్షణాలు 'విపుల శబ్దశాసనత', 'లోకజ్ఞత', 'మత్సమరాధిపాచార్యత్వం', అంటే బుద్ధిని బృహస్పతి, వీటిని మించి 'సత్ప్రతిభా యోగ్యత' అనేవి గుర్తించడం ముఖ్యం. వీటి మూలంగానే నన్నయ మహాకవి, ఆదికవి ఆయ్యాడు. తిరుగులేని అత్యద్భుతమైన ఆదిమ రచనకు ఆచార్యుడయ్యాడు. తరువాతి తెలుగు కవులందరికీ ఆదర్శ ప్రాయుడయ్యాడు. కనుకనే మనమీనాడు ప్రస్తుతిస్తూ ఉన్నాము, స్మరిస్తూ ఉన్నాము.

1.2. నన్నయ కవితాశయాల్లో మొదటిదైన 'నన్నయ ప్రసన్న కథా కలి(వి)తార్థయుక్తి'ని గూర్చి కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు బహుముఖాల దర్శించి, లోనారసి అనుభవించి, మిక్కిలి చక్కగా వివరించారు. నన్నయ 'అక్షరరమ్యత'ను వివిధ విధాల విపులంగా 'నన్నయ అక్షర రమ్యత' అనే తమ సిద్ధాంత గ్రంథంలో మిత్రులు డా॥ వి. వి. యల్ నరసింహారావుగారు చర్చించి నిగ్గుదేల్చారు 'నన్నయ రుచిరార్థసూక్తి నిధిత్వాన్ని' గూర్చిన పరిశ్రమ ఇంతవరకు పరిపూర్ణంగా జరగనేలేదు. దీన్నిగూర్చి మొట్టమొదట క్లుప్తంగానే అయినా- వ్యాసరూపంలో వివరించ యత్నించిన ఘనత ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారికి దక్కుతుంది. ఈ సందర్భంలో లక్ష్మీరంజనంగారి మాటలు కొన్ని ఉట్టంకించడం అసమంజసమేమీ కాదు- పైపెచ్చు అత్యవసరంకూడా. 'కావ్యలక్షణములను గూర్చి నన్నయ భావములు, దండి, భామహుడు మున్నగు ప్రాచీనాలంకారికుల భావములకు సన్నిహితముగా నున్నట్లుతోచును. వీరుచాలవరకు వస్తుగుణాలంకారికుల భావములకు సన్నిహితముగా నున్నట్లు తోచును. వీరు చాల

వరకు వస్తుగుణాలంకార వాదులు. ఆనంతరికులు అగు ఆనందవర్ధనాదులు ప్రధానముగా ధ్వని రసవాదులు- సారమతిన్ అను పద్యములోని మూడు లక్షణములును దండ్యాదుల వస్తురీతి అలంకారములకు ప్రతీకలుగా తీసికొనవచ్చును'. "నానారుచిరార్థ సూక్తినిధి- అనగా నేమో యోజింతము. నానా- అనేకములైన విస్తారమైన అని యర్థము చెప్పవచ్చును, రుచిరార్థ- రుచిరములైన యర్థములుగల, సూక్తి- సూక్తులయందు, నిధి- గని వంటివాడు. రుచికలది, రుచిహేతువైనది రుచిరము అనిచెప్పవచ్చును. 'మధు' శబ్దమునకు మత్వర్థమున మధురము అని రూపమగును. తియ్యనైనది, రుచిర శబ్దమునుగూడ నట్లేనిష్పన్నము చేసుకొనవలెను. రుచిమంతమైనది రుచిరము, ఇచ్చటరుచియనగా సహృదయాహ్లాద కరమైనది దీనినే దండ్యాచార్యుడు ఇష్టార్థము అని వ్యవహరించును. 'శరీరం తావ దిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ' అని యాతని కావ్యలక్షణము నన్నయ రుచిరార్థము, దండ్యాచార్యుని ఇష్టార్థమును అభిన్నములనియే చెప్పవచ్చును. దీనినే ఉత్తర కాలికుడగు జగన్నాథుడు 'రమణీయార్థము' అని పేర్కొనును. దండి, నన్నయ, జగన్నాథుడు ఒక కోవకు చెందినవారు. దేశికావ్యములందు సూక్తులకే అగ్ర తాంబూలముగా దండిమతము. సేతు బంధ కావ్యమును గూర్చిన యాతని ప్రశంసా వాక్యములు గమనింపదగినవి.

"మహారాష్ట్రాశ్రయా భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః
సాగరః సూక్తిరత్నానాం సేతుబంధాది యన్మయమ్॥"

"మహారాష్ట్ర దేశమాశ్రయముగా గల భాషను ప్రశస్తమైన ప్రాకృతముగా విజ్ఞులు తలతురు. సూక్తి రత్నములకు నిలయమైన సముద్రము వంటి సేతు బంధాది కావ్యములిందే వెలసినవి ఆది శబ్దముచే సప్తశతి వంటి ఇతర కావ్యములని వ్యాఖ్యాతలు వివరించినారు. ప్రాకృతకావ్యములకును, దేశికావ్యములకును సూక్తి సంపద ప్రత్యేక ధర్మముగా చెప్పినట్లయినది, నన్నయ భట్టారకుడీ భావమే కలవాడుగా తోచును" "సూక్తియనగా రుచిరమై చమత్కార యుక్తమైన కూర్పు అని గ్రహింతము... పదమునందు చమత్కృతి యనగా ఆ పదము తన వాచ్యార్థమును వీడి మనోహరమైన అన్యార్థమునందు వాడబడుట. రూపలక్షణమును దానికి సంక్రమింప జేయుట దీనిని లక్ష్యార్థమనవచ్చును" [నన్నయ నానారుచిరార్థ సూక్తి నిధిత్వము-లక్ష్మీరంజన వ్యాసావళి- పు. 1-5]

2, 0. పై విషయాన్ని దృష్టిలో పెట్టుకొని నన్నయ నానారుచిరార్థ సూక్తి నిధిత్వాన్ని గురించి వివేచించిన కవ్యభిప్రాయం ఆవిష్కృతమవుతుంది. నన్నయ్య నానారుచి రార్థాలతో కూడిన సూక్తులు వివిధ విధాల దర్శన మిస్తాయి. పదాలలో పదబంధాలలో, సమాసాల్లో విభక్తుల్లో, క్రియల్లో, ఎడనెడ సంధిలో, చివరికి వాక్యాల్లో ఈ నానారుచిరార్థ సూక్తి నిధిత్వం స్పష్టమవుతుంది. అంటే వీటన్నింటిలో ఏదో ఒక వ్యంగ్యభావ స్ఫోరకమైన అభిప్రాయాన్ని ఉద్దేశించే కవి అలా ప్రయోగించి ఉంటాడని గమనించవచ్చు అలా గుర్తించగలిగినప్పుడే నన్నయ గొప్పదనం, సూక్తి నిధిత్వం, అభిగమ్యమానమై ఆనందాతిశాయి కాగలదు. వీటిని క్రమంగా పరిశీలిద్దాం.

2. 1. పదాలు :

పదగతమైన సూక్తులు బహు చమత్కారంగా సున్నితంగా చెప్పడం నన్నయ నానారుచిరార్థ సూక్తి నిధిత్వంలోని మొదటి మెట్టు. అంటే మామూలుగా ఒక పదానికుండే అర్థం కంటే విశేషార్థంలో ప్రయోగిస్తే దాన్ని సూక్తిగా మనం స్వీకరించవచ్చు. నన్నయ చేసినది ఇలాంటి పనే.

క్రమములు :

"ఉదాత్త రసాన్విత కావ్య నాటక క్రమములు పెక్కు సూచితి"
(1-1-10)

"క్రమము" అంటే వరుస, లేదా అనుష్ఠానము" అని అర్థం. కాని ఇక్కడ అలాకాక యీ అర్థాలకంటే విశిష్టార్థంలో ఈ పదం ప్రయుక్తం కావడం విశేషం పద్ధతులు, విధాలు, రీతులు అనే అర్థంలో నన్నయ ప్రయోగించడం గమనించడం అవసరం. అప్పుడే నన్నయ హృదయం ఆవిష్కరించినట్లు అవుతుంది.

అభిప్రాయంబు :

'అనవరతంబును శ్రీమహాభారతంబు నందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయైయుండు' (1-1-11) సామాన్యంగా వ్యక్తి అభిప్రాయం, అభిమతం అనడం లోకన్యాయం కానీ ఇక్కడ నన్నయ శ్రీమహాభారతంబు నందలి యభిప్రాయంబు అని ప్రయోగించాడు. అంటే ఇక్కడ భారతేతివృత్తం, భారతకథ అనే నన్నయ అభిప్రాయమని మనం గ్రహించవలసి ఉంది.

పెద్దయై :

పైవాక్యంలోనిదే ఈ పదం. 'అభిలాష పెద్దయై యుండు' అనడంలో అభిలాష పెద్దది అంటే అధికమై, గొప్పదై ఉందని అర్థం సామాన్యంగా చిన్న, పెద్ద అనే ప్రయోగం. కాని అభిలాష పెద్దయై యుంటునని నన్నయ ప్రయోగించడం విశేషం.

వివర్ధనుండు :

'పాండు వంశ వివర్ధనుండు' (1-1-8?)

జనమేజయునకిది విశేషణం. అంటే పాండు వంశాన్ని విశేషంగా వర్ధిల్ల జేసిన వాడని అర్థం. ఇదే అర్థంలోనే లక్ష్మీరంజనంగారు 'వివర్ధించు' 'విశేషంగా వర్ధిల్లజేయుట' (1-5-4) అని వివరించారు.

ఏన :

అల యకయేన దెప యజనాధ్యయన వ్రతపుణ్యకర్మముల్
సలుపుదునేని నేన గురుసద్ద్విజ భక్తుడనేని నేనయ
త్యలఘు తపస్వినేని దివిజాధిప భూసురులార మన్మనో
నిలయకు నీ ప్రమద్వరకు నిర్విషమయ్యెడునేడ మీదయన్
(1-1-149)

ప్రమద్వర సర్పదష్టయై మరణించగా ఆమె ప్రియుడు రురుడు దేవతల్ని ప్రార్థించిన సందర్భంలోని పద్యం. ఇందులో 'ఏను' అని మూడుసార్లు ప్రయుక్తం కావడంలో రురుని ఉత్తమ గుణ గరిష్ఠతని వ్యంజింప జేయడం ఇందులోని విశిష్ట విషయం. సామాన్యంగా పునరుక్తి కావ్యదోషం లాక్షణికుల ప్రకారం కానీ ఇక్కడ విశిష్టార్థంలో పునరుక్తి కావడం రురుని గుణ గరిష్ఠతా నిరూపణార్థమే

కర్కోటకుడు :

'అందుశాపానుభవ భీత చిత్తుండై' (1-2-37)

కద్రువ నూరుమంది పుత్రులలో ఈ 'కర్కోటకు' డనేవాడు ఉచ్చైశ్శ్రవం తోకకు అతుకుకొనిఉండి అంతా తెల్లనైనదానిలో మచ్చను కలిగించి, కద్రువకు దాస్యం కల్పించిన దుర్మార్గుడు. నన్నయ ప్రయోగించిన నాటి నుంచి తెలుగుదేశంలో ఏ దుర్మార్గుణ్ని చూసినా, విన్నా 'వాడు కర్కోటకుడు' అనడం సామాన్యమై పోయింది. ఇది నన్నయ సూక్తి వైచిత్రిలోని రుచిరమైన అర్థస్ఫూర్తికి చక్కటి నిదర్శనం.

వాడు, దానవి :

'పతి విహితాను రాగమున భార్గవ పుత్రి యయాతిచేత వం
చిత యయి వాడు దానవికిఁ జేసిన నెయ్యమెటింగికోప దుః
ఖిత యయి తండ్రిపాలి కతిఖేదమునం జని దీర్ఘనేత్ర ని
ర్గత జలధారలం గడగిఁగాంత తదీయ పదాబ్జ యుగ్మమున్'
(1-2-186)

ఇక్కడ యయాతి లాంటి మహారాజును "వాడు" అని ప్రయోగించడం, శర్మిష్ఠను 'దానవి' అనడం సమయాతిక్రమం చేసిన యయాతి దౌష్ట్యాన్ని ఎత్తిచెప్పడమే నన్నయ సూక్తులలోని అర్థపుష్టి ఇలాగా ఎన్నైనా ఉదాహరణలు ఇవ్వవచ్చు.

2. 2. పదబంధాలు :

పదబంధాల్లోను నన్నయ నానారుచిరార్థ సూక్తి నిధిత్వం స్పష్టమవుతుంది. సమాస పదబంధాలు ఒకటే అనుకొన్నా! ఈ పదబంధాల్ని విశిష్టార్థ ద్యోతకాలుగా-నేనిక్కడ-సమాసంకంటే వేరుగా గ్రహించాను.

వినంగనభీష్టము :

'హిమకరుఁదొట్టి పూరుభరతేశ కురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనగా మహి నొప్పిన యస్మదీయ వం
శమునఁబ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్రనాకు సతతంబు వినంగ నభీష్టమిమ్మెయిన్'
(1-1-14)

'వినంగనభీష్ట' మంటే వినాలన్న కోరిక, వినాలన్న కుతూహలం అని అర్థం ఇలానే ఈనాడు ప్రయోగం. నన్నయ తన నాడు ప్రయోగంలో ఉన్న రీతిలో 'వినంగనభీష్ట' మని వాడినట్లు తెలుస్తుంది. ఇలాంటిదే 'వినంగడు వేడ్క' (1-1-128).

తథ్యము సమకూరు :

'అమల సువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహువేద విప్రులకు దానము సేసిన తత్ఫలంబు త
థ్యమ సమకూరు భారత కథా శ్రవణాభిరతిన్......'
(1-1-15)

'తథ్యము సమకూరు' — తప్పక కలుగుతుంది. అనే అర్థంలో ఎంతోచక్కగా నన్నయ ఈ పదబంధాల్ని ప్రయోగించడంలో కవితా విశిష్టత విశదమవుతుంది.

'నేరఁబోలునే :

'అమలిన తారకా సముదయంబులనెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషసారము ముదంబునఁ బొందను బుద్ధి బాహు వి
క్రమమున దుర్గమార్థజలగౌరవ భరత భారతీ సము
ద్రముఁదటియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే'
(1-1-19)

విధాతకు సైతం సాధ్యమవుతుందా? అనే అర్థంలో ఎంతో సహజ సుందరంగా ప్రయోగించాడు

ఏయది:

ఏయది హృద్యమపూర్వం
బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘని బర్హణ
మేయది యక్కథయ వినంగ నిష్టము మాకున్'
(1-1-30)

'ఏయది పునరుక్తం కావడం వల్లనే ఆ మునులు వినదలచిన కథావైశిష్ట్యం స్పష్టమవుతుంది. పూర్వోక్తమయినట్లు పునరుక్తి కావ్యదోషమే అయినా ఇక్కడే పదబంధం వల్ల దాని తీవ్రత విదితమవుతుంది.

కాకేమి :

'అనిన విని యుదంకుండప్పుడు దలంచి యావృషభ గోమయ భక్షణంబునస్సైన యశుచిభావంబునఁగాకేమి యప్పరమ పతివ్రత మదీయ దృష్టి గోచరం గాకున్నదయ్యె' (111-98)

కాకమరేమి ! అందువల్లనే అనే అర్థంలో 'కాకేమి' ప్రయుక్తం,

పోవనినాడు :

చేయనినాడు ·

కానినాడు .

'నేడు పోవనినాడు నిష్ఫలంబిమ్మహాయత్నమంతయు'
(1-1-115)

'మీరట్లు సేయనినాడు దానికి మఱియేను దాసి నగదు'
1-2-34

'దేవతలన్ జయించుచు నతిస్థిర సంపదలన్ ద్వదీయ వి
ద్యా విభవంబు పెంపునన దానవు లుద్ధతులైరి కాని నాఁ
డీ వన రాశిలోఁ జొరరె......' (1-3-151)

ఈ ప్రయోగాలన్నీ ఏంతో అర్థవంతంగా నన్నయ వాడినట్లు తెలుస్తుంది. పైగా ఇవి ఈనాడు తెలుగు వాడి వాడుకలో ఉండడమే విశేషం.

చిత్తముగలదేని :

'నీవు నీదయిన దాస్యముఁబాచి కొనంగ నీకు చిత్తముగలదేని'
(1-2-55)

'నీకిష్టముంటే, నీకిష్టమైతే, నీకు కోరిక ఉంటే' అనే అర్థంలో 'నీకు చిత్తముగలదేని' 'నీకుమనసుంటే' అని ప్రయోగించాడు నన్నయ. ఈనాడు ఈ ప్రయోగం ఇలానే ఉండడం గమనించదగ్గ విషయం.

ఇదియేటి తపము

'అనఘ యిది యేటి తపమే
మనుపమ దుష్కృతుల మగుట నాధారములే
దని సంతానోచ్ఛేదం
బున వ్రేలెద మధమలోకమున తెరువుచనన్ (1-2-143)

అని తన పితామహులు జరత్కారునితో చెప్పిన సందర్భంలోని "ఇది యేటితపము' ఇది ఒక తపమేనా ! అనే అర్థంలో ప్రయుక్తం కావడం నన్నయ లోకజ్ఞతకు నిదర్శనం. ఆనాటి ప్రయోగం ఈనాడు ప్రయోగంలో ఉండడమే ఇందులోని గొప్పదనం. ఇలాగే 'ఇదియేటిదని' (1-3-198) గూడా ప్రయుక్తం.

కొండుకయది, దాని తోడిదేమి.

'కావున బుద్ధిగల వారికిఁ గ్రోధంబు గొనియాడందగదు. శర్మిష్ఠ రాచకూతురు గొండుక యది దాని తోడి దేమి రమ్మనిన దేవయాని యిట్లనియె' (1-3-148)

శుక్రుడు దేవయానితో చెప్పి బుజ్జగించడం ఇందులోని విషయం కోప పూర్ణ అయిన దేవయాని సహించదు మొదట. రాచకూతురని అభిజాత్యాన్ని, అధికారాన్ని చెప్పి 'కొండొకయది' చిన్నది, బుద్ధిలేనిది 'దానితోడిదేమి' రమ్మన్నాడు. ఈ ప్రయోగాలు సహజ సుందరమై తన ముద్దులకూతురును సముదాయిస్తున్నట్లే స్పష్టంగా ఉంది.

ఎట్టి కుమతులైన :

'తగిలి జరయు రుజయు దైవవశంబున
నయ్యెనేని వాని ననుభవింత్రు
గాక యెఱిఁగి యెఱిఁగి కడఁగి యారెంటిఁ జే
కొందురయ్య యెట్టి కుమతులైన (1-3-193)

విధివశాత్తువల్ల వచ్చినవాటినైతే ఎవడైనా అనుభవిస్తాడు! గతి లేక కానీ కావాలని ఏబుద్ధిలేని వాడైనా ముసలి తనాన్ని గ్రహిస్తాడా అని దేవయాని పుత్రులైన యదుతుర్య - స్వద్రుహ్యానులు తండ్రి యయాతితో చెప్పినమాటలు ఎట్టి కుమతులైన- ఎంత బుద్ధిహీనులైన అనే అర్థంలో ప్రయోగం.

పెద్దయుంబ్రొద్దు :

'హృదయ సంతాపంబు దనకుఁదాన యుపశమించుకొ పెద్దయుంబ్రొద్దు చింతించి శకుంతల యా రాజున కిట్లనియె'(1-4-78)

చాలసేపు అనే అర్థంలో ప్రయుక్తం. ఇలాగే

'అనిన విని భెద్దయుంబ్రొద్దు చింతించి శంతనుండు గొడుకు కిట్లనియె' (1-4-180) అనే వాక్యంలోను గమనించగలం.

ఇలాగ పదబంధాల్లో నన్నయ నానారుచిరార్థ సూక్తినిధిత్వాన్ని స్పష్టం చేశాడు.

**2.3. సమాసాలు :**

పద బంధాల్లో లాగానే సమాసాల్లోను నన్నయ తన రుచిరార్థ సూక్తి నిధిత్వం అభివ్యక్తీకరించడం గమనించగలం.

**కొన్ని ఉదాహరణలు :**

**భారత కథా శ్రవణాభిరతిన్ :**

'అమల సువర్ణశృంగ ఖురమై కపిలం బగు గోశతంబు ను
త్తమ బహు వేద విప్రులకు దానముచేసిన తత్ఫలంబు త
థ్యము సమకూరు భారత కథా శ్రవణాభిరతిన్..." (1-1-15)

ఇక్కడ 'భారత కథా శ్రవణ మందలి అభిరతిన్- అతిశయిత మైన కోరికవల్ల' అనే విషయాన్ని నన్నయ ఉద్ఘాటించడం గమనించ వచ్చు.

**కృతాంత నికేతనాతిథిన్ :**

"———————————భవ
జనకుఁ బరీక్షితున్ భుజగ జిహ్మఁడసహ్య విషోగ్ర ధూమకే
తన హతిఁ జేసిచేసె నతి దాంతుఁ గృతాంత నికేతనాతిథిన్"
(1-1-124)

ఇక్కడ "భారతాన్వయాభివర్ధనుడు", ధనంజయ సన్నిభుఁడు" అయిన పరీక్షిత్తును "భుజగ జిహ్మమైన" తక్షకుడు ప్రాణంగొన్నాడన డానికి "కృతాంత నికేతనాతిథిన్"- యమ సదనానికి అతిథిగా జేశాడని ఈ సమాసంలో చక్కగా వ్యంజింప చేశాడు. నన్నయ

"మదీయైక పర్ణ శకల చ్ఛేదంబు"

ఇంద్రుడు గరుడునిపై వజ్రాయిధం ప్రయోగించగా చూచి గరు డుండునగి నీచేయువేదన నన్నుందాక నోపదు. నీవుమహాముని సంభవం బగుటను, దేవేంద్రుని వాయుధంబవగుటను. నిన్ననవమానింపం గాదు. గావున మదీయైక పర్ణశకలచ్ఛేదంబు సేయుము" (1-2-109) అని అంటాడు. ఎంతో అర్థవంతమై నన్నయ సూక్తి నిధిత్వం నిండారి ఒప్పతుంది ఇందులో. వజ్రాయుధం గొప్పదనం తెలిపి, నిన్నవమానించ కాదనే ఉద్దేశంతో "మదీయైక పర్ణశకలచ్ఛేదంబు" అంటే "నా వెంట్రుక ముక్కను తుంచివేసే" దంటాడు. ఇదే సంస్కృతంలో ఉంటే అంతబాగాఉండ కానీ తెలుగు చేసేసరికి తెలుగువాడి వాడి మాటలాఉంది. ఇది ఇందులోని విశేషం.

**మనోజ రాజ్యలక్ష్మీ :**

"దానిం గన్యకఁగా నెఱింగి మనోజ రాజ్యలక్ష్మియుంబోనిదాని'
(1-4-28)

**తరుణ శశిరేఖ :**

"అమ్మాలినీ పులిన తలంబున శకుంత రక్షిత యున్నకూతు నత్యంత కాంతిమతి నవనీ తలంబున కవతరించిన తరుణ శశిరేఖయుం బోని దాని" (1-4-48)- అని సాభిప్రాయంగా శకుంతలను గూర్చిన విశేషణాలు ప్రయోగించాడు నన్నయ.

**విమల యశోనిధీ :**

"విమల యశోనిధీ! పురుషవృత్తమెఱుంగుచు నుండుఁజూవె"
——————నరుడుదక్కఁగ నేర్చునె తన్నుద్రుమ్చిలన్
(1-4-80)

**సూనృత వ్రత :**

"మతజల పూరితంబులగు నూతులు నూటికంటె సూనృత వ్రత యొక బావిమేలు——————— (1-4-94).

పైరెండు ప్రయోగాలు సంబోధనలు. ఈసంబోధనాత్మక ప్రయోగాలలో నన్నయ సూక్తినిధిత్వం రుచిరార్థపూరితమై ఒప్పతూంది.

**కుమారాయిత శక్తిశాలి :**

"కుమారాయిత శక్తిశాలి ధృతరాష్ట్రుడు" (1-5-6)
(చూడుడు-లక్ష్మీరంజన వ్యాసావళి-పుట-9).

**కులతిలకుండు :**

"కులమును రూపము శీలము
గల కన్యలఁ దెచ్చి తెచ్చి గాంగేయుండీ
నలఘుఁడు ధృతరాష్ట్రుఁడు కుల
తిలకుండు వివాహమయ్యె దేవీ శతమున్" (1-5-13).

ఇక్కడ "కుల తిలకుండు" అని నన్నయ ప్రయోగం ధృతరాష్ట్రుని జీవితాన్నంతటిని పరిశీలిస్తే అసలు అర్థంకంటే వ్యంగార్థమే. స్ఫురించి తన సూక్తినిధిత్వాన్ని వ్యంజింప జేశాడని స్పష్టమవుతుంది-

( ఇంకా ఉంది )

# ఒంటరితనం

నాకు రోజూ
విహాయస నీలవేణిలో అందంగా పొదగబడ్డ
నక్షత్రాల ముత్యపు చేమంతి బిళ్ళలను చూసుకొంటూ
ఆ వెలుగులో నాకు దూరంగా పారిపోతున్న
గెలాక్సీల వేగాలను లెక్కకడుతూ,
రసార్ద్ర భావనాకాశంలో
సుషుప్తి నిశాకాంతను వెక్కిరిస్తున్న
మచ్చలేని చంద్రుణ్ణి ఊహించుకొంటూ
ఈ దారినే నడచి రావడం అలవాటు,
'నీలాభ్ర నరసి రంగు నీలమైనా
రాలే వాన చినుకులకు అది అంటుదే !' అనుకొంటూ
పారదర్శకమైన ఈ నీటి బిందువులను
చేతిలో చిలకరించి అడిగితే
అవి కోపగించి
తమ గుండ్రని ముఖ రూపం పోగొట్టుకొని
తెల్లగా పాలిపోయి
నా దృష్టి కవతలవైపు నున్న
తమ హృదయ బింబాన్ని కనిపించనీయలేదు ;
ఎందుకో నామది తల్లడిల్లింది.

మబ్బు తేలిపోయి మరికాస్త పైకి వెళ్ళింది
పొగమంచు మెల్లగా ఆవరించుతోంది,
నేనక్కడే ఆగిపోయి కూలబడిపోయాను_
చుట్టూ నిశ్శబ్దం, కాని మనసులో ఏదో ధ్వని
ఎక్కడో నిర్వేద నిశీధిలో, రోదనధుని....
రోజూ నేను నడిచే దారి
నా కోసం ఎదురు చూచి చూసి అలసి
మొహం నల్లగా మాడ్చుకొంది.
దూరంగా మినుకు మినుకు మంటున్న దీపం
అది కూడా మానేసి ఆరిపోయింది.
నా జీవన తీరంలో అలలు ఆగిపోయాయి_
నిశ్శబ్దంగా నీరవంలో ఒంటరితనం.
చంద్రికా స్నాత శాద్వల శాంత ముఖం మీద
ముగ్ధంగా, మౌనంగా, సమూహంగా
ఎన్నో మంచు బిందువులు_
తమ జీవితకాలం ఒక్క రాత్రే అయినా
పచ్చికతో వాటిబంధం
నన్ను కలవర పరిచింది,
నీకెవ్వరూ తోడు లేరే అని
ఎత్తిపొడిచింది.

# జీవచ్ఛవం

మెలకువలో నేను పోగొట్టుకొన్న
రంగుల స్వప్నం
నన్నంత బాధపెట్టలేదు ;
కాని
సుషుప్తిలో నేను కోల్పోయిన
చైతన్య జాగృతి
నా దరికి తిరిగి రాలేదు.
కల మిగిలినా, మెలకువ కలిగినా
ఇంకెందుకు ఈ జీవితం
ఊహల చేతుల ఊర్పులతో
జ్ఞాపకాల చెలములను తోడితే
విషాద నలిలం వెక్కిరిస్తున్నప్పుడు ?

—కెమెరా

సీరియల్

# మృత్యువు

ఇచ్ఛాపురపు రామచంద్రం

( గ త సం చి క త రు వా యి )

రాత్రి తొమ్మిదౌతూంది.

ఎక్కడా యోగి జాడ కనిపించడం లేదు. ఆ విషయం గురించి అట్టే పట్టించుకోకుండా పతంజలి సుషమని హెచ్చరించాడు. "సమయం సమీపిస్తూంది."

ఆమె బయలుదేర బోతూంటే - ఒంటరిగా వెళ్ళి రాలేవేమో .. నేనూ సాయం వొచ్చేదా ? . అడిగాడు

ఆమె సిగ్గు పడింది.

ఆ మౌనాన్ని తనర్ధాంగీ కారంగా తీసుకున్నాడు. లేచి తోవ తీశాడు. అతని వెంట నడవసాగిందామె

వాగు కుటీరానికి రెండు మూడు ఫర్లాంగుల దూరంలో ఉంది తోవ అంతా వృక్షాలమయం ఆ చెట్ల నడుమనుంచి సన్నని త్రోవ. కాలిబాట. రాత్రివేళ అడివి చిత్రంగా ఉంటుంది. ఉండుండి ఏదో పక్షి అరుపు అడవి ప్రశాంతత త్రుళ్ళి పడుతుందొక్కసారి. నిశ్శబ్ద నిశీధిలో - ఏదో జంతువు గర్జిస్తుంది. అడవి నిద్ర లేస్తుంది.

సుషమ ఆలోచిస్తూ నడుస్తూంది. మృత్యుంజయ నిజంగా మనిషి ఆయువును పెంచుతుందా ? పెంచితే - ఎంత పెంచుతుంది? మరో వందేళ్లా ? యాభయ్యేళ్లా . . పాతికేళ్లా ?

అదే అడిగింది పతంజలిని మెల్లగా.

"నా అంచనా ప్రకారం మృత్యుం జయని సేవించిన వారు నిరాటంకంగా కనీసం నూట యాభై ఏళ్ల జీవిస్తారు ఆపైన కూడా జీవించినా జీవించవొచ్చు"

"ఒకే ఒక్క మోతాదు సేవిస్తే చాలా ?...

"ఆహఁ"

ఆమె కిలా నడవడం బాగుంది వెన్నెలలో అడవి చాలా అందంగా ఉంది. చెట్ల సందుల లోంచి వెన్నెల ఆకాశం కనపడుతూంది. పతంజలి వెనుక - దాదాపు అతనికి తగులుతున్నట్లుగా . . . కబుర్లు చెబుతూ నడుస్తూంటే తమాషాగా ఉంది. ఈ క్షణాలిలాగే శాశ్వతంగా నిలచిపోతే.?

"గురూజీ !" మెల్లగా పిలిచింది.

"ఏమిటీ?"

"మరి మీరు మృత్యుం జయని సేవించరూ ?"

"ఊహుఁ"

ఆశ్చర్యపోయిందామె అతని సమాధానానికి" ఎందుకని?"

"ఈ ప్రపంచంలో నాకెవరున్నారని ? ఏముందని.

అందుకే మృత్యుంజయని నామీద ప్రయోగించుకుందుకు నాకెంత మాత్రమూ యిష్టం లేనిది"

ఆమె కాశ్చర్యం కలిగింది. ఎంతఒంటరి అయినా జీవితం మీద యిచ్ఛ నశించే మనిషి ఉంటాడా, మరీ విపత్కర మయిన పరిస్థితు లెదురయిన ఆ క్షణాలలో తప్ప? పతంజలి బాధలు-గతంలోవి. అవి ఈ పాటికి చాలా మట్టుకు చెరిగిపోయీ, కరిగిపోయే ఉంటాయి. క్రూరజంతువులు లేవని నిర్ధారించుకుని ఆమె వెన్నెలలో వెండిలా ప్రవహిస్తున్న కొండవాగులో స్నానం చేసి వొచ్చింది. పవిత్రమయిన వస్త్రం ధరించి-వొడ్డెక్కింది. తిరుగుప్రయాణం మౌనంగానే సాగింది. పతంజలి లాగే ఆమె హృదయమూ ఆతృతతో వేగంగా కొట్టుకో సాగింది. పూజా కుంకుమ దిద్దించి ఆమెను దైవ విగ్రహాల ఎదుట కూర్చుండ బెట్టాడు. పవిత్రంగా. ఓ అరగంట సేపు పూజ జరిగింది. అప్పుడు దేముని పాదాల వద్దనుంచి చిన్న భరిణను తీశాడు. పూలూ అక్షింతల నడుమనుంచి. దానిని తను కనుల కద్దుకుని ఆమెచేత దానికి నమస్కరింపజేశాడు.

"భగవంతుని ధ్యానిస్తూ-నోరు తెరువ్. నామీదా, యీమృత్యుంజయ మీదా పూర్తి విశ్వాసముంచి దీనిని సేవించు ..." అంటూ ఆమె నోట్లో ఆ భరిణలోని మందు వేసి-గొంతు దిగడానికన్నట్లు తులసి తీర్థం యిచ్చాడు పతంజలి ఆమె అతి భక్తిగా స్వీకరించింది.

సరిగ్గా అదే క్షణంలో_ యోగి- అక్కడి కరమైలు దూరంలో నిర్జన ప్రదేశంనుంచి_పాకెట్ ట్రాన్స్మిటర్‌ద్వారా వార్తలు పంపుతున్నాడు రహస్యంగా.

"నాకు నిద్రవొస్తూంది." అంటూ శయ్యమీద శరీరాన్ని వాల్చింది సుషమ. కొన్నినిముషాలు... ఆమె గాఢనిద్రలోకి జారిపోయింది. పతంజలి ఆమె చేయందుకుని నాడి చూస్తూ కూర్చున్నాడు. అతని ముఖం ప్రశాంతంగా ఉంది. అతని చేతిలో ఆమె చేయి...రేయి గడుస్తూంది.

సుషమలో చలనం కలగడమేమిటి, పతంజలి ఆనందం పట్ట లేక ఒక్కసారి గట్టిగా అరిచాడు "గెలుపు నాదే" అతను సంతోషం పట్టలేక ఉక్కిరి బిక్కిరౌతున్నాడు. విజయగర్వంతో అతను ఒకచోట నిలవలేకపోతున్నాడు ఆనందం పంచుకుంటే తప్ప అతనికి ఊపిరాడే ట్టు లేదు. అతని ఉత్సాహం పెద్ద పెద్ద సముద్ర కెరటాల్లా ఉరకలు వేస్తూంది. అతని కేకలకు కుటీరం ప్రతిధ్వనిస్తూంది. అతను నాట్యం చేసేస్తున్నాడు. గంతులు వేస్తున్నాడు.

కుటీరపు తలుపు కొంచెం తీసిఉందని అతను గమనించలేదు. ఆ తలుపు వెనుక ఎవరో ఉన్నారని అతను చూడలేదు. తన ఆనందమే తప్ప - ఏం జరగబోతూందో అతనికి తెలియడం లేదు. అవధు లెరుగని ఆనందం. ఔను. అతను సాధించిన విజయం సామాన్య మయి నది కాదు. మృత్యువుని జయించాడతను. పగతీర్చుకున్నాడు. పంతం నిలుపుకున్నాడు ప్రకృతిమీద విజయం . . . భగవంతుడి మీద విజయం .. మానవ జీవితం కనీసం నూటయాభై సంవత్సరాలు సాగే మందు అతని మెదడులో తయారయింది. అదేమీ ఖరీదయినది కాదు. దానిని తయారు చేయడానికి అరుదైన మూలికలేమీ అక్కరలేదు. ఒక్కసారి చూస్తే ఆ మూలికలను - మొక్కలను ఎవరైనా గుర్తు పట్టవచ్చు - ఎవరయినా తయారుచేయవచ్చు. అతి సులభంగా చవకలో తయారయ్యే - మృత్యుంజయ.

మృత్యుంజయ-మానవుడి ఆయుర్దాయాన్ని పెంచడమే కాదు. అకాలమృత్యుహరణంకూడా. అనారోగ్య నిర్మూలనికూడా. పుట్టిన పసి పాపనుంచి-పండువృద్ధు వరకూ ఎవరేనా ఏవయసులో అయినా-ఒక్క చిటికెడు మృత్యుంజయను సేవిస్తేచాలు. ఇక అనారోగ్యమనేది దరి చేరదు. దీర్ఘాయుష్మంతులౌతారు. ఒకే ఒక్క మోతాదు. పథ్యంలేదు. ఆయుర్వేద సూత్రాలతో ఉద్భవించిన దివ్యౌషధం మృత్యుంజయ ఆయుర్వేదం సార్థక నామధ్యేయం అయింది. మిగిలిన అన్ని శాఖలూ సాధించలేనిది. ఆయుర్వేదానికే సాధ్యమయింది. ఇది తెలిస్తే తన తండ్రి ఎంత సంతోషిస్తాడో ! అతని ఆత్మ ఎంత గర్విస్తుందో ! ఒక్కసారి అతని ఆత్మ సాక్షాత్కరిస్తే ఎంత బాగుండును. నాన్నా ! ఒక్కసారి రావూ ? నా విజయాన్ని తెలుసుకుని - సంతోషించి - నన్నభినందించవూ ? నా విజయం - నీ చలవే, నీ అనుగ్రహమే. నువ్వు నేర్పిన విద్యే నాన్నా యిది నువ్వుమెచ్చుకుంటే నాకు పొంగు ఒక్కసారి దర్శనమియ్యి నాన్నా !

అమ్మా! కనీసం నువ్వేనా కనిపించవమ్మా...నీ ఆశీర్వచన ప్రభావమే కదా యిది. రామ్మా...రా...ఒక్కసారి రా . పార్వతీ! నన్ను మరచి పోయావా? నువ్వు నన్ను కోరిన కోరిక విస్మరించావా? మన ప్రేమచిహ్నంగా మృత్యువుని జయించే ఔషధం కనిపెట్టమన్నావు పట్టుదలతో కృషిచేసి-సాధించాను నిజానికి నా ప్రయత్నం వెన నున్నది నీ ప్రేమే. నన్ను యిన్నాళ్ళూ ముందుకు నడిపించినది నీ అ రాగమే నా సాధన వెనుక శక్తి నీ ప్రణయమే. ఒక్కసారిరావు నేను సాధించిన విజయాన్ని కాంచవూ! నన్నభినందించవూ?

నేను మృత్యువుని జయించాను. పార్వతీ!

చావుని చిత్తు చేసిన మానవుడిని నేను. ఇదివరకటిల మృత్యువు ఎప్పుడు పడితే అప్పుడు...ఎవరినిపడితే వారిని కంబళించే దుకు, వీలులేకుండా కట్టడి చేశాను శిశు మరణాలూ- అకాలమరణాలు ఉండవిక. చిటికెడు మృత్యుంజయతో-మానవ జీవితమే మారిపోతుంది ఈమోతాదు సేవించినవారికి వైద్యుడి అవసరంరాదు. కనీస నూటయాభై సంవత్సరాలయినా జీవిస్తే తప్ప అతని జీవితం వే మృత్యువు తొంగిచూడడాని కయినా వీలులేదు ఈ దివ్యౌషధం ఉద్భ వించేందుకు పరోక్షంగా కారణం- నువ్వే పార్వతీ. ఒక్కసారి రావూ



అయ్యో...నీ ఆత్మకూడా మరో దేహాన్నాశ్రయించేసి నన్ను మరచి పోయిందా?

"స్వామీ! ప్రభూ!" మెల్లగా పిలుపు.

పతంజలి అటు చూశాడు, సుషమ కళ్ళు తెరచి-పిలుస్తోంది. ఆమె పెదవుల మీద చిరునవ్వు. అతనాతృతగా ఆమెను చేరాడు. ఆమె మీదకివొంగి_ఏమిటన్నట్లు ఆమెకళ్ళలోకి చూశాడు.

"కొంచెం మంచితీర్థం..."

అతను చటుక్కున పాత్ర అందుకున్నాడు "సర్వపాపహరం తులసితీర్థం..." ఉద్ధరిణెతో ఆమెకు తులసి తీర్థం అందించాడు. మూడు ఉద్ధరిణెలు తాగి, ఆమె లేచి కూర్చుంది ఉత్సాహంగా.

"ఎలా ఉంది?" ఆత్రంగా అడిగాడు.

"అద్భుతంగా. చెప్పలేనంతహాయిగా.... కొత్తగా... ప్రభూ! నా శరీరంలో ఏదోమార్పు. ఉరకలు వేస్తున్నశక్తి..." అతను విజేతలా నవ్వాడు. "ఔను. మృత్యుంజయలోని విశేషమదే. అది బలహీన తను పారద్రోలుతుంది. మృత్యు పర్యంతమూ మనిషి జవసత్వాలను కలిగిఉంటాడు. సుషమా! నువ్వు చిరంజీవివయ్యావు. నీ ఆయుర్దాయం అధమపక్షం ఒకటిన్నర శతాబ్దాలు. ఈలోగా నిన్ను ఏరూపంలోనూ మృత్యువు దరిచేరలేదు"

"అంటే...ప్రమాదంకాని... విషంకాని...షాక్ కాని..."

"దేనికీ నీ శరీరంలొంగదు. నువ్వు సేవించిన మృత్యుంజయ నీకు వార్థక్యం లేకుండానూ....దీర్ఘాయువుగానూ... అకాలమృత్యువు సోకకుండానూ చేసి వొదిలింది."

"ఎంత అదృష్టవంతురాలిని! అందామె కృతజ్ఞతా సంతోషమూ గర్వమూ, కంఠంలో ముప్పిరికొనగా.

"నువ్వు సిద్ధపడ్డత్యాగం...తలపెట్టిన సాహసం-తక్కువేమీ కావు. ప్రాణత్యాగానికే సంసిద్ధురాలివయ్యావు. మృత్యుంజయ పరీక్షకు పెట్టింది. మొదటిసారిగా నీమీదే, ప్రయోగం సఫలమైందనీ.. మృత్యుంజయ సరిఅయిన ఔషధమనీ రుజువు చేసింది నువ్వే, సుషమా! నీకు మానవజాతి రుణపడి ఉంటుంది...."

"నేను నిమిత్తమాత్రురాలిని..."

"ఎంతమాత్రమూలేదు, నేను కనిపెట్టిన మృత్యుంజయను నా మీదే ప్రయోగించుకోడం అసాధ్యం, అది పనిచేసే తీరు తెన్నులు చూసి అవసరమయితే మార్పులు చేయాలి. ప్రమాదంతోకూడిన వాళ్ళే ఆ మోతాదును తీసుకోగలరు. అప్పటికి-అది ఏమి పనిచేస్తుందో నాకూ ఖచ్చితంగా తెలియదుకదా! దైవం మీదభారంవేశాను- నీచేత మృత్యుంజయను సేవింపజేస్తూ." ఒక్కసారిగా- హఠాత్తుగా ఏదో గుర్తు వచ్చినట్లు అడిగాడు "యోగి యేడీ?"

సరిగ్గా అదే క్షణంలో -

పతంజలి ప్రశ్నకు సమాధానమా అన్నట్లు- కుటీరపు తలుపు తెరుచుకుంది. "అభివందనాలు గురూజీ!"

అంటూ చిరునవ్వుతో - చేతులు వెనక్కి కట్టుకుని - లోపలికి ప్రవేశించాడు యోగి.

అతనివైఖరి చూస్తూంటే ఎందుకో భయం వేసింది సుషమకి. యోగి ముఖం-విషసర్పపు ముఖంలాగే ఉంది. అతని కన్నుల్లో కుటిలత్వం తొంగి చూస్తూంది. సుషమకి ఆరో జ్ఞానేంద్రియం_ఏదో చెబుతూంది.

"స్వామీజీ! నేను మీ శిష్యుణ్ని. ఇన్నాళ్ళూ మీ సేవ చేశాను. ఐతే-మీరు నాకే విద్యా బోధించలేదు, సేవలు చేయించుకోడంతప్ప. ఇప్పుడు నేనొకటి కోరుతున్నాను," పతంజలిని కదలనివ్వకుండా అతని పాదాలను బంధించినట్లు పట్టుకున్నాడు. అతని ఒకచేతిలో కనిపించీ కనిపించకుండా-చిన్న పిస్టల్ ఉంది. అది రూపానికెంత చిన్నదో శక్తికి అంతపెద్దది. నిశ్శబ్దంగా-ఒక్కగుండుతో అది ప్రాణాలు తీయగలదు.

"ఏమిటి?" అడిగాడు పతంజలి. అతనికేమీ అర్థం కావడం లేదు. తను ప్రమాదంలో చిక్కుకున్నాననే అతనికి తెలియదు. అమాయకంగా ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"మృత్యుంజయ ఫార్ములా చెప్పండి".

తృళ్ళిపడ్డాడు పతంజలి. ఒక్కసారతనికి యోగిమీద విపరీతమైన ఆగ్రహం కలిగింది. అది తన హక్కులా అడగడంతో అతనికి తీవ్రమయిన కోపం వచ్చింది.

"నేను చెప్పను-" అనేశాడు.

"ఊరికే వొద్దు. మీకు గురుదక్షిణ యిస్తాను. లక్ష డాలర్లు యిస్తాను, ఇంకా మీరేంకోరినా తీరుస్తాను. నామాటవిని మీరు బాగుపడండి. నన్ను బాగుచేయండి."

"లక్ష డాలర్లు! నీకెక్కడివి యోగి?" నమ్మలేనట్లడిగింది సుషమ అతని వేపుచూస్తూ.

"ఇప్పుడు నేనుచాలా గొప్పవాడినైపోయాను సుషమా! మీరు అమాయకంగా యిక్కడ ఉండిపోయారు. బయట ప్రపంచంతో సంబం

ధం లేకుండా. కానీ-నేను ప్రపంచంతో సంబంధాలు కలిగే ఉన్నాను పతంజలి స్వామి మృత్యువుని జయించే ఔషధం కనిపెట్టే ప్రయత్నంలో ఉన్నాడని ప్రపంచదేశాలన్నిటికీ ఎప్పుడో తెలుసు.''

"ఎలా?"

"నాద్వారానే. నేను పూర్వాశ్రమంలో సి ఐ.ఏ. ఏజంట్ కి ఇన్ ఫార్మెంటుని. సుషమా! నిన్ను నేను ప్రేమిస్తున్నాను. మనం వివాహం చేసుకుందాం. ఈ ఉద్దేశంతోనే నీకు నా గురించి ఏమీ దాచకుండా చెబుతున్నాను.

ప్రపంచం- రెండుగా చీలిపోయింది. పతంజలి ప్రయత్నం విజయవంతం కావాలని ఒకపక్షమూ, భగ్నం కావాలని రెండవపక్షమూ. నేను ఊరికే రెండవపక్షంవేపు ఉన్నట్లు నటిస్తూ వచ్చాను. నిజానికి ఇద్దరి ధ్యేయమూ ఒక్కటే. ఫార్ములా తెలుసుకోవాలి. దాన్ని తన గుప్పిట్లో ఉంచుకొని ప్రపంచాన్నాడించాలి. ఈ ఫార్ములాని తెలుసుకో గలిగితే నాకు కొన్నిలక్షల డాలర్లిస్తామన్నారు ప్రతిపక్షంవాళ్లు. బేరం పెట్టి ఎవరెక్కువిస్తే వారికి చెబుదాం. "యోగి ఆమెను తన మనిషిగా చేసుకుందుకు ప్రయత్నిస్తున్నట్లున్నాడు "దెబ్బతో మన దరిద్రం తీరుతుంది. మనం వైభోగంగా కలకాలం ప్రేమించుకుంటూ హాయిగా జీవించవచ్చు". అని- పతంజలివేపు తిరిగాడు. "గురూజీ మీరుకూడా బాగుపడండి. ఇన్నాళ్ళూ మీరు సుఖపడనేలేదు. కొండలూ కోనలూ గట్లూ పుట్టలూ తిరుగుతూనూ, పాకల్లోను గుడిసెలలోనూ నివసిస్తూ నానాగడ్డీ తినీ- తినకా- అలాగే గడిపారు, ఇకనయినా యీ అధ్యాయానికి మంగళం పాడేసి కొత్త- సౌఖ్యమయిన జీవితం ప్రారంభించండి . .''

పతంజలికి చాలా కోపం వచ్చింది. ఈ యోగి- యిన్నాళ్ళూ తనేంచెబితే అది చేస్తూ సేవకుడిలా పడిఉండేవాడల్లా యీ వేళ... యిప్పుడు ఎలామాట్లాడుతున్నాడు! ఇతనికి పొగరెందుకొచ్చింది ?

"యోగీ!" అరిచాడు పతంజలి.

అతను చలించలేదు. పైగా చాలాధీమాగా- "ఒకటి కాకపోతే రెండు లక్షలుతీసుకోండి. ఫార్ములా చెప్పండి". అన్నాడు డిమాండ్ చేస్తున్నట్లు.

ఇంక భరించలేనట్లు- చటుక్కున అంది సుషమ-

"వొద్దు గురూజీ! ఎంత మాత్రమూ యీ అల్పుడికా రహస్యం చెప్పకండి".

తెల్లబోయి ఆమె వేపు చూశాడు యోగి. "సుషమా! మనం- ప్రేమికులం".

"షటప్" అసహ్యం వ్యక్తంచేస్తూ అరిచిందామె. "మన మధ్య ప్రేమేమిటి? నీలాటి నీచుణ్ణి చచ్చినా ప్రేమించను అటువంటి ఆశలేమీ పెట్టుకోకు".

"స్వామీజీ! మీరు ఫార్ములా చెప్పకపోతే చాలా నష్టపోతారు కోరినంత ధనం కాలదన్నుకోకండి నిష్కారణంగా బందీకాకండి అవసరమయింది కనుక అసలు విషయం చెబుతున్నాను. ఫార్ములా చెప్పకుండా మీరిక్కడనుంచి తప్పించుకోలేరు,ఈ కొండచుట్టూ వలలా అల్లుకుని ఉన్నారు మీ కోసం గూఢచారులు ... వాళ్ళు మిమ్మల్ని వదలరు".

"ఆ" నిర్ఘాంతపోయాడు పతంజలి. "యోగీ నువ్వింతనీచుడివా నమ్మక ద్రోహివా!

యోగి అతని చూపులనెదుర్కోలేనట్లు తలవంచుకుని తనలో తానే గొణుక్కున్నాడు... . "ఏదినీచం? ఏదినమ్మకద్రోహం? జీవితం అద్భుతమయిన అవకాశాన్ని పొందేసమయం లభించినప్పుడు ఎవరు మాత్రం తెలివితక్కువగా వొదులుకుంటారు?"

"వొద్దు స్వామీ! . వొద్దు . ఆ ఫార్ములాని యీ నీచుని కెంతమాత్రమూ తెలియనివ్వకండి అలా అయితే మీ ఆశయమే దెబ్బ తింటుంది. వీళ్ళు మృత్యుంజయని విశ్వమానవ కళ్యాణం కోసం వినియోగించరు. తమస్వార్థ ప్రయోజనాలకోసం అధికారం హస్తగతం చేసుకోవడంకోసం క్షుద్ర ధ్యేయాలకోసం మాత్రమే వాడుకుంటారు ప్రపంచాన్ని గెలుచుకుందుకు దీన్ని సాధనంగా చేసుకుంటారు" హెచ్చరిస్తున్నట్లుంది సుషమ ఆమెకు పరిస్థితంతా పూర్తిగా ఆకళింపుకి వొచ్చేసింది

యోగి ఆమెవంక నాగుపాములా చూశాడు బుసకొడుతూ, "శిష్యురాలిగా మంచిసలహాయే యిచ్చావు కానీ_" హేళనగా నవ్వాడు. అతని చేతిలోని పిస్టల్ స్ప్రింగ్ లా ఎగిరింది. అది యోగి చేతిలో- తోకమీదనిలుచున్న మిన్నాగులా ఉంది అది- మిల మిలమెరుస్తూ భయపెడుతోంది అది- సుషమవేపు గురిచేయబడి ఉంది.

పతంజలి నిర్ఘాంత పోయాడు.

సుషమ మాత్రం చెక్కుచెదరలేదు. పైగా చిరునవ్వు నవ్వుతూ "నన్నుతుపాకి గుండు ఏమీ చేయలేదు" అంది అతను ఆమెమాట వినిపించుకోకుండా పతంజలివేపు తిరిగాడు "చివరిసారిగా చెపుతున్నాను. గురూజీ! మీరు ఫార్ములా యివ్వకపోయారో నానాహింసలూ పడవలసి ఉంటుంది. నరకం అనుభవించ వలసి ఉంటుంది. గోళ్ళలోకి సూదులు గుచ్చుతారు.. కళ్ళలోనూ ముక్కుల్లోనూ యాసిడ్ లాటి ద్రవం పోస్తారు. ఆ మంట మానవమాత్రులు భరించలేరు. నిప్పులమీద నిలబెడతారు. దాహంతో చస్తున్నా మంచినీళ్ళివ్వరు. పైగా నీరు చూపుతూ

ఊరిస్తారు పోలీసులకి టార్చర్ సెక్షనని ఒకటుంటుంది. దానికి వెయ్యి రెట్లు భయంకరమైన శిక్షలకు మిమ్మల్ని గురిచేస్తారు చావనివ్వరు— బ్రతకనివ్వరు రహస్యం వెళ్లడిచేసేవరకూ ఎటువంటి దుర్భరమయిన చిత్రహింసలకు గురిచేస్తారో నేను చెప్పలేను. అటువంటి పరిస్థితిని రానివ్వకండి, మీరు బాగు పడండి. నన్నూ బాగుపడనివ్వండి".

పతంజలి కళ్ళల్లోంచి అగ్నికణాలే వెలువడ్డాయి. "నాకంఠంలో ప్రాణముండగా నేనా రహస్యం చెప్పను" అదే తన తుదినిర్ణయ మన్నట్లు చెప్పాడు పతంజలి.

చటుక్కున యోగి తనచేతిలోకి తాడు తీసుకున్నాడు. సుషమకి అతనేం చేయబోతున్నాడో సులభంగానే అర్థమైపోయింది. "యోగీ!" అంటూ అరచి అతనిమీదకు లంఘించింది. పులిపిల్లలా అతని పిస్టల్ని లాక్కునే ప్రయత్నం చేయబోయింది

అదే క్షణంలో

వెనుకనుంచి కుటీరపు ద్వారం వేపునుంచి –

"హాండ్సప్" అతను అమెరికన్ లా ఉన్నాడు.

యోగి అతనివేపు చూసి స్నేహ పూర్వకంగా నవ్వి – పతంజలిని బంధించే ప్రయత్నం మళ్లీ మొదలుపెట్టబోయాడు. అతను తన పిస్టల్ గురించి మరచిపోయాడు – ధీమాలో.

"నువ్వు... రష్యన్ స్పైవి కాదూ ?" అడిగాడు అమెరికన్ సుషమని చూస్తూ.

ఆమె ఏమీ చెప్పలేదు. కిటికీ అవతల కనిపిస్తున్న దృశ్యం ఆమెను చాలా కంగారు పెడుతూంది. ఐదారుగురు అమెరికన్లు... వాళ్లు వొచ్చేస్తే తనేమీ చెయ్యలేదు – పతంజలిని బందీగా వొదిలెయ్యడం తప్ప వొద్దు... అతను బందీఐ నరకం అనుభవించకూడదు. అతని పట్టుదల తనకి తెలుసు. ప్రాణం పోయినా ఆ రహస్యం అల్పులకి చెప్పడు. వాళ్లితన్ని ప్రాణం తియ్యకుండా హింసిస్తారు. అంతులేని హింస. యమయాతన దాన్నుంచి పతంజలి నెలా తప్పించడం ? ఇప్పటికే యోగికి మరొకడు తోడయ్యాడు. ఆలస్యం చేస్తే – వాళ్ళందరూ వొచ్చేస్తారు అప్పుడు పరిస్థితి మరీ చెయ్యిదాటి పోతుంది. కాని – తను పతంజలినెలా రక్షించగలదు ? ఎన్నాళ్ళు రక్షించగలదు? ప్రస్తుతం యిక్కడినుంచి తప్పించ గలిగితే మిగిలిన విషయాలు తరువాత ఆలోచించవచ్చు.

అమెరికన్ – యోగి వేపే చూస్తున్నాడు. అంతే ... మెరుపు వేగంతో అతన్ని షూట్ చేసింది సుషమ. అతను నిశ్శబ్దంగా కూలి పోతూంటే అతన్ని పట్టుకుని – కిందపడి శవం శబ్దం చేయకుండా ఆపి రెండవ గుండుతో యోగిని షూట్ చేసింది. పతంజలి – చూడలేనట్లు కళ్లుమూసుకున్నాడు

"గురూజీ ! త్వరగా పదండి మనం త్వరగా పరుగెత్తాలి. చాలా ప్రమాదంలో చిక్కుకున్నాం. ఎవరికీ కనిపించని...రహస్య త్రోవలగుండా ... ప్లీజ్ ...తొందరగా..." ఆయన కట్లు విప్పేసి కుటీరపు వెనుక ద్వారంనుంచి . . పతంజలి చెయ్యి పట్టుకుని పరుగెత్త సాగింది సుషమ.

దట్టమయిన అరణ్యంలోకి చేరుకోవాలని ఆమె ఆత్రత. "నా మందులు . ప్రయోగాలు . మృత్యుంజయ . ." అంటూనే ఉన్నాడు పతంజలి తోవపొడువునా. ఆమె అతన్ని వినిపించుకోకుండా లాక్కుపోతూనే ఉంది. అంతులేని ప్రయాణం. . అలుపులేని పరుగు. ప్రాణ భీతితో . . తప్పించుకుందామని . . రక్షించుకుందామని . .

సాయంత్రంవరకూ అడవిలోకి . . లోపలికి . . దట్టమయిన దుర్గమమయిన . . శత్రువులకు కనపడని . . అడవి కడుపులోకి . . ఒకటే నడక . . ఒకటే పరుగు.

అప్పుడాగారిద్దరూ. చిన్న కొండ కాలువదగ్గర దప్పిక తీర్చుకుని – కూర్చున్నారు. మెల్లగా అంది సుషమ.

"ప్రభూ !"

"చెప్పు. నాకేమీ అర్థం కావడంలేదు. ఏమిటీ పరుగు ? ఎక్కడికి ప్రస్థానం ? అమాయకంగా అడిగాడు.

"ఈ పరుగు ప్రాణరక్షణకి. ఈ ప్రస్థానం ప్రపంచంనుంచి."

"ఎందుకూ ?"

"మానవాళికి మహోపకారం చేయాలని – మీరు మృత్యుంజయని కనిపెట్టారు. అందుకు. ప్రభూ ! ఈ ప్రపంచం ఎంత కుత్సితమూ, కుటిలమూ, రాజకీయమయమూ ఐపోయిందంటే – మనిషి తన ఆధిక్యతను నిలుపుకుందుకూ, పెంచుకుందుకూ,చేసే ప్రయత్నాలకు ఉచ్చనీచాలుండవు. దేనికయినా పాల్పడతాడు. ఇది మీస్వచ్ఛమయిన హృదయం అర్థంచేసుకోలేదు నేనెంత వివరించినా. ఒకటి మాత్రం గ్రహించండి. మీకోసం కనీసం కొంతకాలం చాలా తీవ్రమయిన అన్వేషణ జరుగుతుంది. మిమ్మల్ని పట్టుకుని – మరెవరికీ దక్కకుండా స్వంతం చేసుకుని . మృత్యుంజయనింకెవరికి తెలియనీయకుండా తమ గుప్పెటలో ఉంచుకుని ప్రపంచాన్ని శాసించాలని ఎవరికి వారికే తాపత్రయం.

అందుకే మీకు చాలా విలువ. అందుకే మీకు చాలా ప్రమాదం.

అర్థమైనట్లు తల పంకించాడు పతంజలి. "సరే నన్ను నేను రక్షించుకుంటాను. నువ్వింక వెనక్కి వెళ్లు. నీకేమీ ప్రమాదం ఉండదుగా ప్రపంచం నుంచి ?"

ఒక్కసారి ఆమె అతని పాదాల మీద వాలిపోయింది. ప్రభూ! మీ ఆశ్రయం పొందేసరికి నేనూ గూఢచారిణినే. కె. జి. బి . అంటే రష్యా దేశపు గూఢచారిణిని మృత్యుంజయని మీ నుంచి సంగ్రహించాలనే మిమ్ము చేరాను. కాని .... మీ సాహచర్యంలో .. సేవలో ... నేను మారిపోయాను. నా హృదయం క్షాళనమైంది ఇన్నాళ్లుగా నిరంతరమూ మీ సన్నిధిలోనే గడుపుతూండడం వల్ల - మీతో ఎనలేని అనుబంధం పెరిగిపోయింది. దానిని ప్రేమ అనవచ్చు. స్వామీ! ఈ ప్రేమనీ మిమ్మల్నీ వొదులుకుని నేను ప్రపంచంలోకి వెళ్ళనూలేను. వెళ్లినా నా కిక్కడ నా దంటూ ఏమీ ఉండనూ ఉండదు మీరువినా నేను ఒంటరిని."

పతంజలి - పాదాలమీద మోకరిల్లిన సుషమని ఆశ్చర్యంగా చూశాడు. ఆమె మాటలతనిలో విచిత్రమయిన మార్పు తెస్తున్నాయి అతని కన్నుల ముందు గతమంతా మెదులుతూంది. సుషమకి తానాశ్రయమివ్వడం దగ్గరనుంచి - ఆమె తనదైనందిన జీవితంలో భాగం ఐపోవడమూ .. తన కార్య కలాపాలలో చేదోడు వాదోడుగా. ఉండడం . . చివరికి మృత్యుంజయ ప్రయోగానికి సంసిద్ధం కావడం.. ప్రాణాలకు తెగించడం . తనని రక్షించడం . . అన్నీ.

ఒక్కసారతనికి సుషమలో స్త్రీ కనిపించింది. దేవత కనిపించింది. జీవితానికర్థం కనిపించింది పరమార్థం కనిపించింది.

"సుషమా ?" ఆమెను లేవనెత్తి కౌగిలిలోకి తీసుకున్నాడు.

"ధన్యోస్మి" అందామె నవ్వుతూ, ఆనందం పట్టలేక "మీరూ మృత్యుంజయని సేవించండి ఇద్దరమూ చిరకాలమూ యీ అడవిలోనే దాగిపోదాం. బయటి కుటిల ప్రపంచంలోకి మనం వెళ్ళనేవొద్దు అమాయకమయిన యీ అరణ్యాలలోనే మనం హాయిగా జీవితం గడుపుదాం "

"అలాగే" అన్నాడతను అంగీకారంగా.

ఆమె అతని చేయందుకుని ముందుకి నడిపిస్తూంది. అడవి ఆనందంతో ధ్వనులు చేస్తూంది. పిట్టల అరుపులు . . జంతువుల కూతలు, . గాలుల యీలలు . . జలపాతాల హోరులు . . అన్నీ కలసిన మహోత్సాహమయిన శబ్దాలు. అడవి ఆహ్వానాన్నందుకుంటూ వారు ముందుకి వెళ్తున్నారు. ఇంకెప్పుడూ యీ ప్రపంచంలోకి రారు. అడవిలోనే కలసిపోతారు.

( అయిపోయింది )

---

# చివరి మజిలీ

## శ్రీ కొడవంటి లీలా మోహనరావు

రాత్రి కురిసిన మంచుకి
సమాధి రాళ్ళు మంచు గడ్డలైనాయి.
సగం కూలిన గోడ ప్రక్క మర్రి చెట్టు
చీకటిని విదిలించ లేదు.
కోమా నుండి బయటు పడలేదు.
దారి ప్రక్కన కరంటు స్తంభాలు
వైతరణిని తలపింప జేస్తూ
ప్రవాహా సంగీతం.
దూరంగా గొర్రెల మంద వద్ద
చలి మంట వేసి కూర్చున్న కుర్రాళ్లు.
ఆశగా అటు వెళ్ళబోయే నాకు
ఎవరో గమనిస్తున్నట్టు భ్రమ.
వెనక్కి చూశాను.
ఎండుటాకుల మధ్య తొంగి చూస్తూ
గడ్డిపువ్వు వెక్కిరింతగా నవ్వింది.

---

శ్రీ కొల్లూరు సూర్యనారాయణ

# మధ్యాంధ్రయుగంలో బ్రాహ్మణుడు

తెలుగునాటి మధ్యయుగ చరిత్ర తెలుగువారి సాంఘిక జీవన వివరాల్ని కూలంకషంగా పరిశీలించటానికి ఒక అత్యుత్తమ వేదిక. సమకాలీన పరిసర ప్రాంతాల్లోని సాంఘికఉద్యమాల ప్రభావం, మత పరిస్థితులు, రాజకీయ కల్లోలాలు- వీటన్నింటినీ చాలవరకు చాటిచెప్పే అసంఖ్యాక శాసనాలు, సాహిత్యం మనకి లభ్యంకావటంతో ప్రాచీన యుగం కన్నా మధ్యాంధ్రయుగ సాంఘిక చరిత్ర యధాతథా తెలుసుకొందికి సాధ్యమౌతోంది. అనాదిగా హిందూమతంలో వస్తున్న చాతుర్వర్ణ విభాగానికి యీ కాలంలో మరిన్ని మార్పులేర్పడి అనేక శాఖోపశాఖలు రూపుదాల్చటం, ప్రతీవర్ణం తమ ఆధిక్యతను ప్రత్యేకతను చాటుకునే ప్రయత్నంలో పోటీపడటం, దిగువవర్ణాల ఆలోచనాసరళిలో గణనీయమైన మార్పురావటం, వైశ్య, బలంజ, విశ్వకర్మ, తెలికి వంటి కులాలు తమ సాంఘిక కట్టుబాట్లను సామాజిక నియమాలను తామే మలచుకొందికి ఆయత్తం కావటం- యీ యుగంలోని కొన్ని విశేషాలు అయితే ఆనాడు ప్రవర్థిల్లిన ఆర్థికపరిస్థితులు యీరకమైన కట్టుబాట్లను ఏస్థాయివరకు ఆమోదించి, నిలిపినవనునది అనుమానాస్పదమైన విషయమే. అదే విధంగా ఒక వర్ణంలో పుట్టినవ్యక్తి దానికి నిర్థారింపబడి అనుగతంగా వస్తున్న వృత్తినే విధిగా స్వీకరించి తీరాలో, స్వేచ్ఛగా యితర వృత్తులను చేపట్టవచ్చునో అనేదికూడ సుస్పష్టంకాదు. శాసనాలలో, సాహిత్యంలో అక్కడక్కడ కొన్ని ప్రత్యేక తరహా ఉదాహరణలు ద్యోతక మౌతున్నా ఆ కొద్దిపాటి ఉదాహరణలను నాటి సామాజిక జీవన విధానానికి దర్పణాలని రూఢిగా చెప్పలేము. జైన, శైవ, వైష్ణవాలు తమ శక్తిమేరకు సాంఘిక వ్యవస్థలోని అంతరాలను తగ్గించుటకు కృషిసల్పినప్పటికీ యుగాల తరబడి పాతుపడిన వర్ణవ్యవస్థను నిరోధించుటకు అవి చేసిన కృషి పరిమిత మగుట మాత్రమేకాక, యీ వ్యవస్థ ప్రభావమే ఆ మతములపై పడుట జరిగినది. గతంలో ఒక వ్యాసంలో వైశ్యుల సాంఘిక చరిత్రనుగూర్చి పేర్కొనటం జరిగింది.[1] యీ వ్యాసంలో మధ్యాంధ్రయుగంలోని బ్రాహ్మణ వ్యవస్థలోని కొన్ని అంశాలు పరిశీలించటం జరుగుతుంది.

సనాతన మతంలోని ధర్మశాస్త్రాలు పెద్ద పీటవేసిన కారణంగా వైతేనేం, సమకాలీన సమాజం యింకా త్రోసిరాజనక పోవటంవలన నైతేనేం, వేదవేదాంగ విజ్ఞాన సముపార్జితులైన కారణంగా నైతేనేం, మధ్యాంధ్రయుగంలో బ్రాహ్మణులు అగ్రస్థానంలోనే గుర్తింపబడి గౌరవింపబడేవారు నాటికింకా సమాజాన్ని ఆకట్టుకొన్న వైదిక క్రియాకలాపమేదీ వారిఅదుపాజ్ఞలను దాటిపోలేదు. వేదశాస్త్రాది విద్యలన్నింటికీ కూడ వారిదే సంరక్షణ బాధ్యత. అయితే పుట్టుకతో వారికి సంక్రమించిన వర్ణంకన్నా వీరు సముపార్జించుకున్న జ్ఞానం వలన మాత్రమే సమాజంలో వీరిస్థానం గుర్తింపబడే దనేది నిస్సందేహమైన విషయం. చారిత్రకాధారాల్లో విరివిగా వీరిపాండిత్య ప్రకర్షను గూర్చి ప్రస్తావన లున్నాయి. ఆనాటి సమాజంలో అధికంగా విద్యనభ్యసించేది వీరు మాత్రమే అగుట కూడ వీరి ప్రత్యేక గౌరవస్థానమునకు కారణము కావచ్చును. అధ్యయన,అధ్యాపనలే వీరి ప్రముఖ బాధ్యతలనవచ్చును. సకల వేదవేదాంగముల సారమును గ్రహించుటయందే వీరిలోని చాల మందికాలము గడచెడిది. కొందరుమాత్రము రాజకీయ వృత్తులందుచేరి మంత్రులుగా, దండనాయకులుగా పరిపాలనాబాధ్యతలందు తమవంతు విధిని నిర్వహించెడివారు. ఈ కాలంలో రాజవంశీయులకు బాసటయై నిలిచి గణుతికెక్కిన మంత్రులు, దండనాయకులు హెచ్చుమంది బ్రాహ్మణులే. ఈ సంఖ్యనుబట్టి వీరియెడ అపాత్రప్రోత్సాహము లభించిన దనుటకు వీలులేదు. పండరంగునివంటి దళవాయి నెదుర్కొనగల్గిన యోధుడు నాటి దక్షిణభారతంలో లేకపోయాడంటే ఆ రంగంలో వీరు సల్పుతున్న కృషి, పరిశ్రమ ద్యోతకమౌతాయి. రాజ్యరక్షణవంటి కీలకవిషయములందే కాక అతి సామాన్యము మతసంబంధము అయిన కృత్యములందుకూడ వీరికి పూర్తిప్రమేయముండెడిది. సమాజములోని అన్నివర్గాలతోను వీరికి సన్నిహిత సంబంధాలుండేవి కేతనకృతమైన "విజ్ఞానేశ్వరీయము " వంటి గ్రంథములు బ్రాహ్మణులకు కొన్నినిత్యజీవన వ్యవహారములందు కల్పింపబడిన మినహాయింపులను పేర్కొనినను,[2] అవి ఎంతవరకు నిజజీవితములలో పాటింపబడెడివో చెప్పలేము.

బ్రాహ్మణ మత మనదగు హిందూమతమున బ్రాహ్మణుని స్థానము అత్యున్నతము. కాని యీకాలమునను, యింతకు కొద్దిముందు

నుండియు అవైదికములైన జైనమతము వంటివి విజృంభించి తమ దాడులను హిందూమతముపై కేంద్రీకరించుటచే బ్రాహ్మణుల పూర్వపు టౌన్నత్యమునకు ముప్పువాటిల్లినది. ముప్పువాటిల్లుటయే కాదు, మారు చున్న పరిస్థితుల కనుగుణముగా వాటిపై తమ కేర్పడిన అవ్యాజ విశ్వాసములు కారణముగా కొందరుబ్రాహ్మణులు వైదికమును విడిచి పెట్టి ఆయామతానుయాయులగుట కూడ సంభవించినది. దీనికుదా హరణగా తెలుగు వాడై కన్నడనాట కావ్య సృష్టికి కారణమైన పంప మహాకవి యొక్కతండ్రియైన భీమనను పేర్కొనవచ్చు. ఆయన పూర్వీకులైన వారందరు వేదవేదాంగకోవిదులైన సోమయాజులు: పూర్తి వైదికనిష్ఠాగరిష్టులు. భీమన తమ అనువంశీకమైన వైదికమును విడిచిపెట్టి తనస్వీయ విశ్వాసము కారణముగా జైనమువలంబించుట జరిగినది.[3] కాని తొలిదశలలో యిటువంటి మతవిశ్వాసముల మార్పి డులు వారి వారి వర్ణపు విషయమున నెట్టిమార్పును గొనివచ్చినట్లు తోచదు. పంపనిసోదరుడైన జినవల్లభుడు తన గంగాధర శాసనమున నొకవంక తన జైన విశ్వాసమును చాటుకొనుచు మరియొకవంక తాను బ్రాహ్మణుడనని ప్రకటించెను.[4]

"జినభవనంబు లెత్తించుట జినపూజల్సేయుచున్కి జినమునులకు నత్తిన యన్నదానం బీవుట జినవల్లభు బోలంగలరె జినధర్మపరుల్"

అని ఘనముగా చెప్పుకొన్న యీ జైనుడు తాను (హిందూమతపు చాతుర్వర్ణవిభాగమైన)బ్రాహ్మణుడనని పేర్కొనుట ఆశ్చర్యముగొల్పక మానదు అట్లే పొన్నకవిని చేరదీసి ఆదరించిన మల్లప, పున్నమల తండ్రియైన నాగమయ్య కూడ జైన బ్రాహ్మణుడని పేర్కొనబడ్డాడు.[5] దీనిని బట్టి నాటికొన్ని అవైదిక మతములు తమ అనుయాయులను వారి వారి పూర్వాశ్రమవర్ణములను విస్మరింపజేయజాలుస్థితిలో, అట్లు చెప్పుకొనుటను అరికట్టలేని స్థితిలో నున్నవని తేటతెల్లమగుచున్నది.

ఈకాలమున బ్రాహ్మణుల వేదాధ్యయనమును గూర్చి పరిశీలిస్తే అసంఖ్యాకమైన గ్రామశాసనాలలో మనకు ప్రస్తావనకువచ్చే వేదవిదు లలో హెచ్చుశాతం యజుర్వేదీకులు. ఋగ్వేద, సామవేదీకులు లేకపోలేదు కాని వారి సంఖ్య యజుర్వేదీకులతో పోల్చి చూచిన స్వల్పము.శ్రీ మల్లం పల్లి సోమశేఖరశర్మగారు పేర్కొనినట్లు యీ కాలమునకు అధర్వణ వేదము నవలంబించి అభ్యసించినవారు అంతగా కన్పించరు [6] కాని ఎదరు పల్లి పునర్దత్త గ్రామశాసనము[7] దెందులూరిలోని మరియొక శాసనము[8] వంటి వానిలో బ్రాహ్మణులు 'చతుర్వేదు'లుగా పేర్కొనబడుటనుబట్టి, అధర్వణమున కూడ స్వల్పసంఖ్యలోని వారికైనను ప్రవేశమున్నట్లు భావింపబడుచున్నది,

ఈ కాలమునకు చెందిన గ్రామ శాసనములలో ప్రముఖముగా ప్రస్తావనకు వచ్చు బ్రాహ్మణ గోత్రములు దిగువ పేర్కొనుచున్నాము.

| | | |
|---|---|---|
| ఆత్రేయ | కౌండిన్య | శౌనక |
| భారద్వాజ | కౌశిక | శ్రీవత్స |
| భార్గవ | లోహిత | శంగభారద్వాజ |
| దేవరత | మైత్రేయ | వధూల |
| గార్గ్య | మైత్రవరుణ | వశిష్ఠ |
| గౌతమ | మౌనభార్గవ | విష్ణువర్ధన |
| హరిత | పరాశర | విశ్వామిత్ర |
| కామకాయన | పురుకుత్స | యశ్క |
| కణ్వ | రతీతర | మౌద్గల్య |
| కపి | శాలంకాయన | కుత్సిత |
| కాశ్యప | శాండిల్య | శత |

ఈ గోత్ర విభాగమే కాక ఋషి, శాఖమున్నగు వానిపై నేర్పడిన విభాగములు బ్రాహ్మణవర్ణము కలిగియుండెడిది.

మధ్యాంధ్రయుగము అసంఖ్యాకమైన వలసల కాలవాలమైన దగుటచే ప్రాంతీయ విభాగములపై ఏర్పడిన వేర్పాటుకూడ యీకాలము నందే బ్రాహ్మణులలో నేర్పడినది. ఏ ప్రదేశము స్వస్థానముగా చేసికొని ఆయా బ్రాహ్మణకుటుంబములుండెడివో ఆ ప్రాంతీయ విభాగమే ఆధార ముగా వారు గుర్తింపబడెడివారు వేంగినాటి, వెలనాటి కమ్మనాటి, పాకనాటి, బ్రాహ్మణులవంటివారి నిందులకుదాహరణగా పేర్కొన వచ్చు. మత, రాజకీయ విషయములలో నేర్పడిన అసంతృప్తియో: ఈతిబాధలు సంభవించుటయో, నూతనప్రాంతమునకు వీరి నాకట్టుకొను రాజాదరణవంటి ఆకర్షణలో, యీ కాలమున వీరి యుద్ధృతమైన వలస లకు కారణము కాదగును. ఈ వలసలు హెచ్చు సంఖ్యలో జరిగిన సందర్భమున వీరికందరకు పాలకులే గృహవసతి కల్పించుట కూడ కలదు. క్రీ॥శ॥ తొమ్మిదవశతాబ్దపు శాసనమొకటి ఘంటశాలప్రాంత మున రెండువేల బ్రాహ్మణకుటుంబములకు నివేశనస్థలము లీయబడిన విషయము పేర్కొనుచున్నది.[9] భుజబల సిద్ధుడనబడు రాచమల్లదేవుడు వలసవచ్చిన అనేక బ్రాహ్మణకుటుంబముల కాశ్రయమిచ్చుటకు పాక నాటిలోని నాగపడేలు ప్రాంతమున "రాచమల్లచతుర్వేదిమంగళము" నిర్మించినట్లు మరియొకశాసనము పేర్కొనుచున్నది. [10] మొదటి కులో త్తుంగుని పుత్రుడైన వీరచోడుని కాలమున ద్రవిడ దేశమునుండి హెచ్చు స్థాయిలో బ్రాహ్మణులు వచ్చి గోదావరీతీరప్రాంతములలో నివాసము లేర్పరుచుకొనుట కూడ క్రొత్త విషయముకాదు.[11] ఇంతటి

వలస లేర్పడిన సందర్భముననే వారి పూర్వపు 'నాడు', 'విషయముల' ప్రాతిపదికిపై నేర్పరచిన విభాగములేర్పడి యుండవచ్చును.

ఇక గృహనామముల విషయము ఈ కాలపు తొలి దశలో అనగా సుమారు పదవశతాబ్ది వరకు బ్రాహ్మణులు స్వీయనామములకు ముందు గృహనామము ఉంచుకొనుట కన్పించదు. దీనినిబట్టి నాటికి గృహనామములు లేవని చెప్పుట కన్న నాటి బ్రాహ్మణ సంఘమున వీటికంత ప్రాముఖ్యత లేదని భావించుట మేలు. పదమూడవ శతాబ్ది వరకును తామ్రశాసనములలో బ్రాహ్మణుల నామములకు తోడుగా గోత్ర వేదములు మాత్రమే చెప్పబడెడివి. ప్రప్రథమముగా క్రీ శ.1252 నాటిదైన ఒక శ్రీ కూర్మశాసనమున గృహనామములతో కూడి కొందరు వైష్ణవ బ్రాహ్మణుల పేర్లు చెప్పబడ్డాయి [12](ఉదా॥ కటి కూర్మనాథశర్మ, ముద్ర కూర్మనాథశర్మ, జంప మంచెనశర్మ మున్నగునవి). శాసనాధారములలో యిదే ప్రథమోదాహరణమైనప్పటికీ తెలుగునాట నాటికి ముందు నుండియే అనగా సుమారు పదకొండవ శతాబ్దినాటినుండియే (పొవులూరి, మల్లన, కొట్టరువు కొమ్మన మున్నగువారినిబట్టి) గృహనామములు వాడుకలో నున్నట్లు తెలియుచున్నది.

స్వామి, సోమయాజి, ఆర్య, శర్మ, దీక్షిత, షడంగ, భట్ట ద్వివేది, త్రివేది, చతుర్వేది, పండిత, ఆచార్య, ఘటశాసి, భట్టోపాధ్యాయ, యజ్వ - మున్నగునవి సాధారణముగా బ్రాహ్మణుల పేర్ల చివర వాడబడేవి

జన్మతః వీరికి సంక్రమించినదనుకొంటున్న ఔన్నత్యం వలన కంటె వీరవలంబించిన గౌరవప్రదమైన వృత్తివలనమాత్రమే సమాజంలో యీ బ్రాహ్మణుల స్థానం గుర్తింపబడేదన్న విషయం సుస్పష్టం. వేద వేదాంగ పారగులు, తర్క న్యాయ మీమాంసవ్యాకరణ జ్యోతిష గణితాది బహుశాస్త్ర నిష్ణాతుల ప్రసక్తి మాత్రమే శాసనాలలో హెచ్చుగా కన్పిస్తుంది వీరు వైదిక వాఙ్మయాన్ని వృద్ధిపరుస్తూ, ఆ క్రియాకలాపాలలో మునిగితేలుతూ, తమ బ్రహ్మదేయాల్ని అనుభవిస్తూ తమ తమ అగ్రహారాల్లో ప్రశాంత జీవనం సాగిస్తూ వుండివుండవచ్చు. అస్థిరరాజకీయ వాతావరణమునకాలవాలమైన మధ్య యుగాలలోని తెలుగునాడు వారినెంతవరకు ప్రశాంతముగా గడపనిచ్చినదో చెప్పుట కష్టము. కాని పన్నులకు సంబంధించినంతవరకు పరిమిత సందర్భములలో తప్ప అగ్రహారము లన్నియు "సర్వకరపరిహారువు" లే. అయితే యిది సర్వసాధారణమైన సంప్రదాయము మాత్రము కాదు. క్రీ. శ పదవశతాబ్దివాడైన సోమదేవసూరి తన "నీతి వాక్యామృత" మను గ్రంథము పాలకుల కత్యవసరమైన సందర్భములలో బ్రాహ్మణుల నిత్యనైమిత్తికాదుల కవసరమగునది మినహాయించి మిగిలినది రాజ్యావసరమునకై గ్రైకొనవచ్చునని పేర్కొనుచున్నది.[13] సోమదేవసూరిని ఆదరించిన వేములవాడ చాళుక్యప్రభువులు కొన్ని సందర్భములలో దేవాదాయములపై కూడ పన్ను విధించుటను జేసి "నీతివాక్యామృత" మందలి విషయములలో కొన్నినాడు ఆచరణలో నున్నవే అని గ్రహింపవలసి వచ్చుచున్నది. సాధారణ పరిస్థితులందు మాత్రము బ్రాహ్మణాగ్రహారములపై పన్నులు విధింపబడెడివి కావు వైదిక వృత్తులు కాక వ్యాపార వ్యవహారాది యితరవృత్తులవలంబించిన బ్రాహ్మణులపై పన్నులు విధింపబడెడివి [14] దీనినిబట్టి నిస్సందేహముగా సమాజమున గౌరవింపబడెడిది 'జన్మ' చే బ్రాహ్మణుడగుట కాదనియు 'వృత్తి' చే బ్రాహ్మణుడగుట అనియు రూఢిగా చెప్పవచ్చు

తమకు సమర్పింపబడిన యీ అగ్రహారములపై తమచెల్లుబడిని బుజువు పరచుకొనుటకు యీ బ్రాహ్మణులు అప్పుడప్పుడు తమది 'శాసనద అగ్రహార' మని ప్రకటించుకొనుట కలదు అనగా తమకు ఆ అగ్రహారము దత్తపరుపబడిన అంశమును ప్రకటించు తామ్రశాసనమో, తత్తుల్యమో కలదనుట అట్లు చెప్పుకొనవలసి వచ్చుటకు బహుశః క్రమక్రమముగా మారుచున్న నాటి రాజకీయ రంగమే కారణము కాదగును వేములవాడ చాళుక్యులలో గణుతికెక్కిన రెండవ అరికేసరి తమ ఆస్థాన కవియు, కన్నడ కవిత్రయము నందలి తొలివాడును అగు పంపమహాకవికి ధర్మపురమును సర్వాగ్రహారముగా నొసగెను అది శాసనద అగ్రహారమే కాని ఏ సందర్భముననో ఎవరికో యీ విషయమై సందేహము లేర్పడినట్లున్నవి పదే పదే పశ్నించి విసిగించియుందురు కనుకనే పంపని సోదరుడైన జినవల్లభుడు తీవ్రముగా అలాంటి సంశయాల్ని ఖండిస్తూ ఆ శాసనం కావలిస్తే పోయి వృషభాచల శిఖరం మీద కన్పిస్తుంది చూచుకోమని చెప్తూ "బరదుదె తాంబ్రశాసన మదేయమె ధమ్మ్మ పురంనెగత్తె వెత్తరిగన కొట్టుదేనెగట్టి పంపన పెత్తు దెపేజి మెన్ను నిమ్మరుశెపలమ్మొ యుంపల బరంబెను గొళ్ళదె పొగిన్ద సున్దర వృషభాచళోన్నత శిళాతళ దొళ్బరెదక్కరంగళం" అని పేర్కొనవలసివచ్చింది [15] అగ్రహారాన్ని దత్తపరచిన వివరాలు శాసనస్థంగా వుండటం అవసరమనే మాటకి యీజినవల్లభుడి శాసనమే ఒక ఉదాహరణ.

అనువంశికంగా వస్తున్న దానాల్ని పునరుద్ధరించటం, పునర్దత్త శాసనాల్ని జారీచేయటం ఈ కాలంలో కన్పించే మరోముఖ్యవిశేషం. రాజరికాల్లో సంభవించిన మార్పుల కారణంగా యిది అవసరమౌతుంటుంది. ఎప్పుడు ఎవరు దానమొసగినప్పటికి, లిఖిత శాసనకాలగతిలో శిలమై పోయినప్పటికి, పురాతనంనుండి ఒకరి హక్కుభుక్తులలో నున్న అగ్రహారాన్ని వారి వారసుల కోర్కెనుమన్నించి ఆ హక్కును పునరుద్ధరిస్తున్నట్లు మరొక శాసనాన్ని జారీచేయటం సాధారణంగా

కన్పిస్తుంది అయితే ఆశ్చర్యకరమైన అంశమేమంటే ఐతిహ్యంలోనే తప్ప చరిత్రలో కన్పించని పాలకు లొసగునట్టు చెప్పుకొన్న దానాల్ని కూడ నూతన పాలకులు ఆమోదించి పునర్దత్తపరచటం! ఈ సందర్భములో ప్రముఖంగా స్ఫురణకు వచ్చేది ముక్కంటికాడ్వెట్టి.[16] ఈతడెప్పుడు ఎక్కడ పరిపాలించాడో చరిత్రకు తెలియదుగాని మధ్యాంధ్ర యుగపు పునర్దత్తశాసనాలు చాలవరకు ఆ మహనీయుడు పూర్వమొసంగినట్లు చెప్పుకొని తిరిగి పొందినవే. పూర్వపు రాజులొసగిన దానముల పట్లనున్న గౌరవము' వాటిని కొనసాగించుకొనుచున్న బ్రాహ్మణుల మాటపై నున్న ఆదరము మాత్రమే యీ పునర్దత్త శాసనము లొసగబడుటకు కారణాలు

అయితే పూర్వపు ప్రభువులచే నొసగబడి ఆ బ్రాహ్మణుల వారసులచే అనుభవింప బడుచున్న అగ్రహారములకై పునర్దత్త శాసనములు తిరిగి నాటి ప్రభువులచే జారీచేయించుకొనుట అవసరమా అనునది ముఖ్యమయిన ప్రశ్న కాలగతిలో శిలమై మూలశాసనము నశించుటయు, మారుచున్న రాజకీయ రంగములో ఆ అగ్రహారముపై తమ చెల్లుబడిని నూతన ప్రభువులకు నివేదించుకొను సందర్భమున బ్రాహ్మణులు పునర్దత్త శాసనములు కోరుచుండవచ్చు తరతరముల నుండి అగ్రహారములనుభవించుచున్న బ్రాహ్మణ కుటుంబములు అప్పటప్పటనైన తమ వారసత్వమును ఋజువు చేసుకొనవలసిన పరిస్థితులేర్పడుచుండెడివనుటకు ఆధారమున్నది వీరట్లు ఋజువు పరచుకోని యెడల దీనిని కూడ యితర గ్రామములతోపాటు 'కర' గ్రామముగా పరిగణించి పన్నులు విధించుటయో, కాక దేవ, బ్రాహ్మణ గ్రామములను (అవి ఎవరిచే ఒసగబడినవైనను) తిరిగి గ్రహించుటకు మనస్సంగీకరింపని సందర్భములలో వానిని తత్తుల్య కార్యములకు వినియోగించుటకో సావకాశము కలదు ఇట్లు భావించుకొనుట నిరాధారమగు ఊహకాదని చెప్పుటకు పిఠాపురం దగ్గిరనున్న 'నవఖండవాడ' దానవిషయమును పేర్కొనవచ్చును రాజరాజనరేంద్రుడు తన ఆస్థాన గణిత శాస్త్రజ్ఞుడైన పావులూరి మల్లనకు తొలుత దీనిని దానమొసగెను [17] కొన్నితరములవరకు ఆ గ్రామము వారి వంశీయుల హక్కు భుక్తములందున్నది. కాని తరువాత ఏమి జరిగినదో కాని వెలనాటి పృథ్వీశ్వరుని భార్యయైన జయాంబిక అదే 'నవఖండవాడ'ను పిఠాపురపు కుంతీమాధవ స్వామికి సమర్పించుట సంభవించినది.[18] నాటికి సుమారు రెండుశతాబ్దాల క్రిందట రాజరాజుచే మల్లన పండితునకొసగబడిన గ్రామము తిరిగి జయాంబికచే కుంతీమాధవస్వామికెట్లు సమర్పింప బడెననునది ఆసక్తికరమైన అంశము ఆ అగ్రహారము ననుభవించుటకు పావులూరి మల్లనకు చట్టపరమైన వారసులు లేకపోవుట వలనను, ఒకపరి బ్రాహ్మణుల కొసగినది తిరిగి రాజ్యమున కలుపుకొనుటకు వెలనాటివారి కంగీకారము కాకపోవుటవలనను, యిది యిట్లు జరుగుట కవకాశమున్నది.

తమకొసగబడిన అగ్రహారాల్ని అనుభవిస్తూ వేదవాఙ్మయాన్ని యథాశక్తి వ్యాప్తిచేస్తూ కొన్ని బ్రాహ్మణ కుటుంబాలు నివసిస్తూవుంటే. మరికొందరు మాత్రం యీ పంకకురాక రాజకీయవ్యవహారాలలో తలలు దూర్చి వేరువేరు పరిపాలనా బాధ్యతలను వహించటానికి నడుం కట్టారు. ఈ యిరువర్గాలు చేపట్టిన వృత్తులమధ్యనున్న యీ విరుద్ధ ప్రకృతే వీరిరువురి మధ్య తీవ్రమైన విభేదాన్ని తీసుకొనివచ్చింది. శ్రీ సోమశేఖరశర్మగారు గుర్తించినట్లు లౌకికమైన రాజరికంలో తల దూర్చటంలో యీ బ్రాహ్మణులలో నియోగ వృత్తినవలంబించిన వారి ప్రస్తావన క్రీ. శ ఏడవశతాబ్దినాటి నుండి ఉన్నప్పటికి వారు ఒక విభాగంగా ఏర్పడటం మాత్రం క్రీ. శ 11, 12 శతాబ్దులలోనే జరిగింది [19] ఈ రెండు భాగముల మధ్యనున్న భిన్నమైన వృత్తిధర్మమే ఆనాడు బ్రాహ్మణ వర్ణాన్ని నిలువునా ఎడబరచి వైదికవృత్తినవలంబించెడివారిని వైదికులుగను, లౌకికవృత్తి చేపట్టినవారు నియోగులుగను గుర్తింపబడ్డారు వీరు కాక శాసనాలలో అక్కడక్కడ బ్రహ్మక్షత్రియకులపు ప్రస్తావనకూడ వుంది.[20] కాకతీయ వంశీయుల కాలానికి, బ్రాహ్మణులు ముఖ్యంగా నియోగి తెగకు చెందినవారు (ఇందులూరివారు) ఏ రాజకీయాలు కారణమైతేనేం, ఒక అడుగు ముందునకు పోయి శూద్రుల్ని (కాకతీయుల్ని) పరిణయమాడటానికి కూడ వెనుతీయకపోవటాన్ని బట్టి వృత్తి బాధ్యతల ముందువర్ణం పరిగణింపబడలేదని తెలుస్తోంది

ఇంకా అనేకమైన యితర వృత్తులలో చొరవగా చొచ్చుకొనిపోయిన బ్రాహ్మణ కుటుంబాల వివరాలు మధ్యాంధ్ర యుగపు శాసనాలలో కోకొల్లలు క్రీ శ.1402 నాటి శ్రీకూర్మ శాసనమొకదానిలో కళింగ ప్రాంతమున వ్యాపారము చేయుచున్న బ్రాహ్మణ కుటుంబం ప్రస్తావింపబడింది [21] ఇతరవృత్తులను గూర్చి ముఖ్యముగా దేవాలయములలో వేర్వేరు వృత్తులను చేపట్టిన అనేక బ్రాహ్మణులను గూర్చి వేరే చెప్పవలసినది లేదు. మొత్తంమీద పరిశీలిస్తే వైదికసమాజంమీద యితర అవైదిక మతాలు తీవ్రప్రభావం చూపిన సందర్భాలలో తప్ప సాధారణంగా స్వధర్మానుష్ఠాయులైన బ్రాహ్మణులు సమకాలీన సభ్యసమాజంచేత గౌరవాభిమానాలతో సంభావింపబడినట్లు తెలుస్తుంది. తులసివనమున గంజాయిమొక్క పోలికలో ఎక్కడో పతితులై భ్రష్టతనందిన బ్రాహ్మణ బ్రువులు కూడ లేకపోలేదు. కాని వారి సంఖ్య పరిగణింప వలసినంతటిది కాదు.

**అధోజ్ఞాపికలు :**

1. గతసంవత్సరపు ఫిబ్రవరిలో బెంగుళూరు 'జ్ఞానభారతిలో' ఐసి హెచ్ ఆర్ ఏర్పాటు చేసిన "సోషియో కల్చరల్ కండిషన్స్ యిన్ సౌతిండియా" సెమినారులో నేను సమర్పించిన వ్యాసము.
2. విజ్ఞానేశ్వరీయమ్. ప. 58.
3. ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, కరీంనగర్ జిల్లా. నెం॥ 3.
4. పైవలె.
5. దక్షిణభారత సాహిత్యములు, పే. 66
6. హిస్టరీ ఆఫ్‌ది రెడ్డి కింగ్డమ్స్. పే, 257
7. భారతి, జనవరి, 1968. పే. 3.
8. యస్.ఐ.ఐ. సంపుటి 7 నెం॥ 787.
9. ,, ,, 10 నెం॥ 19
10. ఆంధ్రులచరిత్ర, పార్టు 2, పే. నెం. 113.
11. ఇ.ఐ. సంపుటి 5 పే 70.
12. యస్.ఐ.ఐ. సంపుటి 5 నెం॥ 1231.
13 నీతివాక్యామృతమ్ 21 శ్లో॥14
14. రాష్ట్రకూటాస్" అండ్ దైర్ టైమ్స్, పే॥ 327.
15. మూడువలె.
16. ఏ, ఆర్. ఇ నెం॥ 4 ఆఫ్ 1916-17: నెం॥ 779; 808 ఆఫ్ 1912
17. ఏ, యస్. పి. పి సంపుటి. 52-53, పే. 63.
18. ఇ ఐ. సంపుటి 4 పే 32
19. హిస్టరీ ఆఫ్ ది రెడ్డి కింగ్డమ్స్. పే. 263
20 యస్. ఐ.ఐ. సంపుటి 6 నెం 127, 156' 1109.
21. ,, ,, 5 నెం॥ 1180

# అంతర్లీనం

నింగి కెగసిన నేను
నీకై వెతికాను
చంద్ర కాంతిలో
మబ్బుల్ని చీల్చుకుంటూ
అలలై దుమికే ఆలోచనల్ని
అదిమి పట్టి
నక్షత్రాల కూటమితో
సాయం మంతనాలాడ్తూ
నిశి రాత్రులలో
వెన్నెల దీపాల్ని వెలిగించుకుని
గగనమంతా శోధించాను.

అనుభూతుల మైకంతో
కనురెప్పలు బరువై
అలసటగా వాలాను.
నీ ఆలోచనలు
నాలో ప్రతిఫలిస్తున్నాయని
నా హృదయ ఫలకం
నీ ప్రతిబింబమని
నీ రూపం
నాలో అంతర్లీనమైయున్నదని
గ్రహించిన తరుణాన
ఈ వెదకులాట ముగుసునేమో.

శ్రీ యస్. ఏ. యస్. కిశోర్ కుమార్

శ్రీ వంతరాం రామకృష్ణారావు

# పాండురంగ మాహాత్మ్యము గ్రంథ గ్రంథులు

పాండురంగమాహాత్మ్యము కీ.శే. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు చెప్పినట్లు "అంతంతమాత్రపు చదువరులకు సరిగా అర్థముకాని గొట్టు కావ్యము. పండితులనుగూడా పట్టిచూచు ఘట్టములు అందులో అనేక మున్నవి రెండుటీకలున్నవి గాని, ఆ రెండును అసమగ్రములే. అవి కావ్యార్థ, భావ, జిజ్ఞాసువులకంతగా నుపకరించుటలేదు." స్పష్టముగా చిన్నగా టీకను వ్రాయవలె" నన్నుకోరిక కీ. శే రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారికి ఉండెడిది. కాని "పారములందలి తెగని సందేహము" వల్ల ముఖ్యముగా వారి సంకల్పము కార్యరూపముదాల్చలేదు. ఈ ప్రౌఢకావ్యమునకు వ్యాఖ్యానము వ్రాయవలెనన్న అభిలాష 1966 నా కలిగినది. కాని వ్యాకరణ వ్యాసంగము మూలమున ఈపని వెనుక పడినది తుదకు 1982లో సంజీవనీ వ్యాఖ్యాన రచన పూర్తి అయినది. ముద్రణ ప్రయత్నము ముందుకు సాగలేదు. "నందోరాజా భవిష్యతి" అని కలదు గదా! ఈ వ్యాసములో కొన్ని గ్రంథగ్రంథులకు చేసిన అర్థ నిర్ణయమును మచ్చుచూపుచున్నాను.

## 1 మరన

"శతమరన గోత్ర మంత్రి రక్షణమొనర్చు" (1-81)

ఇక్కడ "మరన" అన్నదే ఉపలబ్ధపాఠము. "మథన" అని రాళ్ళపల్లివారు ప్రశ్న చిహ్నముంచినారు. "మరమర్దనే" (శబ్దస్తో) అన్న ధాతువు కలదు. దీనిపై "ల్యుట్" ప్రత్యయము చేరగా "మరన శబ్దము సిద్ధించును. మరనము=మర్దనము–అని అర్థము. శరమతను దనగా శతులను మర్దించువాడన్నమాట. మరన శబ్దము నిఘంటువుల కెక్కలేదు.

## 2 కర్త

"అఖిలపురాణేతిహాస కర్త" అని కందాళ అప్పగారిని గూర్చి చేసిన ప్రశంస. (1-77) వ్యాసవాల్మీకులు పురాణేతిహాస కర్తలు. అష్టాదశపురాణాలకు భారతేతిహాసమునకు కర్తవ్యాసుడు. రామాయణేతిహాసకర్త వాల్మీకి. కందాళ అప్పగారు కర్తయెట్లు? అందుకే రాళ్ళపల్లివారు ప్రశ్న చిహ్నము నిలిపినారు. "కర్తః=కర్తయతి శిథిలీకరోతి భినత్తి వా. కర్త+అచ్=భేదకే" (శబ్దస్తో) అన్న ప్రమాణమును బట్టి యిక్కడ కర్త అన్నది కర్తృ శబ్దము కాదు. "కర్త= దుర్గమార్థమును భేదించు వాడు - అని కర్త శబ్దముతో అర్థము గ్రాహ్యము. కర్తశబ్దము తెలుగు నిఘంటువులలో లేదు.

## 3 తత్తాదృక్

"తత్తాదృగ్వైభవప్రభావనిధిఁ గందాళప్పగారిన్" (1-78) ఈ శబ్దమును హరిభట్టు వాడియున్నాడు. "తత్తాదృక్పౌరజనులు తమ మన్నింపన్" (ఉ. నా 5-20) తచ్ఛబ్దము, తాదృక్ శబ్దము ప్రసిద్ధములే. తచ్ఛబ్దము ప్రసిద్ధిని దెలుపును. తాదృక్ శబ్దమునకు దానివంటిది, అటువంటిది – అని అర్థము గ్రాహ్యము (సూ.ని.) అనగా అపూర్వగుణవంతము. లేదా అత్యుత్కృష్టము లేదా అతి మహితము - అని ప్రాకరణికార్థములు చెప్పవచ్చును. "తత్తాదృగుజ్జ్వల కకుత్స్థ కులప్రశస్తి, సౌరభ్య నిర్భర గభీర మనోహరాణీ" (అనర్ఘ 1-12)" తత్ప్రసిద్ధం తాదృగపూర్వగుణవత్" (టీక) "తత్తాదృక్పుటపాక శోధిత" (అనర్ఘ 7-137) "తత్తాదృగత్యుత్కృష్టమ్" టీక "తత్తాదృశీ సలిలశీకరదుర్దిన శ్రీః" (చం. భా 3-98) "తత్తాదృశీ అతిమహతీత్యర్థః" (టీక) "తత్తాదృగ్వచనావిదగ్ధ రసనా కండూతి నిర్ధూతయే" (లక్ష్మీస)

## 4 అవత్తారి

4. అవత్తారు మండలికరగండడును" (1-79) అని "త" ప్రతి పాఠము. "నరవత్తారు మండలీకరగండుండును" అని 'అ' ప్రతి

పాఠము "అవత్తారి" సాధుపాఠమని నిర్ణయించవచ్చును అవ త్త= ఖండింపబడిన (సూ ని) అరి=శత్రువులు గలవారని అర్థము.

5. పొన్నంబరదేవ

పొన్నంబలదేవ="ర" ప్రతి పాఠము (1-79) పొన్నాంబర దేవ-"అ" ప్రతిపాఠము పొన్నాంబారుదేవీ, పోలన్నాంబరదేవ పొన్నంబరదేవ- ఉపలబ్ధ పాఠములు. వీటిలో పొన్నంబరదేవ" సాధుపాఠముగా గ్రహించవచ్చును పొన్=బంగారము అంబరము= వస్త్రము"పసుపుపచ్చని వస్త్రము-అనగా పులితోలు పొన్నంబర దేవు డనగా పులితోలు దాల్చు దేవుడు-శివుడు. పులితోలు పసుపుపచ్చగా ఉండును

6 మధ్యవృత్తము

"దర్శిత మధ్యవృత్తస్త మృదునివి (1-129) మధ్యవృత్త శబ్దము నిఘంటువులలో లేదు. "మధ్యవృత్తావర్త మహితంబు' (5-270) అన్న ప్రయోగమును బట్టి దీనికి నాభియని అర్థము చెప్పక తప్పదు. మధ్యేవృత్త ఇవ మధ్యవృత్తః, అని మధ్యవృత్త శబ్దమునకు వ్యుత్పత్తి చెప్పనగును. ఇది ఉదరావర్త శబ్దమునసరించి కల్పించి నది కావచ్చును 'ఉదరావర్తః = ఉదరే ఆవర్తఇవ - నాభిః, ఇతి రాజనిఘంటుః" (శబ్దక)



7 అంగార సింధువు

"ఈ గంగాదిక తీర్థము
లీగంగానీవుదమ సమిద్ధాంబువులన్
దోఁగెడు వారల గనగనఁ
గ్రాఁగెడు నంగార సింధుకల్లోలములన్ (1-150)

"అంగార సింధు కల్లోలములన్ = నిప్పుటేరియలలయందు" అని పూర్వటీక నరకములో నిప్పుటేళ్లుండవు, నిప్పుటేళ్ళకు తెర టాలుండవు అంగార మనగా అగ్ని ఇక్కడ వేడి అని లక్షణార్థము. "వేడినది" అనగా వైతరణీనది "ఉష్ణనదీ" = ఊష్ణానదీ - వైతరణీ నదీ" (శబ్దక) వైతరణీనది వేడినీటితో కూడుకొని ఉండును.

"నదీవైతరణీనామ, దుర్గంధారుధిరావహా
ఉష్ణతోయా మహావేగా, అస్థికేశతరంగిణీ
—ఇతి ప్రాయశ్చిత్త వివేకధృతయమదగ్ని వచనమ్"
(శబ్దక)

కనుక, అంగార సింధువనగా వైతరణీనది. ఇది నిఘంటు వులలో లేదు

8 మరుత్ఫలము

"ఆటకు మెచ్చి బలారి యీఁగొనుమరు
త్ఫల మిది యనబర్హ భారమమర" (1-161)

మరుత్ఫల శబ్దము శ. ర. లో లేదు "మరుత్ఫలము = శిలా వృష్టి, వడగండ్లవాన (విల్యమ్సు) - సూ ని. ఈ అర్థము ప్రకరణో చితము కాదు ఇంద్రధనుస్సు - అని పూర్వటీకలో ఉన్నది గాని ప్రమాణము కనబడకపోవుట వల్ల కాటోలు రాళ్ళపల్లివారు ప్రశ్న గుర్తుపెట్టినారు. అసలు పదము - వాయుఫలము "భవేద్వాయుఫలం" శక్రకార్ముకే కరకేపిచ" (విశ్వ) వాయుశబ్దమునకు బదులుగా 'మరుత్' అన్న పర్యాయ పదము వాడుట వల్ల సందేహ మేర్పడినది "మరుత్ఫ లమ్ = ఇంద్రధనుః" (సర్వ. సం.) ఈ అర్థం సూ. ని. లో లేదు.

9 జనక్ష్మా

"స్మరశశితటి దజపవమా
నరవిసుధా సలిలమునిజనక్ష్మారిష్టా
సురమృత్యుజ్వలన జలగు
సురవేశ్యలు గొలిచిరవుడు సుబ్రహ్మణ్యున్." (1 - 167)

''మునిజన శబ్దమునకు,'మునియనుస్త్రీ' యని అర్థము చెప్పుకోఁదగుననియును శ్రీ శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు సూచించినారు ఇది యింకను విమర్శింప వలసియున్నది '' అని 'అ' ప్రతి అధోజ్ఞాపికలో రాళ్ళపల్లివారు వ్రాసినారు. ఇది విమర్శనీయమే ఇట 'జనక్ష్మా' శబ్దము కవి సమ్మతమని చెప్పనగును ''జనాన్‌క్షమతే ఇతి జనక్ష్మా'' ఇది భూతధాత్రీ శబ్ద సామ్యమున కల్పించినది ''భూతాని ధరతీతి భూతధాత్రీ'' ధాత్రీ శబ్దవ్యుత్పత్తియే భూతధాత్రీ శబ్దమునకును వర్తించును అట్లే క్ష్మా శబ్ద వ్యుత్పత్తియే జనక్ష్మా శబ్దమునకు వర్తించును. 'జనస్థా' అని 'ట' ప్రతి పాఠము ''జనాః తిష్ఠంత్యస్మిన్నితి జనస్థా'' అని సాధింపవచ్చును. కాని భూతధాత్రీ శబ్ద సామ్యమును బట్టి జనక్ష్మా శబ్దమే కవి ప్రయుక్త మనుట యుక్తమని తోచును, జనక్ష్మా = భూమి - అని యర్థం. ఈ శబ్దము నిఘంటువులలో లేదు.

## 10 పల్లవి

''లవలీ పల్లవి పాండురంబులగు గల్ల క్షోణులన్ (1-194) ఇట ''పల్లవ'' అన్నపాఠము ''ర'' అ, ప్రతులలో కలదు. పల్లవ శబ్దమునకు చిగుళ్ళను అర్థము పూర్వటీకలో కలదు. కాని చిగురు తెల్లగా ఉండదు. కాన అర్థము పొరపాటు ''పల్లవి'' అన్నపాఠము ''గా'' ప్రతిలో కలదు ఈ ప్రతిని ''రాళ్ళపల్లి'' వారు చూడలేదు ఇది రాజమండ్రి గౌతమీ గ్రంథాలయములో నున్న వ్రాతప్రతి. ''పల్లవీ-న్. పల్లవాః సంత్యస్య పల్లవ + ఇనిః=వృక్షః ఇతి శబ్దమాలా'' (శబ్దక) ఇది సూ ని లోను గలదు. ఇది విటపి, పలాశి వంటి రూపము. పల్లవ పాఠపక్షమున పల్లవాః అస్య సంతీతి పల్లవః'' అని పల్లవ శబ్దమును వృక్షపర్యాయ పదముగా సాధించవచ్చు. ''అర్శఆదిభ్యోచ్'' అన్నసూత్రముచే 'అచ్' ప్రత్యయముగా చేరగా ఈ రూపముసిద్ధించును. పల్లవి అన్న నిఘంటు ప్రసిద్ధ రూపము 'గా' ప్రతిలో లభించుటచే దీనినే ప్రధాన పాఠముగా గ్రహించవచ్చు.

## 11. నడిగంటునె :

''కెరలక క్రమ్మరింప నడిగెంటననిల్చు'' (1-114) నడుగెంటినె- ''ర, అ'' ప్రతుల పాఠము నడిగెంటినె-త,ప,ట, నడిగెంటిన-క, నడిగెంటన-గా-ప్రతుల పాఠములు. 'క్రమ్మరింపన్, అడుగెంటన్ =అడుగు పడిన మాత్రముననే (అడుగు + ఎండు)- అని పూర్వటీక. నడి (డు) గెంటన = వల్గన మధ్యముననే - అని అర్థము చెప్పట యుక్తము. గెంటు = వల్గనము. అనగా మీదికి కాళ్ళుకదిలించుచు వేగముగ పోవు అశ్వగమన భేదము నడి (డు)గెంటు =గెంటు యొక్క నడుము - ఏకదేశి సమాసము.

## 12 . నయనత్రిభాగము :

''నయన త్రిభాగ దరహా
సయుతంబుగ సాధ్యసతులు చల్లిన లాజల్'' (1 - 169)

నయనత్రిభాగ = కను కొలకులయందు - అని పూర్వటీక. కనుకొలుకులయందు - అని ఉద్దేశము కాబోలు. ఏదయినను ఇది సరికాదు నయన = కంటియొక్క చూపుయొక్క త్రిభాగ = మూడవ భాగమునందు, అనగా క్రేగంటి చూపు నందు అని సరియైన అర్థము. ''దృష్టిః, త్రిభాగలోభార్తిమసౌభిభర్తి'' (నైష 8-70) ''దృష్టిత్రిభాగః =దృష్టేః త్రిభాగః తృతీయోభాగః - కటాక్ష ఇతి భావః'' అని మల్లినాథ వ్యాఖ్య.

మచ్చుకు ప్రథమాశ్వాసమునుండి కొన్ని ఉదాహరణలు చూపినాను. 2500 పుటల బృహద్వ్యాఖ్యానము ముద్రణ భాగ్యమును నోచుకొనునా ? అన్నది కాలము పరిష్కరించవలసిన సమస్య.

''ప్రత్యవస్థంతు కాలస్య, వ్యాపారో(2)త్రవ్యవస్థితః
కాల ఏవహి విశ్వాత్మా, వ్యాపార ఇతి కథ్యతే''
(వాక్యపదీయము)

## సంకేతాక్షర వివరణ

| | |
|---|---|
| అనర్ఘ | అనర్ఘ రాఘవము |
| ఉ. నా. | ఉత్తర నారసింహపురాణము |
| చం. భా | చంపూ భారతము |
| నైష | నైషధము |
| లక్ష్మీస | లక్ష్మీ సహస్రము |
| విశ్వ | విశ్వకోశము |
| శబ్దక | శబ్దకల్పద్రుమము |
| శ. ర. | శబ్దరత్నాకరము |
| శబ్దస్తో | శబ్దస్తోమమహానిధి |
| సర్వ.సం. | సర్వశబ్ద సంబోధిని |
| సూ. ని. | సూర్యరాయాంధ్ర నిఘంటువు |

# ఉషస్సు

తూర్పు కనుగుడ్లెర్ర బడ్డాయి
నీలపు రెప్పల క్రింద –
రాత్రి తాగిన నిశీథి మదిరా
దిగిపోతూ మిగిల్చిన బహుమతిగా
కాస్త తెలివి వచ్చేంత వరకూ
మనసు కలక బారేంత వరకూ
యీ అరుణిమ చిక్కనౌతుంది
తర్వాత పసుపుగా, బంగారుగా
తెలుపుగా పల్చనౌతుంది.
మళ్ళీ ప్రాపంచిక వ్యవహారాల తొందరలో
మునిగి పోవడానికి ముందే
కనురెప్పలుస్మిల మౌతాయి.
పగ్గలు యథావిధిగా
తెల్ల గుర్రాలు లాగే రథంలా
రథపు కమ్మీలా
నలిగి పోతుంది.

# అనిర్దేశ్యము

నిమ్నోన్నతాలు నిర్నిమిత్తంగా నిర్మించిన
నిష్ఠను నిందించనా ?
నిశీథులు పగళ్లై వికచ హృదయాంతరాళ
పద్మదళ నిష్యంది అయ్యే
భావ తుషారాన్ని విందు చేయనా ?
ఎక్కడికీ బాట ?
అంతు తెలియని సెలయేటి పాటలా
పాడి అలసిన వేదికి
మేఘమల్హారునై వర్షించనా ?
కష్టాల జడిలో తడిసి శోషిల్లిన
మనసును దీపక రాగాన్నై వెలిగించనా ?

శ్రీ దేశెట్టి కేశవరావు

డా॥ [illegible]

# పొడుపు కథల్లో జానపద కథలు - గాథలు

ప్రకృతి పురుషుల ప్రతిఫలనలలో ఆవేదనానంద సమ్మిశ్రితాలైన అనేకానేక గాథలు సముద్భవిస్తుంటాయి. ఆ గాథలు కథా సాహితీ ప్రపంచంలో అజరామరాలై నిలిచి ఉంటాయి. మానవలోకానికి విజ్ఞానాన్ని వినోదాన్ని కలిగిస్తుంటాయి. కనుకనే అక్షరమైన ప్రతికథ అక్షయ సందేశాన్ని ప్రసారం చేస్తూనే ఉంటుంది.

ఎక్కడో సూర్యోదయం జరుగుతుంది. ఆ వెలుతురు సర్వ ప్రపంచాన్ని స్పృశిస్తుంది. ఎక్కడో ఒక సంఘటన జరిగింది అది ఒక కథ అయ్యింది, ఆ కథ ప్రసరించింది, దిక్కులను చుంబించింది, ప్రకృతిని స్పృశించింది. మేధస్సుల్ని కదలించింది, తానుసంకేతమై కూర్చుంది. ఆ సంకేతమే ముడి, ఆ ముడి విప్పాలి, అప్పుడే ఆ కథ భాసిస్తుంది.

ఆ ముడే పొడుపు. ఆ పొడుపుకు విడుపు కావాలి. ఆ విడుపే విజ్ఞానం, ఆ విడుపే వినోదం, ఆ విడుపే కారు చీకటిని చీల్చుకొని వచ్చే కాంతికిరణం.

కథాత్మకాలైన పొడుపుల్లో పొడుపొక ప్రశ్న. కథ ఒక సమాధానం. పొడుపొక సంకేతం, విడుపొక సంఘటన. ఈ సంకేత సంఘటనల్లో మొదట పుట్టింది సంఘటనే. సంఘటనలేనిది సంకేతం లేదు. సంకేతంలేకున్నా సంఘటనముంటుంది. ఆ సంకేతం తెలిసినవాడు పొడుస్తాడు. ఆ సంఘటన తెలిసినవాడు విప్పుతాడు, అయితే కథాత్మక ప్రహేళికల్లో పొడిచినంత సులభంగా విప్పడం సాధ్యంకాదు. పొడవడానికి అరనిమిషం చాలు, విప్పడానికి అరగంటకావాలి.

## వికాసం :

ఆంధ్రసాహిత్యంలో వెల్వడ్డ కథాకావ్యాలన్నీ ఇంచుమించుగా సంస్కృతానుకరణాలు - అనుకరణాలు. సంస్కృత పంచతంత్ర హితోపదేశాలు, భేతాళవింశతి, కథాసరిత్సాగర, దశకుమారచరిత్రాదులాంధ్ర కథాకావ్యాలకు మార్గోపదేష్టాలు కేతన దశకుమారచరిత్రం, మంచన కేయూర బాహుచరిత్రం, జక్కన విక్రమార్కచరిత్రం, గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, పాలవేకరి కదిరీపతి శుక సప్తతి కథలు, అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతి మొదలైన తెలుగు కథా కావ్యాల్లోని ప్రశ్నోత్తర ప్రాయాలైన అనేక సన్నివేశాల్లోను పొడుపు కథలఛాయలు సకృత్తుగా కనిపిస్తున్నాయి. కనుకనే పొడుపు కథల్లో కావ్యగుణాలు కథాకావ్యాల్లో పొడుపుకథల ఛాయలు కనిపించడం సంభవమయింది. సంస్కృతంలో ప్రసిద్ధి గాంచినకొన్ని కావ్యాల్లోని శ్లోకాలకు కట్టుకథలేర్పడ్డాయి. బహులక్షణ విరాజితమైన పొడుపుకథల్లో సోపానాలుకు పైగా కట్టుకథలే. అసలు కట్టుకథ పొడుపు కథ యొక్క లక్షణాంశం. మహాకవి భారవి కిరాతార్జునీయంలోని శ్లోకం,[1] పాణిని అష్టాధ్యాయిలోని సూత్రం,[2] కథాత్మకాలైన పొడుపు కథలకు సంకేతాలై భాసిస్తున్నాయి.

అదేవిధంగా ఆంధ్రసాహిత్యంలోని అనేకపద్యాలు[3] పద్యాంశాలు,[4] చాటువులు,[5] సామెతలు,[6] పలుకుబళ్ళు,[7] పదబంధాలు[8] సమస్యలు[9] కథాత్మకాలైన పొడుపుకథల కేంద్రబిందువులై విరాజిల్లుతున్నాయి.

ఈ విధంగా విరాజిల్లే ఆంధ్రసాహిత్యాంతర్గత ఛాయాప్రహేళికలతో బాటు, జానపదుల కథన కుతూహలాన్ని వెల్వరించే కథాత్మకాలైన పొడుపుకథలు లెక్కకు మిక్కిలిగా తెలుగు దేశంలో కనిపిస్తున్నాయి. అవి జానపదుల గుండెల్లోని కథారామణీయకతను మనోరంజకాలైన ధ్వనులతో వెల్వరిస్తున్నాయి. ఆటువంటి ధ్వని సంశోభితాలైన పొడుపుకథల్లో పొట్టిపొడుపులు పొడుగువిడుపులూ పొడుగు పొడుపులూ పొట్టివిడుపులూ ఉన్నాయి. అంతేగాక గేయకథాత్మకాలైన పొడుపులు ఉన్నాయి. వివరణాసక్తి గల సామెతలూ ఉన్నాయి.

జానపద కథాప్రహేళికల్ని స్థూలంగా పౌరాణిక చారిత్రక, సాంఘిక, కాల్పనికాలని విభజించినా, జానపదుల హృదయం సాంఘిక కథాప్రహేళికల్లోనే, కాల్పనికకథా ప్రహేళికల్లోనే అధికంగా దృశ్యమాన మవుతోంది.

సాంఘికాలు :

సమకాలీన జీవన స్థితిగతి ప్రగతుల్ని, మానవమనస్తత్వ విచిత్రాల్ని, సర్వభూతమనోవికారాది భావాల్ని, ప్రసన్నకథాత్మక ప్రహేళికల ద్వారా తెలుసుకోవచ్చు. వస్తుగుణాన్ని బట్టి ఇవి జంతుకథలనీ సంకీర్ణ ప్రహేళికలనీ, నీతిపొడుపుకథలనీ, అద్భుతప్రహేళికలనీ ధార్మిక ప్రహేళికలనీ, సరళమైన పొడుపులనీ విభజించడానికి వీలుంది. కొన్ని పొడుపు కథల్లో శృంగారాది రసాల మోతాదు మించడం కనిపిస్తుంది. జానపదుని హృదయాన్ని ప్రతిబింబించే కథాత్మక సాంఘిక ప్రహేళికలు వస్తుగుణ సాంకర్యంచేత విభజన క్లిష్టాలవుతున్నాయి. అందువల్ల రసగుణ రమ్యాలైన కొన్ని పొడుపుకథల్ని మాత్రం పరిశీలిద్దాం.

కతలన్ని ఎతలాయె
కాపురాలు రెండాయె
ఆడు సచ్చి ఆర్నెల్లాయె
ఆడేసిన కుందేలు
ఇయ్యాల్ల మాపటి కూరకాయె
సచ్చిన మగడు సండ్లమీద
మనున్నమగడు మంచంమీద[10]

మాపటివేళ మంచమెక్కినప్పుడు భర్తకో విషయం జ్ఞప్తికి వచ్చింది. మారు మొగమై పడుకొని ఉన్న భార్యను అడిగాడు "రాత్రి భోజనంలో వడ్డించిన కుందేలు కూర ఎక్కడిది" అని. భార్య ఆవేదనా పూరిత స్వరంతో పై పొడుపుకథ పొడిచింది.

ఓ పల్లెపడుచు బాల్యంనుండి బావమీద మనసు పడింది. బావతోనే ఆడింది-పాడింది వయసు వచ్చింది వలపు హెచ్చింది. పరస్పర ప్రేమభావాలు మరీ పదిళపడ్డాయి. ప్రగాఢంగా పెనవేసుకొనిపోయాయి. లేతవలపు ముదిరింది. ప్రణయం సమారాధన దశకు చేరుకుంది. వారి కన్నులు కథలు చెప్పుకున్నాయి. వారి హృదయాలైక్యమై బావాంబర వీధుల్లో విహరించాయి. వారి ప్రేమకథ అపూర్వమయింది. జనం చెప్పుకొంది. ఆ ప్రేమను ప్రాచీనార్వాచీన విశ్వప్రేమికులతో పోల్చి కథలూ-గాథలూ కట్టుకొంది. కానీ ఈ ప్రేమికుల తల్లిదండ్రుల మధ్యన ఉన్న సరసం విరసమయింది. వియ్యంకులు కావలసినవారు కయ్యాలకు కాలుద్దువ్వుకున్నారు. ఆ యింటి పిట్ట ఈ ఇంటిమీద ఈ ఇంటిపిట్ట ఆ ఇంటిమీద వాలితేచాలు అగ్గి రాచుకుంటోంది. బుగ్గిగా మారుతోంది. ఆ పడుచు తల్లిదండ్రులు వెంటనే అమ్మాయి పెళ్ళి పొరుగూరి యువకునితో జరిపించారు.

పాపం ఆమె బావ భగ్నహృదయుడై భరించలేక గుట్టక్రింది అడవిలోని చెట్టుకు ఉరిపెట్టుకున్నాడు. ఆ ప్రదేశానికెవరూ వెళ్ళరు. అందువల్ల అతని ఆత్మహత్య విషయం ఎవరికీ తెలియలేదు. కానీ ఈ రెండు కుటుంబాలు సాన్నిహిత్యంగా ఉన్న కాలంలో ఈ ప్రేమికులు మాత్రమక్కడికి వెళ్ళేవారు. అది వారి సంకేత ప్రదేశం వివాహమైన తర్వాతకూడా ఆ పడుచు అతనిమీది ఆరాధనా · ప్రణయాన్ని చంపుకోలేక అక్కడికి వెళ్ళేది: అతడు ఉరి పెట్టుకున్న మర్నాడు వెళ్ళింది- చూచింది-వగచింది.

అప్పట్నుండి ప్రతిరోజు అక్కడికివచ్చి ఆ శవం కాళ్ళక్రింద నీళ్ళుపోసేది అక్కడ పచ్చగడ్డి దినందినం పెరిగి గుబురులు-దుబ్బులూ గంటలుగా మారింది. అందో కుందేలు స్థావర మేర్పరచుకుంది. ఆ విధంగా ఆరుమాసాలు గడిచాయి. ఆ యువకుడు ఉరిపెట్టుకున్న తాడు చివికి తెగింది. ఆ దినం ఆ పడతి వెళ్ళేసరికి అస్థిపంజరం కింద పడి ఉంది. అస్థిపంజరం కింద చచ్చిన కుందేలు. ఆ కుందేలును తెచ్చి కూర వండింది. పనిమీద వెళ్ళిన భర్త రాత్రికి వచ్చాడు. భోజనంలో అతనికాకూర ఆమె వడ్డించింది. ఆకలితో తిన్న అతడు మంచమెక్కాక అడిగాడు.

ఈ పొడుపుకథలోని చివరి రెండు పాదాలు కథకు పరమరామణీయకత సంతరించి పెట్టాయి. ఆమె కిద్దరు భర్తలు, ఒకరు చనిపోయారు. ఒకరు ఉన్నారు. చచ్చినవాడు స్తనాలమీద అనడంలో అతడు తన హృదయంలో ఉన్నాడని వ్యంగ్య సుందరంగా చెప్పినట్లయింది. ఉన్నవాడు మంచంమీద అనడంలో ఈ మంచానికి ఈదేహానికి మాత్రమే అతడధికారిగాని తన హృదయాధినాథుడు మాత్రం కాడని ద్విపరపషంగానేపలికింది. అప్పుడామెకున్న మానసిక స్థితి అట్టిది. అటువంటిస్థితిలో వచ్చే పలుకులు ములుకుల్లాగానే ఉంటాయి. అయినా అతి నిగ్రహాన్ని పాటించి తీగను తెగనివ్వకుండా నిగూఢంగా పొడిచి సమస్యను సరసంగా పరిష్కరించింది.

ఇలాంటి కథాత్మక ప్రహేళికలన్నీ జానపదుల మనస్తత్వాలకు ప్రతిబింబాలు. తిండిపోతైన ఓ యువతి మనస్తత్వం ఈ క్రింది పొడుపు కథ ద్వారా తెలుస్తోంది.

కతకత కొనసులు
పిడెడు పాళం జిట్టిసులు (నూకసులు)
వత్తుల పెయ్యద్దసులు
దీపం సిటుకు (పోకపోటుకు)
తలుపు పోటుకు
వచ్చినా యెనుక పండసులు.

ఓ భార్యామణి భర్తచాటుగ బాగా తినమరిగింది. అతనికి మాత్రం చెడ్డది పడ్డది చేసిపెట్టేది. తాను పంచభక్ష్య పరమాన్నాలతో

పొట్టపూజ చేసేది. ఆరోజు మధురపదార్థాలెన్నో సిద్ధం చేసింది. ఇక తిందామనుకొంది. ఏదో పనిమీద ఇరుగమ్మలు పొరుగమ్మలు వచ్చారు. వారందరినీ సాగనంపి సాపాటు కానిద్దామనుకుంది. కానీ భర్త రానే వచ్చాడు. అతనికేదో ఇంతపెట్టింది. తాను తర్వాత తింటానంది. అలసి సొలసి వచ్చిన భర్త నడుం వాల్చి కళ్లు మూసుకున్నాడు. కొంతకాలమతని పొంతన ఉండి, అచ్చట్లు ముచ్చట్లు పలికినంగనాచి కబుర్లు చిలికింది. అతడులుకూ పలుకూ మానాడు. నిద్రపోయాడను కుంది. సంతోషంతో వంటఇంట్లో ప్రవేశించి ఆదరాబాదరాగా తనపని కానిచ్చి భర్త పక్కకు చేరింది.

"ఓయ్! ఓయ్! అప్పుడేనిద్రపోయావా! ఓ కథ చెప్పవా" అని మోచేతితో గుద్దుతూ మోకాలితో కుదుపుతూ అడిగింది. భార్య ప్రవర్తన అతనికిరోజు కొత్తదేం కాదు. అయినా 'తిండిపోతుది' అని మనస్సులోనే అనుకున్నాడు.

'ఓ అసులా! ఇది కథకాదు పీటకింద దాచిపెట్టిన పాయసం జుర్రావు. చేయి బయట కడుక్కుంటే నేను చూస్తానేమో అని వత్తులోనే చెయ్యద్దావు. ఓ చిటుకువేసి దీపమూదావు. తలుపును పుటుక్కున దగ్గరకు లాగావు. వచ్చి నా వెనుక పండావు.

పాపం ఆ పడతి, బండారం బయట పడింది. ముంతెడంత ముఖం చింతాకంత అయింది. మారు మాటాడ్లేదు. అంటే మారుకథ పొడవలేదు. ఏవేవో శాస్త్రాలు చెప్పి భర్తనోరు కట్టివేసే ఆ మగువ తేలు కుట్టిన దొంగలా నోరే తెరువలేదు.

ఇలాంటి పొడుపు కథలు సాంసారిక జీవితంలో కాలిపేలిన వారే కాదు పొడుచుకునేది! ఆ కుటుంబంలోని పూర్వ సంస్కారాల వల్ల అక్కడ పుట్టిన చిగురు కొమ్మయినా చేవదేరి ఉంటుంది. చక్ర వడ్డీలు తీసుకొని పాషాణ సదృశ హృదయుడైన సాహుకారి మన స్సునే మార్చిన ఏడేళ్ల బాలిక ప్రజ్ఞ ఈ క్రింది పొడుపు కథలో ద్యోతక మవుతోంది.

అప్పులోదొచ్చి అయ్య సంగతడిగితే
ముల్లుకు ముల్లు నాటవోయిండు,
ఒకటికి రెండు సేయవోయింది
నూటొక్క రాశిని మర్దన సేస్తుండ.

చాలీ చాలని ఆదాయంతో సంసారం ఈదుతున్న నిజాయితీ పరుడైన కాపుకో కూతురుంది. సంసారం కొరకు సాహుకారు దగ్గర అప్పుచేసేడు కాపు. సాహుకారు ఓ నాటి పగటిపూట కాపు ఇంటికి వచ్చాడు. అమ్మాయిని అయ్య సంగతి అడిగాడు. కాపు బిడ్డ "మా అయ్య ముల్లుకు ముల్లు నాటవోయిండు" అన్నది. సాహుకారు చిత్రపోయి అమ్మ సంగతి అడిగాడు. "మా అమ్మ ఒకటికి రెండు చేసుక రానువోయింది." అంది కాపుబిడ్డ. అది అర్థం కాక మరేమను గాలో తెలియక మరినీవేం చేస్తున్నావు? అని అడిగాడు. "నూటొక్క రాశిని మర్దన సేస్తుండ' అంది కాపుబిడ్డ లోలోన నవ్వుకొని.

సాహుకారు బుర్రగిర్రున తిరిగిపోయింది. కుతూహలం పెరి గింది. మాటల ముడిని విప్పనిది కథలకూడదనుకొన్నాడు. "ఏంటో అమ్మాయి! కాపు కూతురనిపించుకొన్నావు. నీవు చెప్పింది నాకేం అర్థంకావడం లేదు." అన్నాడు శ్రేష్ఠి. "ఇదిగో సాహుకారు అర్థంవిప్పి చెప్పినట్లయితే మా అయ్య మీ కిచ్చే డబ్బుకు రెండింతలిస్తాను" అంది పక పకా నవ్వుతూ. కాపు బిడ్డ పరిహాసానికే అంటున్నదనేది శ్రేష్ఠి కర్థమయిపోయింది. వెంటనే "అదంతా, ఎందుకమ్మాయీ! చెప్పు! మీ అయ్య నాకు అప్పే లేదని అంతా తీర్చేశాడని కాగితం రాసిస్తాను" అన్నాడుదారహృదయంతో ఉత్సాహంతో సాహుకారు.

కాపుబిడ్డ సాహుకారుదిక్కు కృతజ్ఞతా భావంతో చూసింది. అయ్యా! ముల్లుకు ముల్లు నాటవోయాడంటే ముల్లు వంకాయ తోటకు (చెట్లకు) కంపనాటవోయాడని అర్థం. ఒకటికి రెండు చేసుకురాను పోయిందంటే సెనగల్ని పప్పు బద్దలుగా చేయడానికి పొరుగింటికి పోయిందని అర్థం. ఇక నూటొక్క రాశిని మర్దన సేస్తుండ అంటే రొయ్యల్ని చంపి పొట్టుతీసి వేపుడు చేస్తున్నానని అర్థం" అన్నది దండం పెట్టి కాపుబిడ్డ. ఆ కృషీవలుని ఇంటి నగ్నస్వరూపం ఆ సాహు కారు కళ్లకు బొమ్మకట్టి నట్లయింది హృదయమూ - నయనాలూ ద్రవించాయి. కోటు జేబునుండి అప్పుపత్రం తీసి పటాగొట్టి అమ్మాయి అంజలిబద్ధ హస్తంలో ఉంచి భారహృదయంతో వెనక్కు మళ్ళాడు సాహుకారు.

"పడితే పిడికెడు - విడిస్తే ఇల్లెడు" అయిన కథాత్మక జాన పద ప్రహేళికలు అనంత వైవిధ్యంతో జానపదసాహిత్యాకాశంలో ప్రకాశిస్తున్నాయి. ఎండని యేరుల్లాగా, వాడని పూవుల్లాగా అవి తమ చల్లదనాన్ని, పరిమళాన్ని నిరంతరం అందిస్తూనే ఉంటాయి. అవి అందుకొని జనపదుల మనస్సుల్ని విశ్లేషించుకొని ఒక వినూత్న మన స్తత్వ శాస్త్రాన్ని నిర్మాణం చేసుకునే అస్కారముంది.

## కాల్పనికాలు

కథాత్మకాలైన సాంఘిక ప్రహేళికలకు, కాల్పనిక ప్రహేళి కలకు ఈషద్భేదం కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది. సాంఘిక పొడుపుకథల్లో ప్రస్తుత సామాజిక జీవనం జానపదుల మనస్తత్వం ప్రస్ఫుటమవు తుంటే, కాల్పనిక పొడుపు కథల్లో రాజులు, రాణులు, మంత్రులు, సేనాధిపతులు, వేశ్యలు, విదూషకులు, నెరజాణలు, పాములు, ప్రధాన పాత్రలుగా కనిపిస్తాయి. ముఖ్యంగా ఇందులో స్త్రీల మేధాశక్తి ప్రశంస

నియం. కాల్పనిక సాహిత్యానికి సర్వసాధారణాలైన గుణాలన్నీ కాల్పనిక ప్రహేళికలకూ అన్వయిస్తాయి. ఒకటి రెండు కాల్పనికాంధ్ర ప్రహేళికల్ని పరిశీలిద్దాం.

కొడుకా కొడుకా
(మ) మొగనికి తమ్ముడా
సక్కన్న పండయ్య
సన్ని స్త లేవయ్య

ఓ మహారాజ్యాన్ని ఓ మహారాజు పరిపాలించేవాడు. ఆయనకు ఒక్కగానొక్క కూతురుంది. ఆ అమ్మాయి అంతఃపురంలో కూడా అరికాలు కింద పెట్టక అల్లారు ముద్దుగా పెరిగింది. రాజు రాణి రాజకీయ వ్యవహార సముద్రంలో పూర్తిగా మునిగిపోయి, వయసు వచ్చిన కూతురి సంగతే మరచిపోయారు. రాజకుమారి వేటకూ, విహారానికీ అశ్వాన్నీ రథాన్నీ స్వయంగా అశ్వశాలాధ్యక్షుడే సిద్ధం చేసేవాడు. అప్పుడప్పుడు వేటకు అశ్వశాలాధ్యక్షుడు కూడా వెంటవెళ్లేవాడు. ఒకనాడు వాళ్ళిద్దరూ వేటాడుతూ పరివారానికి దూరమై ఓ కొండ గుహలో చిక్కుకున్నారు. అక్కడ రాకుమారిని మింగడానికి యత్నించిన కొండచిలువను అతడు నరికి ఆమెను రక్షించాడు. గజగజ వణకి రాకుమారి అతని బాహువుల్లో ఒదిగి సేదదీర్చుకుంది. అతడే తన భర్త అని తీర్మానం కూడా చేసుకుంది. అతడు కూడ ఆమెను పవిత్రంగా ప్రేమించాడు. రాకుమారి గర్భవతి అయింది – ప్రసవించింది. అంతకు పూర్వమే తల్లిదండ్రుల ముందు ప్రేమా – పెళ్లి ప్రస్తావన తీసుకొని రావడానికి ఎన్నో పర్యాయాలు ప్రయత్నించింది. కానీ వారు రాజకీయపు గొడవల్లో మునిగిపోయి ఏదీ చెవిని పెట్టలేదు. ఈ రహస్యం ఇద్దరు దాసీలకు, ఆ ప్రేమికులకు తప్ప మరెవ్వరికీ తెలియదు. పదునాలుగేళ్ల రాకుమారికి పుత్రోదయమయింది. ఆ పిల్లాణ్ని అదే నగరంలో ఉన్న ఓ పూటకూళ్ల పెద్దమ్మ రహస్యంగా పెంచే ఏర్పాటు చేశారు. ఆ పెద్దమ్మకు ఆ దాసీలద్వార సమస్త వస్తువులు పంపేవారు.

రాకుమారి పుత్రుడు శుక్లపక్ష చంద్రునిలా దినదిన ప్రవర్ధమానుడయ్యాడు. ఆ బాలుడు కంపచాటు మొక్కలా జివ్వున పైకి యెదిగి వచ్చాడు. పదహారు సంవత్సరాలు గిఱ్ఱున తిరిగిపోయాయి. ఆజానుబాహుడూ సమున్నత శరీరుడూ అయిన రాకుమారి పుత్రుడు చూపరుల దృష్టిని ఆకర్షిస్తున్నాడు. ఆటపాటల్లో సాముగరిడీల్లో అందరిలో అగ్రగణిగా పేరుపొందాడు.

ఇన్నేళ్లు గడిచినా కూతురు బాగోగుల్ని, పెళ్లి పెడాకుల్ని గూర్చి ఆ తల్లిదండ్రులు ఆలోచించనేలేదు. అందువల్ల ఆమె ప్రణయ రహస్యం రహస్యంగానే ఉండిపోయింది. ముజ్జిడ్డుగా ఉన్న రాజకీయ వ్యవహారాల రథాన్ని ముందుకు లాగలేక ముసలిరాజు ఓరోజు గుటుక్కుమన్నాడు.

రాజులేని రాజ్యంలో శాంతి పూజ్యమని భావించిన మంత్రులందరూ మంత్రాలోచనం చేసి ఓ నిర్ణయానికి వచ్చారు. తమ పట్టపు భద్రకుంజరానికి పూలమాల ఇచ్చి నగరంలో విడిచిపెట్టారు. ఆ ఏనుగు ఎవరి మెడలో మాల వేస్తుందో అతని మెడలో రాజ్యశ్రీ మాల వేస్తుంది. అతడా రాజ్యానికి రాజవుతాడు. రాకుమారి ప్రమేయం లేకుండానే నిర్ణయాలు జరిగిపోతున్నాయి. భర్త మరణంతో వృద్ధరాణి నిర్ణయాలన్నీ మంత్రులకే వదలివేసింది. పట్టపేనుగు సరాసరి వెళ్లి పెద్దమ్మ పెంచుతున్న రాకుమారి పుత్రుని మెడలో మాల వేసింది.

అశ్వశాలాధ్యక్షునికి రాకుమారికి కంగారెత్తింది. ఇప్పుడేమి చెప్పినా రసాభాసమే అని ఆమె ప్రియుణ్ని సముదాయించి కొడుకును పెళ్లిచేసుకొంది.

పదహారు సంవత్సరాలుగా రహస్య ప్రణయ జీవన మాధుర్యాన్ని అనుభవిస్తున్న రాకుమారి ప్రప్రథమంగా శోభనం గదిలో అడుగు పెట్టింది. పిచ్చిగా నవ్వుకొంది. నిర్లజ్జగా పాన్పుమీదికి చేరింది. వెల్లకిల పడుకుంది. బెదురు బెదురుగా పయ్యెద మీద చేయి వేసిన కొడుకువైపు తిరిగింది. వాత్సల్య పూర్ణదృక్కులతో చూసింది. పుత్ర హస్తస్పర్శకామె పాలిండ్లు క్షీరపూర్ణాలయ్యాయి. ఆమె తను వెల్ల మాతృప్రేమచే పరవశించింది.

ఆ పిల్లాడు కొడుకు తనకు విధివశాన వివాహ మాడిందిగాన తన మగనికి తమ్ముడు, అందుకే చక్కగా పడుకొమ్మంది. చన్నిస్తాలె (ర)మ్మంది.

ఆ పదహారేళ్ళ బాలుడు అశ్రుసిక్తనయనుడై తల్లి పాదాలపై పడ్డాడు. ముప్పయి సంవత్సరాల ఆతల్లి అతణ్ని ఒడిలోకి లాక్కొంది. ఇద్దరూ కలిసి అశ్వశాలవైపు నడిచారు.

రహస్య ప్రణయం, రహస్య ప్రసవం, రహస్యపోషణ, గజమాలాధారణ, మాతాపుత్ర వివాహం, ప్రహేళికా ప్రహసనం అనే అత్యద్భుత సన్నివేశాల్ని, అతిలోక కల్పనా సౌందర్యంతో జగము మెచ్చి తలనూచే విధంగా సృష్టించాడు జానపదుడు. అతని మనస్సెన్ని అద్భుతాలనల్లుతుందో, హృదయానుభూతులనంత చక్కగా వ్యక్తీకరిస్తుంది.

ఇలాంటి పొడుపు కథల్లోని పొంతులు మనమున్న వారు, మాట తప్పనివారు, మరణమంటే వెరువనివారు, ముప్పు వచ్చినా జంకనివారు,

మచ్చరాకుండా మెలిగేవారు. మచ్చరాకుండా తప్పించుకొన్న మగువ కథ ఈ క్రింది పొడుపు కథ.

"అన్నా! పిండోలె ఎన్నెల
అచ్చం ఎన్నెల ముద్దుగున్నది.
'అచ్చం ఎన్నెలే గాని
అచ్చానికో మచ్చపుట్టెగా చెల్లెలా,
'అచ్చానికో మచ్చ పుట్టె
సచ్చినా నీయిల్లు సొచ్చపోదుగదా అన్నా!"

* * *

"ఒంటికాలి పిట్టబతి పట్టి ధర్మమగునా
'పంటసేను పదాట్ల కల్పనీకు నాయమగునా,
'సేనుకో పులాస పర్దది గదా,
'సేనుకు పులికి సెల్లెలొరుసు గదా!"

ప్రజ్ఞాపాటవాలు కల ప్రధానమంత్రి అండదండలుండగా ఓ మహారాజు నిశ్చింతగా రాజ్యపాలన చేస్తున్నాడు. ప్రధాని మాటకూ చేతకూ ఆ రాజ్యంలో విలువ ఉంది అతని భార్య అందగత్తె పైగా తెలివి గలది. ఓనాడు రాజు ఉద్యానవనవిహారంచేస్తూ తన పెంపుడు పైడికంటెను ఈ రాజ్యంలో అందరిలో అందరిని మించిన అతివ ఎవ్వరని అడిగాడు. ఆ పైడికంటె ప్రధానమంత్రి భార్య అని సమాధానమిచ్చింది. ఆ రోజునుండి రాజు మంత్రి భార్యను పొందటానికి యేమేం చేయాలా అని ఆలోచిస్తున్నాడు. మంత్రి ఈ విషయాన్ని పసిగట్టగలిగాడు గట్టు దాటే మార్గం ఆలోచిస్తున్నాడు.

ఓనాడు రాజు మంత్రి ఇంటికి వెళ్ళాడు మంత్రి అతణ్ని ఆదరించి మర్యాదలు చేశాడు. గృహాంతర్భాగంలోని మూడు గదులకు తాళాలు వేశాడు. భార్యను ఆ మూడు గదుల వెనుక ఉంచాడు. భోజనానంతరం మూడు విడాలు తెచ్చి అక్కడ పెట్టి లోనికి వెళ్లాడు. అప్పుడు మంత్రి భార్య పెంచుకున్న పైడికంటె రాజు దగ్గరకి వచ్చింది. "రాజుకు ప్రధాని భార్య చెల్లెలొరుసగద" అని అది యెగిరి పోయింది. రాజు కోపంతో విడెం విసరికొట్టి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. రాజు కోపాన్ని గమనించిన ప్రధాని ఇక అక్కడ ఉండకూడదని, భార్య దగ్గరకు వెళ్ళి మా తమ్ముని వివాహానికి పోతున్నాను అనిచెప్పి ఓ కొండగుహలో దాక్కొన్నాడు.

మంత్రి వెళ్ళిపోయిన విషయం రాజుకు తెలిసింది. రాజు ఆ రోజు రాత్రి మంత్రిభార్యను పిలిపించాడు. అదివరకే సౌధోపరి భాగంలో పిండారబోసినట్లున్న వెన్నెట్లో మంచాలు వేయించాడు. మంత్రిభార్య చక్కగా అలంకరించుకొని రాజు దగ్గరకు వచ్చింది. ఆమెకు చాలాకాలంగా రాజు తనకు అన్న అని తెలుసు రాజుతల్లి తన తల్లి ఒకే తల్లి పిల్లలు తన తల్లి పొరుగు రాజ్యపు మంత్రిభార్య. తండ్రి-తల్లి-తాను ఒకనాడు మహారణ్యం మధ్యలో ప్రయాణం చేసేప్పుడు ఓ సింహం బారినబడి తల్లిదండ్రులు మరణించారు తానొక్కతే తప్పించుకొంది. వేటకు వచ్చిన ఈ దేశపు మంత్రి తనను కాపాడాడు. ఆ తర్వాత వివాహం చేసుకొన్నాడు అతనికికూడ తనకు రాజు అన్న కావాలన్న విషయం ఇంతవరకు చెప్పనేలేదు తన తల్లిదండ్రులూ తానూ సింహం బారినబడి చనిపోయామని లోకం చెప్పుకొంటోంది. దుఃఖాన్ని దిగమింగుకొని తానెవరైంది ఇంతకాలమెవరికీ చెప్పనేలేదు. రాజు మనస్సు తనపై ఉందని తనభర్త సూచాయగా చెప్పి చింతించాడు. తానప్పుడే పైడికంటెను పంపింది. రాజు దగ్గరికి వచ్చిన వెంటనే నమస్కరించి ఈ విషయమంతా చెప్పింది. రాజు తన అజ్ఞానానికి చింతించాడు. ఆ పిండి వెన్నెట్లో చింతిస్తూ మంచంమీద పడుకున్నాడు. ఆ పక్క మంచం మీదనే మంత్రి భార్య పడుకొంది.

రాజు మాటాడకుండా ఉండడం గమనించిన ఆమె "అన్నా! పిండోలె యెన్నెల—అచ్చం ఎన్నెల ముద్దుగున్నది" అని అంది. 'అచ్చానికో మచ్చ పుట్టెగదా చెల్లెలా' అన్నాడు రాజు. 'అచ్చానికో మచ్చపుట్టె సచ్చినా నీయిల్లు సొచ్చపోదుగదా అన్నా'- అంది మంత్రి భార్య.

రాజు మరుసటిరోజు మంత్రి యెక్కడ ఉన్నాడో తెలుసుకొన్నాడు. వెంటనే అతనిదగ్గరికి వెళ్ళి దండం పెట్టి నిలబడ్డాడు. అప్పుడు మంత్రి 'ఒంటికాలిపిట్టబతి పట్టిధర్మ మగునా' అన్నాడు. 'పంటసేను పదాట్ల కల్పనీకు నాయమగునా' అని రాజన్నాడు. 'సేనుకో పులాస పర్దదిగదా' అని మంత్రి అన్నాడు. సేనుకు పులికి సెల్లెలొరుసు గదా! అని రాజన్నాడు. మంత్రి లేచి వచ్చి రాజును కౌగిలించుకున్నాడు.

పది పాదాల పొడుపుకథ వెనుక ఇంతపెద్ద విడుపుకథ ఉంది. చివరగా గేయాత్మక కథా ప్రహేళిక ఒకటి గమనిద్దాం.

"జలజల ముత్యము రాయే
జల ముత్యము రాయే,
పూసిన తంగెడు రాయే-
బూదేవి రాయే,
కాసిన తంగెడు రాయే-

కామాచ్చి రాయే,
గన్నేర్ల మోతకు-
మావారు మేత వట్టక ఉన్నారు,
మేతవట్టి ఇత్తు రాయే-
లేత మామిడికొమ్మ."

"వెనుక సెవ్వులు-వెల్లాయి పళ్లు
రాతిలో మెదడు-రాయిపూరు చెక్క-
ఇంటి వెనుక తంగేడు పూసినపుడు
పట్నం పాడైనపుడు వస్తిపోయె హన్మాండ్ల గుడికి"

ఓరాజుగారు ఓనాటి సంధ్యా సమయంలో చల్లని పిల్లగాలిని పీలుస్తూ ఆంజనేయస్వామి మందిరం అరుగుమీద కూచున్నారు. ఆ దారి వెంబడి ఆ నగరంలో పేరుమోసిన కాపు కోడండ్రయిదుగురు నీలాటి రేవుకు అదే సమయంలో పోతున్నారు. అందు అందరికన్న చిన్నది అందగత్తె-హంసగమన. ఆ చిన్నదానిమీద రాజు మనసు పడ్డాడు. వెనుకబడ్డ వెలదిని దగ్గరకు పిలిచాడు.

"ఓ చిన్నదానా! అంతలేసికొప్పును తలకోసి ముడిచావా! తలకోయక ముడిచావా' అడిగాడు రాజు.

ఆ చిన్నది రాజు మనసు గుర్తించింది. ఈ లోకంలో కూచున్న చోటికే బువ్వ రావాలని కోరుకునేవారెందరున్నారో కదా అనుకుంది. అందుకే రాజుతో ఇలా అంది.

"రాజా! రాజా! హనుమాన్ గుడి అరుగుమీద నీయంత నీవు కూసున్నావా! లేక నిన్నెవ్వరన్నా కట్టేసిండ్రా' అంతే ఇక ఒక్క క్షణం కూడా అక్కడ నిలువక అక్కల్లో కలిసిపోయింది.

రాజు చింతాక్రాంతుడై రాత్రివరకు అక్కడేకూచున్నాడు రాజుగారి నర్మసచివుడు రాణి కీవార్త చేరవేశాడు. రాణి హుటాహుటిన పయనమై రాజు దగ్గరకి వచ్చింది. రాజు భార్యకు మనస్సులోని మాట చెప్పాడు. ఓ అదెంత పాటిలే! నేను సంధానకర్తనవుతానని భర్తను గృహోన్ముఖుణ్ణి చేసింది రాణి. మరునాడు కాపు ఇంటికి వెళ్ళింది. కాపుకోడండ్రు ఆమెను సాదరంగా ఆహ్వానించి సపర్యలు చేసి వడ్లు దంచడంలో మునిగిపోయారు. అప్పుడు రాణి "జలజల ముత్యము రాయె....లేత మామిడికొమ్మ" అంది. ఆమె పిలుపులోని అర్థాన్ని చిన్నది గ్రహించింది. అన్ని రూపకాలతో తన రూపాన్ని ప్రశంసించిన రాణి సౌందర్య హృదయానికి మురిసి పోయింది. వెంటనే ఇట్లంది.

"వెనుకచెవ్వులు-తమలపాకులు
వెల్లాయి పళ్ళు-పోకలు
రాతిలో మెదడు-సున్నం
రాయిపూరుచెక్క-కాటు
ఇంటివెనుక తంగెడు పూసినపుడు-వెన్నెలకాచినపుడు
పట్నం పాడైనపుడు, అందరు నిద్రించినపిదప
వస్తి పోయె హన్మాండ్ల గుడికి"

వడ్లు దంచుతూ. దర్వ్యమీద దర్వ్యవేస్తూ, సువ్వి పదాన్ని అలా పిస్తూ పైపాట పాడింది చిన్నది. సమయాన్ని చెప్పి సంభారాల్ని కూడా సమకూర్చమంటున్న చిన్నదాని జాణతనానికి,రసిక హృదయానికి రాణీ అలరింది-సెలవు తీసుకుంది-రాజుకు చెప్పింది. రాత్రికి స్వాగతం పలికింది.

జానపద హృదయసాగరాన్ని పరిశోధిస్తే కథాత్మక ప్రహేళికా రత్నాలు కోకొల్లలుగా బయట పడతాయి. ఆ రత్నాల్లో మొదట మొదట కొంతవరకు వైవిధ్యం కనిపించినా రానురాను అన్నీ ఒక్క మూసనుండే సిద్ధంచేసినట్లనిపిస్తాయి. వైదిక వాఙ్మయంలో నిగూఢంగా అంతర్భూతమై ఉన్న ప్రశ్నోత్తర ప్రాయమైన విజ్ఞానం, పౌరాణిక సాహిత్యంలో కథా కథనాత్మకమై విపులంగా పెరిగి ప్రబంధ వాఙ్మయంలో హద్దుల్ని దాటింది.

ఆయాకాలాల్లో ఆయా సందర్భాల్లో కవులు రచించిన కొన్ని శ్లోకాలు కూడా కథను దృష్టిలో ఉంచుకునే కూర్చినవిగా అనిపిస్తాయి. ఆ సంప్రదాయాన్ని అనుసరించి, లోకవృత్తాన్ని గ్రహించి పండిత ప్రోక్త కథాంశ బీజభూతాలైన పద్యాలు కొన్ని కథాత్మకాలైన పొడుపుకథలకు మూలాధారాలయ్యాయి. తెలుగుపొడుపు కథల్లో వేటినీ అనుసరించనివీ, వేటినీ అనుకరించనివే అధికంగా ఉన్నాయి. కనుకనే శిష్టజన వ్యవహృత ప్రహేళికలు స్వల్పంగా, జానపద వ్యవహృతాలత్యధికంగా లభిస్తున్నాయి.

ఈ పొడుపుకథల్లో జానపదులు ప్రయోగించిన నిసర్గ రమణీయాలైన అలంకారాలు కమనీయాలు. ముఖ్యంగా ప్రకృతి చేసిన కైసేత నభూతో నభవిష్యతి. కథాత్మకాలైన ఈ సాంఘిక కాల్పనిక ప్రహేళికల్లో వ్యర్థపదమనేది కనిపించదు. వ్యర్థపద విరహితాలైన పొడుపుకథలన్నీ కవితా శిల్పాన్ని పుణికి పుచ్చుకున్నాయి. ప్రతి కథలోని వక్రోక్తులు వ్యంగ్యవైభవ ప్రధానాలై విరాజిల్లుతున్నాయి. అనేక కావ్యకళారహస్యాల్ని రంగరించుకొన్న కథాత్మకాలైన పొడుపు కథలన్నీ రుచికి పాలమీగడలు-చెరకుగడలు. శుచికి వెన్నెలలు-సువాసనకు దిరిసెనలు, మృదుత్వానికి దూదులు-వెన్న ముద్దలు.

**అధోజ్ఞాపికలు**

1. సహసావిదధీత న క్రియా - మవివేకః పరమాపదాం పదం ।
వృణుతేహి విమృశ్యకారిణం-గుణలుబ్ధాః స్వయమేవ సంపదః॥
కిరాతార్జునీయమ్. [2అ-30శ్లో]

2. ఖరిద. [అష్టాధ్యాయి. 8-4-55]

3. లావొక్కింతయులేదు,ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁదనువుండస్సెన్, శ్రమంబయ్యెడిన్
నీవేతప్పనితః పరంబెఱుఁగ మన్నింపందగుం దీనునిన్
రావే ! యీశ్వర ! కావవేవరద ! సంరక్షింపు భద్రాత్మకా !
[భాగవతము - స్కం: 8-ప 90]

4. ఏమిచెప్పుదున్ గురునాథా ![ఆంధ్రభారతము-శల్య-ఆ. 1,ప401]

5. అరవి వీరభద్రు చరణాహతి దుల్లిన బోసినోటికిన్
నేరడు రామలింగకవి నేరిచెఁబోమన ముక్కుతిమ్మన
క్రూరపదాహతిందెగిన కొక్కిరి పంటికి దుప్పికొమ్ము ప
ల్గారచియించినాడు రవిగాననిచోఁగవిగాంచునెయ్యడన్
[తెనాలి రామలింగకవి హాస్యకథలు - పు 31]

6. తురకమెచ్చుగాడిద తన్ను సంతటమే.
[తెలుగు సామెతలు పు 610]

7. తిత్తులమారి

8. రేగుచెట్టు భాగవతము
[పదబంధ పారిజాతము సం 2, పు748]

9. కుంజరయూధంబు దోమకుత్తుక జొచ్చెన్
క॥ గంజాయిత్రాగి తురకల
సంజాతులఁగూడి కల్లు చవిగొన్నావా !
లంజలకొడకా యెక్కడ
కుంజర యూధంబు దోమకుత్తుక జొచ్చెన్.
క. రంజన చెడి పాండవులరి
భంజనులై విరటు గొల్వపాలై రకటా
సంజయవిధి నేమందును
కుంజర యూధంబు దోమ కుత్తుక జొచ్చెన్

10. కథలెల్ల వెతలాయె - కాపురం రెండాయె
నాడువచ్చిన కుందేలు - రాజుకు వంటాయె (పాఠాంతరం)
[జానపద గేయవాఙ్మయ వ్యాసావళి పు : 34]

# హంసధ్వనిలో అంతరంగం

## "పెన్నా శివరామకృష్ణ"

పొంగి పొర్లే నదీ తీరాన నడుస్తున్నప్పుడు
సుదీర తీరాలనుండి వినిపిస్తుందొక స్వరం-
విరిగి పడే తరంగం అరికాళ్ళను అభిషేకం చేస్తుంది;
మనస్సులో కాళ్ళు తెగిన నెమలి పురి విప్పుకుంటుంది-
పూల దుకాణం దాటుతున్నప్పుడు
ఒక పరిమళ వీచిక కడ కొంగున
కాసేపు ముడివేసుకొని
వేల జన్మల జ్ఞాపకాల
అవ్యక్త వేదనా శిఖరాలమీదకి విసిరి వేస్తుంది.
పూవు చెక్కిలి మీద చందమామను
సానపడుతున్నప్పుడు
ఒక అనుభవం ముళ్ళ తెరై కనుపాపను కాటు వేస్తుంది:
నిశీధి నిస్తంత్రీ వాద్యాన్ని మీటుకుంటూ
రాలి పడ్డ ఎండుటాకు రహస్యాలు వింటుంటే
ఒక అనుభవం చూపై
చర చర నడిచి వెళ్ళే చెమట పట్టిన సూర్యుణ్ణి
వేలెత్తి చూపుతుంది-
స్వరమై, పరిమళమై
అణువులాంటి అనుభవమై
నన్ను వెంటాడే హంసధ్వని
నన్ను నేను తవ్వుకుంటే కనిపించే మరో రూపానికి
ప్రతిధ్వని-

# చుప్పనాతి పెట్టిన చిచ్చు

## చల్లా రాధాకృష్ణ శర్మ



[చూలాలని కూడా చూడకుండా రాముడు సీతను అడవులకు పంపిన కథా ఘట్టం కరకు గుండెను సైతం కరిగిస్తుంది. సీతా పరిత్యాగానికి శూర్పణఖ కారణభూతయైనట్లు జానపదులు కొందరు ఊహించారు. ఈ అంశమే ఈ కథకు ఆధారం.]

పండు వెన్నెల. చల్లనిగాలి. మెత్తని పరుపు. ఎటు చూసినా పచ్చని చెట్టుచేమలు.

శూర్పణఖ మాత్రం నిద్ర పోలేదు. ఎంత ప్రయత్నించినా, కళ్ళు మూత పడలేదు. 'అంతా ఆ సీతమూలంగా జరిగింది' అంటూ మంచంమీదనుంచి లేచికూర్చుంది, ఇలా ఎప్పటైతే. అనుకుందో వచ్చిన నిద్రమత్తు కూడా పోయింది.

సీత మీద మరులు గొనడం వల్లనే గదా వీరాధివీరుడైన మా అన్నయ్య రావణుడు ఈ లోకంనుంచి నిష్క్రమించవలసి వచ్చింది. రామరావణ యుద్ధంలో ఎందరెందరో కన్నుమూశారు. చివరికి కళకళ లాడే లంకారాజ్యం సర్వనాశనమై పోయింది. లంక! ఎంత సుందర మయింది! ఆ సిరిసంపదలు తలుచుకుంటేనే గుండె చెరువై పోతోంది... అనుకుంటూ శూర్పణఖ బాధ పడింది. ఆమె మనస్సు వికలమై పోయింది.

ఉన్నట్టుండి ఆమె అంతరాత్మ 'ఆ సీత సౌందర్యాన్ని నువ్వే గదా దశకంఠుడికి తెలిపి పుణ్యం కట్టుకున్నావు!' అంది. దాంతో ఆమెకు పిచ్చెత్తినట్టయింది. 'అవును నేనే... నేనే... రామ రావణ

యుద్ధానికి కాలకులాల్ని నేనే...' ఈ మాటలు తలవని తలంపుగా ఆమె నోటినుంచి వెలువడ్డాయి. అయితే యీసారి ఆమె బాధపడలేదు దానికి బదులుగా ఈర్ష్య ఆమె మనస్సుని ఆవరించింది. ఆమె మరీ పిచ్చిదైపోయింది. యుక్తాయుక్తజ్ఞానాన్ని పూర్తిగా కోల్పోయింది. సీత అంటే మండిపడ సాగింది.

రావణుడు నశించిన తర్వాత.... లంకారాజ్యం నాశనమై పోయినతర్వాత... సీత అయోధ్యానగరంలో అంతఃపురంలో సకల రాజ్య భోగాలూ అనుభవిస్తూ హంసతూలికా తల్పాన నిశ్చింతగా శయనించడమా!... చుప్పనాతి తనం శూర్పణఖని వశపరచుకుంది. పశువుగా మార్చివేసింది.

ఆ రాత్రి ఎలాగో గడిచిపోయింది.

మామూలుగానే తెల్లవారింది. అయితే శూర్పణఖ పూర్వపు శూర్పణఖ కాదు. యోగిని! ఆ కాషాయాంబరాలు... మెడలో ఆ రుద్రాక్షమాలలు.... చేత కమండలం... అచ్చం యోగినిలా ఉంది. ఆమె యిప్పుడు శూర్పణఖ అంటే తెలిసిన వాళ్లుకూడా నమ్మరు

"ఎక్కడికమ్మా అంత త్వరత్వరగా వెడుతున్నారు" అడిగింది చెలికత్తె.

"శకునపక్షి! నీ పని చూసుకో"

శూర్పణఖ చరచర నడిచి వెడుతోంది. ముఖం నిప్పులా వెలుగుతోంది. కళ్ళు నిప్పులు చెరుగుతూ వున్నాయి.

ఆమె అయోధ్యానగరంలో అడుగు పెట్టేసరికి బారెడు పొద్దెక్కింది నగరంలో ఎటుచూసినా నవచైతన్యం. నగర పౌరులువిధ్యుక్త ధర్మనిర్వహణలో నిమగ్నులై పోయారు, వారంతా ఎంత సంతోషంగా తృప్తిగా వున్నారని! ఏడుపు ముఖం ఒక్కటైనా కనిపించలేదు. అది చూసేసరికి, ఆమెకు కన్ను కుట్టింది.

యోగిని వేషంలో ఉన్న శూర్పణఖను నగరపౌరులు పిన్నా పెద్దా ఆదరపురస్సరంగా చూశారు. చేతులెత్తి నమస్కరించారు. ఒక్క క్షణం ఆమె తన్నుతాను మరిచిపోయింది. ఎన్నడూ కలగని సంతోషం కలిగిందామెకు. ఇది రామరాజ్యమహిమ కాబోలు- అనుకుంది.

వెంటనే తాను వచ్చిన పనిని గుర్తు చేసుకుంది.

రాచనగరు వైపు నడిచింది. ఆ వీథుల అందచందాలూ అవేమీ ఆమెకి కనిపించలేదు.

ఎవరో యోగిని తనను చూడడానికి వస్తున్న విషయం అంచెలు అంచెలుగా రాముడిదాకా పాకింది. ఎక్కడికో సపరివారంగా బయలు దేరిన ఆ రాజు ఆమెను దర్శించి వెడదామనుకున్నాడు. ఆమె రాక కోసం వెయ్యికళ్ళతో ఎదురు చూడసాగాడు.

ఇంతలో రాజభటులు యోగినిని రామునివద్దకు తీసుకువచ్చారు. ఆదరపూర్వకంగా అర్ఘ్యపాద్యాదులు ముగిసినతర్వాత, ఆమెను ఉద్దేశించి రాముడు కుశలప్రశ్నలు వేశాడు.

రాముణ్ని చూసీ చూడగానే యోగిని అవాక్కయింది, అతని జగన్మోహనాకారాన్ని తిలకిస్తూ శిలలా కూర్చుండిపోయింది. 'ఈమెను సీతవద్దకు తీసుకు వెళ్ళండి' అని ఆజ్ఞాపించి యోగినివద్ద సెలవు తీసుకుని రాముడు పరివార సమేతుడై వెళ్ళిపోయాడు.

సీత నివసించే మందిరం ప్రవేశించింది యోగిని సీత చేసిన సపర్యలకూ, చూపిన భక్తిభావానికీ ఆమె పరమానంద భరితురాలు అయింది. అన్నెమూ పున్నెమూ యెరుగని ఆ అమాయకురాలికి అపకారం తలపెట్టడం అవాంఛనీయ మనుకుంది, వచ్చిన దారినే వెడదామనుకుంది. కానీ మరుక్షణంలోనే శూర్పణఖ అయింది.

యోగిని సమక్షంలో రకరకాలస్వాదుఫలాలూ, రంగురంగుల పట్టుపుట్టాలూ ఎన్నో సీత ఉంచింది, స్వీకరించి అనుగ్రహించండి అన్నట్టుగా చూసింది. కానీ యోగిని దృష్టి వాటిమీద పడలేదు. ఆమె తృప్తిచెందక పోవడం చూసి, తనవల్ల ఏం అపచారం జరిగిందో అని సీత తల్లడిల్లి పోయింది.

"అమ్మా! తమ కోరిక యేమిటో సెలవిస్తే సంతోషిస్తాను" అంది సీత దీనంగా.

యోగిని మౌనం వహించింది.

"నావల్ల తమకెలాంటి అపచారమూ జరగలేదుగదా?"

"రావణుడి చెరలో ఎన్నాళ్ళున్నావు?" అడిగింది యోగిని.

ఏమిటీ ప్రశ్న! అనుకున్నారు సీత చెంత వున్న చెలికత్తెలు. రావణుడి పేరు వినగానే సీత కైతే ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకి నట్లనిపించింది. చీకట్లో జడలు విరబోసుకున్న దయ్యాన్ని చూసి నట్లనిపించింది.

"లంకలో ఎన్నాళ్ళున్నావు?" మళ్ళీ యోగిని ప్రశ్న వినిపించింది.

సీత అనిష్టంగా చెప్పింది. "సుమారు పదినెలలు"

మౌనం అలుముకుంది.

"సీతా"

"ఊఁ"

రావణుడు ఎలావుండేవాడో చెబుతావా, వినాలనివుంది - "

సీత విస్తుపోయింది. ఆమె నఖశిఖపర్యంతమూ గగుర్పొడిచింది... ఈ ప్రశ్న వేసిన యోగిని నిజంగా యోగినా (కాదా?) అని సంశయించింది.

నువ్వు నీనోటితో చెప్పవద్దుగాని, రావణుడు ఎలా వుండేవాడో బొమ్మవేసి చూపించు- అది చాలు"

సీతకి సహనం నశించింది. ధైర్యమంతా కూడగట్టుకుని "ఆ దుర్మార్గుణ్ణి నేనుకన్నెత్తి అయినా చూడలేదు." అంది.

దేవతా విగ్రహాన్ని చూసినట్టుగా సీతను చూశారు" చెలికత్తెలు.

యోగిని హతాశురాలయింది. అయినా తెచ్చుకున్న ధైర్యంతో, విషపునవ్వు ఒలకబోస్తూ, "నా సంతోషం కోసం గుర్తున్నంతవరకూ బొమ్మగీస్తే చాలు." అర్థించింది యోగిని.

"ఆవిడ అంతగా అడుగుతుంటే, బొమ్మ రాయగూడదా ?" అంది చనువుగా ఒక చెలికత్తె.

"ఆ రావణుడు ఎలా వుంటాడో మాకూ చూడాలని వుంది" అంది మరో చెలికత్తె.

"చూశారా. మీ చెలికత్తెలే ముచ్చట పడుతున్నారు." అంది యోగిని, మరింత ధైర్యంగా.

"ఆ దుర్మార్గుణ్ణి చూడంది నేనేం రాయను బొమ్మ" అని చెలికత్తెల్ని చురచుర, చూస్తూ సీత రావణుడి కాలిబొటనవేలు మాత్రం రాసింది.

భుజాలు ఎగురవేసుకుంటూ ఆ బొమ్మను తీసుకుని, యోగిని సీతవద్ద అనుజ్ఞ తీసుకుని, తన బసకు వెళ్లిపోయింది.

ఆ తర్వాత శూర్పణఖ రావణుడి బొమ్మను పూర్తి చేసింది. ఆ బొమ్మకు ప్రాణం పొయ్యమని బ్రహ్మదేవుణ్ణి అర్థించింది. జాలిపడి అందుకు సరే అన్నాడు బ్రహ్మ. రెండో కంటికి తెలీకుండా శూర్పణఖ ఆ బొమ్మను తీసుకువచ్చి సీత మంచంమీద దిండు కింద ఉంచింది. తన దారిని తాను వెళ్లిపోయింది. తన కోరిక నెరవేరుతుందనే సంతోషం కొద్దీ మరీ వెళ్ళిపోయింది.

శూర్పణఖ వెళ్లిపోయిన కొంతసేపటికి రాముడు అంతఃపురానికి వచ్చాడు. రావణుడి బొమ్మను రాయమని ? యోగిని సీతను వేధించుకు తిన్న విషయాన్ని ఎవ్వరూ ధైర్యం చేసి రాముడితో చెప్పలేదు. చెపితే యేమనుకుంటాడో యేమో అని భయపడ్డారు. చెప్పాలని సీతకూ అనిపించలేదు.

ఆ రాత్రి సీత తన శయ్యా మందిరం చేరుకుంది. ఆమె వెనకాలె రాముడూ వచ్చాడు.

సీత మంచం దగ్గిరికి వెళ్లగానే, "రా, లంకకు రా" అంటూ మాటలు వినిపించాయి. ఆమె భయంతో వణికిపోయింది. రాముడు ఆశ్చర్యచకితుడయ్యాడు.

"రా, లంకకు రా" అని మళ్ళీ వినిపించాయి మాటలు, యీసారి మరింత స్పష్టంగా.

కాళ్లకింది నేల కంపించినట్లనిపించింది సీతకి. మనస్సులో రామనామ స్మరణ చేసుకుంది. దారీ తెన్నూ తోచక.

దిండు కింది బొమ్మ మౌనం వహించింది.

పీడ విరగడ అయినందుకు సీత సంతోషించింది.

రాముడి కిదంతా వింతగా తోచింది. మంచం మీది పరుపుని సూక్ష్మంగా చూశాడు. అటూయిటూ పరికించాడు. దిండుని పైకి తీశాడు. రావణుడి బొమ్మ.

ప్రసన్న వదనుడైన రాముడు ప్రళయకాల రుద్రుడయ్యాడు. ఆ భీకర మూర్తిని సీత చూడలేకపోయింది. నేలమీది చేపపిల్లలా మనస్సు గిజగిజ లాడింది

"నేను ' ఏ పాపమూ యెరుగను....ఆ దుర్మార్గుడి బొమ్మ యిక్కడి కెలా వచ్చిందో నాకు తెలీదు...." సీత విలపించింది. పొద్దున మీరు పంపించిన యోగిని కుట్ర కావచ్చు యిదంతా...." అంటూ యోగిని వింతకోరికను తెలియజేసింది.

రాముడి కేమీ వినిపించలేదు.

ఇంతలో సీత చెలికత్తెలు అక్కడికి వచ్చారు. పొద్దున జరిగిన విషయాన్ని పూస గుచ్చిన విధంగా చెప్పారు. సీత నిర్దోషి అన్నారు. ఆమె కేమీ తెలియదన్నారు.

రాముడి కేమీ వినిపించలేదు. ఎవరి మాటలూ వినిపించుకునే స్థితిలో లేడు.

ఒక్క నిమిషంలో అంతఃపురం శోకపూరిత వాతావరణంతో నిండిపోయింది. అంతఃపురాంగనలు శిలావిగ్రహాలయ్యారు.

సీత కళ్లలో ఒక్క నీటి చుక్కకూడా-మిగల లేదు. చలనం లేని బొమ్మలా కనిపించింది. ఆ బంగారు బొమ్మ!

క్షణ క్షణం చింతనిప్పులవుతున్న, ఆ నీలమేఘశ్యాముని నయనాలను అక్కడున్నవారు చూడలేకపోయారు.

"లక్ష్మణా !" అన్నాడు రాముడు. మిన్ను విరిగి మీదపడ్డట్టుగా తోచింది. వెయ్యి పిడుగులు ఒక్కసారిగా పడ్డట్టు అనిపించింది. వందలకొద్ది పెనుతుఫానులు వీచినట్టు తోచింది.

"అన్నయ్యా !" భయభ్రాంతుడైన లక్ష్మణుడు సోదరుణ్ణి సమీపించాడు. అడుగులో అడుగు వేసుకుంటూ.

రాముడు ఏమిటో చెప్పాడు. ఆ రామానుజుడు తల వంచుకున్నాడు. కళ్లల్లో నీళ్లు తిరగగా, బదులేమీ చెప్పకుండా, వంచిన తలను పైకెత్తకుండా అతను వెనక్కి తిరిగాడు.

ఎక్కడో దూరాన గుడ్లగూబల కూతలు వినిపించాయి. ఎవ్వరో విషపునవ్వులు నవ్వుతున్నట్టు అనిపించింది.

ఆ చీకటి రాత్రి ఎలా గడిచిందో యేమిటో !

ఆ మర్నాడు.

"సీత చూలాలు...."

"ఆమెను బాధించడం మంచిది కాదు...."

" ఏ పాపమూ ఎరగని స్త్రీని యిలా తిప్పలు పెట్టడం న్యాయం కాదు..."

అంతఃపురాంగనల యీ మాటలు ప్రత్యూష పవనాలలో కలిసిపోయాయి.

ముందు లక్ష్మణుడు.... వెనక సీత....రథం అడవుల వైపుగా వెడుతోంది.

దిష్టిబొమ్మలా రాముడు సింహాసనం మీద ఆసీనుడై వున్నాడు.

# వ్యథాంజలి

## దిలావర్

ప్రాక్తన సత్యధర్మములె ప్రాపు, యహింసయె యాయుధమ్ముగా
రక్తపు బిందువేనియును రాలక ధర్మరణాన దేశమున్
ముక్తము జేసి మాతృ ఋణ ముక్తుడ వైతివి ధన్యజీవి! నీ
శక్తి నెరింగియున్ కుటిల సంగర రంగము జొత్తు రేలనో !

ఒక చేతన్ ధరియించ బావురములెన్నో శాంతితో, వెండి వే.
రొక చేతన్ యుసి గొల్ప డేగల మహా రూక్షారుణా వీక్షణన్,
ఒక నోటన్ యహి రాజు వోలె తగ యెన్నో నాల్కలన్ లీలగా
ప్రకటింపన్, కడునేర్చినాము కపటోపాయంబు లెన్నేనియున్.

నెయ్యపు రాట్నమున్ వడకి నేసిన జాతిసమైక్య వస్త్రమున్
ప్రయ్యలు జేసి దుఃఖమను వార్ధి మునింగియు గొంతు లేక పూ
శయ్యన బవ్వళింపనుచు చాటగ నోడరు! యింతనోచి యి
ట్లొయ్యన యే ఫలంబు గనుటోయని తల్లడ మందరే మదిన్!

అనదల కంటి పాపవుగ; ఆశల దివ్వెగ; చిమ్మచీకటుల్
అనుపమ దీక్షతో తరిమి; అంటగ రాని తనంబు బాపి, మ
మ్మనయము రక్షసేయగ - అమానుష భావ తమస్సునన్ మహా
చెనటి యొకండు ఆ వెలుగు చీకటి పాలుగ జేసె మూర్ఖతన్.

పోయిన వాడవై బ్రతికి పోయితివయ్య మహాత్మ! లేనిచో
పోయెడి నంతదాక నిను పోరి, విపత్తుల గూరి యుండమే ?
మాయను మున్గియున్న తరి మానవులెల్లెరుగంగ నేర్తురే
పాయము జేసితో మహాత సత్యపథమ్మును జూపియుంటివో !



(గతసంచిక తరువాయి)

సరస్వతి వింటున్నది. భ్రమతో కళ్లుచెదిరి, తెలియకుండానే తాను అడుసులో కాలువేయబోయింది. ఏ అంతరాత్మో అడ్డుపడకుండా ఉంటే, తానుకూడా రోజ్‌కిమల్లే ఊబిలో....

"సరూ! మన బాస్‌కి నావంటివారు చాలమంది, లండను, న్యూయార్కు, పారిస్ మొదలయిన నగరాలలో హోటలురూముతోబాటు ఒక ఆడదానిని కూడా తప్పకుండా బుక్‌చేస్తారు, అయితే రాజ్‌కుమార్‌లోని గొప్పదనమేమంటే, ఎవరితో ఆయన ఉంటే ఆమె ఒక్కతే తను మనసార ప్రేమించిన స్త్రీ అని అనిపించేటట్లు ప్రవర్తిస్తారు. ఈ మనిషిని అర్థం చేసుకోడం చాలకష్టం."

"రోజ్!

సత్యనారాయణ లోపలికి వచ్చాడు.సాధారణంగా ఆడవాళ్ళ గదిలోకి ఎవరూ మగాళ్లు ప్రవేశించరు. కాని ఈ ఒక్కడూ అప్పుడప్పుడూ దారి తప్పుతుంటాడు.

"రోజ్! మీకోసం ఛీఫ్ ఆర్కిటెక్టుగారు అరగంటయి వెదుకుతున్నారు. వేగంగారండి."

రోజ్ లేచిపోయింది. వానిటీబాగ్‌లోని లిప్‌స్టిక్‌తో పెదవులు దిద్దుకుంది. ముఖం పవ్‌చేసుకుంది. గౌనుకుచ్చెళ్లు సరిచేసుకొని, జెట్టు బిగించుకొని గదిలోంచి వెళ్ళిపోయింది.

గదిలోంచి వెళ్తున్న సత్యనారాయణవేపు సరస్వతి చూచింది. ఇది ఒక జూ! పనిచేస్తున్నవాళ్ళు వన్యమృగాలు. అందులో వెంకునాయుడు పులివంటివాడు. ఈ సత్యనారాయణ రేచుకుక్కలాంటివాడు. పులిని ఎదిరించేశక్తి రేచుకే ఉంది. కాబట్టి సరస్వతి సర్కసులోని ఆడ లర్టిస్టువలె ఏరీనాలోకి పులినీ రేచుకుక్కను వదలి తమాషా చూడాలి.

అప్పుడామెకు నవ్వు వచ్చింది.

మామూలు మృగాలమధ్య కలహం తెచ్చిపెట్టవచ్చు.

కాని మృగరాజు నోట్లోపడకుండా ఉండడమెలా?

## 15

"మూర్తిమామయ్య ఇప్పుడు సినిమాపాటఒక్కటిపాడుతాడు" అనౌన్సు చేశాడు మైక్‌మీద శంకరయ్య.

షిప్‌యార్డు సివిలింజనీరింగ్ డిపార్టమెంట్‌లోని ఇంజనీర్లు, ఇనస్పెక్టర్లు వారి కుటుంబాలతో పిక్‌నిక్‌కి వచ్చారు. విశాఖపట్నం జూకి సమీపంలోగల ప్రయివేటు గార్డెన్సులో ఈ పిక్‌నిక్ ఏర్పాటులు జరిగాయి. ప్రొద్దున్న ఆరుగంటలకు లక్జరీబస్సులో ఆడ, మగ కలిసి అరవైమంది జగదంబ జంక్షను దగ్గిర బయలుదేరి ఈ ప్రయివేటు గార్డెన్సుకి వచ్చారు.

పొద్దున్న ఎనిమిదిన్నరతో టిఫిన్ కాఫీలు అయిపోయాయి. తరువాత పిల్లలు ఆటలు జరిగాయి. వాటి అన్నిటిలోను సత్యమూర్తి చాల ముఖ్యపాత్ర వహించాడు. సరస్వతి కూడా వచ్చింది. మధ్యాహ్నం వడ్డనలలో మూర్తికి సహాయం చేసింది. భోజనాల తరువాత చాలమంది పేకాటలో కూర్చున్నారు. కొంతమంది వయసులోనున్నవాళ్ళు భార్యలతో దూరదూరంగా ఏచెట్టుక్రిందకో పోయి చేరారు.

సరస్వతి, మూర్తి ఒకే యింట్లో చాలకాలమయి నివసిస్తున్నా కొత్తవాళ్ళకుమల్లే యాంత్రికంగా రోజులు గడుపుతున్నారు. వాళ్ళ మధ్య ఒకటి రెండు వాక్యాలకన్న అంతరంగికమైన సంభాషణకూడా లేదు. అటువంటి తరుణంలో మూర్తి పిక్‌నిక్ గురించి చెప్పాడు. తన

కెవరూ తెలియరని సరస్వతి అంది. కాని తప్పని సరి అవడం చేత మూర్తిని అనుసరించింది.

పిక్‌నిక్‌లో సరస్వతి ఒక విషయం గుర్తించింది. చాలమంది ఆఫీసర్లు, వారిభార్యలు, పిల్లలు మూర్తితో చాల చనువుగా మాట్లాడు తున్నారు. అతనుకూడా అరమర అభ్యంతరాలేకుండా చాలా స్వేచ్ఛగా వారిమధ్య సంచరిస్తున్నాడు. పిల్లలు పదేపదే అతనివెంట బడుతున్నారు. ఆడవాళ్ళు చాలపరిచయమున్నట్లు, జోకులు వేసి అతనితోబాటు నవ్వుతున్నారు. సహోద్యోగులు అతనిపట్ల ఆప్యాయత చూపిస్తున్నారు. తనకి ప్రపంచమంతా కొత్త. పెళ్ళయిన ఇన్నినాళ్ళకు మొదటిసారి అందరినీ కలియడానికి అవకాశం కలిగింది.

ఇద్దరూ శరీరాలు తగులుతూ నడచి నడచి ఒక మామిడిచెట్టు నీడలో కూర్చున్నారు.

"సరస్వతీ! ఈ ఏకాంతమయిన స్థలంలో అందరు జంటలకు మల్లే మాట్లాడుకోవాలేమో! నీకేమీ అభ్యంతరం లేదుకదా?"

"లేదు బావా!"

"కొంతకాలంక్రింద జరిగిన సంగతి ఒకటి చెప్తాను. అప్పుడు పన్నెండుగంటలవేళ అయింది. పండుగ యింకా ఐదురోజులే ఉంది. అది పుష్యమాసం కాబోలు. మేడమీదిహాలులో పట్టెమంచంమీద ఒక పద్దెనిమిదేళ్ళపడుచు నిద్రపోతున్నది. ఆరోజే తలంటిపోసుకుంది. ఆ కురులు చెదిరిపోతున్నవి. సాంబ్రాణీ పొగలలో ఆరిన జుత్తేమో! చక్కని సుగంధం వస్తున్నది. జడలోతురుముకున్న అకుపచ్చరేకుల సంపెంగ పూలదండ నలిగి మందమైన పరిమళం గాలిలో తేలియాడు తున్నది. ఆమెముఖం ప్రాతర్వికసితపద్మమట్లు మనోహరంగా ఉంది. ఒంటరిగా నిద్రిస్తున్న ఆ సౌందర్యరాశిని తనివితీరా చూచే యువకుడికి ఎటువంటి కోరికలు కలుగుతాయి?"

సరస్వతి మూర్తిముఖంలోకి చూచింది. ఏమీ జవాబుచెప్పలేదు.

"కామంతోనిండిన కోరికలు కలగడం సహజం అది వయస్సు యొక్క ధర్మం. కాని ఆయువకుడికి అటువంటి కోరికలేవీ కలుగ లేదంటే లోకం నమ్ముతుందా?"

సరస్వతి సందేహంతో చూచిది.

"ఆ సౌందర్యరాశి సామీప్యంలో అతని కొక అనిర్వచనీయ మైన మనశ్శాంతి లభించింది. మనస్సును బాధించే ఎన్నో సమస్యలు ఆమె ముఖంలోకి చూస్తుంటే వాటికవే పరిష్కరింప బడినట్లయింది. నిద్రలో ఆమె పెదవులపై చిన్నినవ్వు నాట్యం చేస్తే అతని హృదయం వేయి కౌముదుల కాంతితో నిండినట్లయింది. ఇటువంటి యువతి భాగస్వామిని అయితే జీవితం చరితార్థ మవుతుంది. ఆమె ముఖం లోకి చూస్తుంటే, ఆ కదిలే ముంగురులు, బెదిరే కనుల్, గులాబులు పొదగిన కపోలాలు, ఎరుపెక్కిన పెదవులు - ఇవన్నీ వయసున్న కవ్వించాయి.

"అలా చూస్తుంటే కాలం చాల వేగంగా గడిచిపోయింది. అంత చక్కని ముఖం భయంతో ఒకసారి వివర్ణమయి, భీతితో కంపించింది. ఆమెకు పీడకల వచ్చినట్లయింది. ఆమె మంచం మీదనుండి పడిపో తుందేమోనని లేచిపోతున్న ఆమె చేతులు పట్టుకున్నాడాయువకుడు. వంగి ఆమె ముఖానికి సమీపంగా వచ్చినప్పుడు ఆమె ఊర్పులు చెంప లకు తగిలి గిలిగింతలు పెట్టినట్లయింది. వయసులో నున్న పడుచును ఆ విధంగా స్పృశించవచ్చా? భయపడినప్పుడు ధైర్యం కలుగజేయ డానికి, ప్రమాదం కలుగకుండా నివారించడానికి ఒకప్పుడు మర్యా దను అతిక్రమించవలసి వస్తుంది. కాని, ఆమెకు ఏవిధంగా తన నిర్దో షిత్వాన్ని తెలియజేయగలడు. అందుచేత ఆమె తప్పుగా అభిప్రాయ పడినా జవాబు చెప్పలేకపోయాడు! ఆ కోపంలో కూడా, ఆమె



బస్సు కదిలిన తరువాత, జోకొట్టినట్టయి, సరస్వతి బలమయిన మూర్తి భుజం మీద తల వాల్చింది.

## 16

"మామా" సరస్వతి మృదువుగా సత్యనారాయణను పిలిచింది.

సత్యనారాయణ పరమానందభరితుడై పోయి, సరస్వతివేపు తిరిగి ఒక అడుగు ముందుకు వేశాడు.

"మామా ఒంటిగంట సమయంలో స్టోరువేపు ఒకసారి రాగలవా? ఇద్దరం ఒకేచోట పనిచేస్తున్నా ఇంటి సంగతులు తెలుసుకోడానికి అవకాశం లేకుండా పోయింది ఇవాళ యండీగారు లేరట ఊరికెళ్ళారు" అంది సరస్వతి.

"తప్పకుండా వస్తాను. చాల సంగతులు నీతో మాట్లాడాలని అనుకుంటున్నాను, కాని ఎప్పుడూ వీలుపడి చిక్కడంలేదు. ' యండీగారు ఉంటే అసలే వీలుపడదు. అయినా ఇక్కడ సంసారిగా నీవు కొన్నప్పుడు ఎలాచెప్పు."

"అవును మామా! నేను చూస్తున్నానుకదా! నీకుసుతరామూ తీరుబడి ఉన్నది లేదు. అందుచేత ఇవాళ వీలవుతుందేమోనని". అంది సరస్వతి చిన్నగా నవ్వి.

ఇంతలో ఎవరోవస్తుంటే సరస్వతి మొదటి అంతస్తు దిగి స్టోరు వేపు వెళ్ళిపోయింది.

సరస్వతి స్టోరులోకూర్చుని కాగితాలు తిరగేస్తున్నది. పన్నెండున్నర అయింది. వెంకునాయుడు తప్పకుండా వస్తాడు. కొన్ని ముఖ్యమైన సామాన్లు పొద్దున్న తీసుకొనివెళ్ళవలసి ఉంది. వాడు ఇంకా రాలేదు.

వాచీ ముళ్ళు తిరుగుతున్నాయి. ఒంటిగంటకు ఐదు నిముషాలే వ్యవధి ఉంది. రిజిష్టర్లు మూసి టిఫిన్ రూమ్‌కి వెళ్ళాలని సరస్వతి లేచింది.

"ఏయ్ సరస్వతీ! ఎక్కడికెళ్తున్నావ్?" వెంకునాయుడు స్టోరు ద్వారం దగ్గిర దారికి అడ్డంగా నిలబడ్డాడు.

సరస్వతి జవాబు చెప్పలేదు. రిజిస్టరులు సరిగా దొంతి పెట్టున్నది.

"ఏయ్! సరస్వతీ! జవాబుచెప్పవేం?" మీసాలు నులిపెడుతూ వెంకునాయుడు గట్టిగా అన్నాడు.

సరస్వతి జవాబు చెప్పలేదు. రిజిష్టర్లు బీరువాలోపెట్టి తాళం వేసింది. ఆమె వాచీ చూచుకుంది. ఒంటిగంటసరిగా అయింది,

"ఏయ్! సరస్వతీ! వెంకునాయుడుతోనా నీ ఆటలు."

సరస్వతి వెంకునాయుడువేపు చూచింది. ఆమె కళ్ళలో నిప్పుకణాలు రేగుతున్నవి. రెండడుగులు ద్వారంవేపు నడిచింది.

"స్టోరు సామాను లివ్వకుండా ఎలా వెళ్తావో చూస్తాను చెప్పు." నాయుడు ఈ మాటముగించాడోలేదో, సత్యనారాయణ కాలూపుకుంటూ వెంకునాయుడిని పక్కకు తోసి లోపలికివచ్చాడు.

"సరస్వతీ! రథ పేమిటి?" సత్యనారాయణ అడిగాడు

"కథసకేంలేదు మామా! ఈ పెద్దమనిషి సామాన్లకోసం వచ్చాడట. టిఫిన్ టైమయింది. స్టోరుమూసి వెళ్ళిపోవాలంటే అడ్డుగా నిలబడుతున్నాడు."

"నాయుడూ! రెండు తరువాత రా! ఇప్పుడేమీ ఇవ్వదు"

"పోవయ్యా సొట్టకాలు పంతులూ! ఈ సరస్వతి ఎందుకివ్వదో చేస్తూ చూస్తాను."

"మామా! పద! తాళం వేసుకొని పోదాం.'

"ఏయ్! సరస్వతీ!"

"వెంకునాయుడూ! మర్యాద తెలీదా! నువ్వు కామన్‌వర్కరివి. ఈమె మీ మీద గుమాస్తా. ఆమె నీయింటిమనిషి కాదు.

"రౌడీలకు మంచి మర్యాదలేంతెలుస్తాయి మామా! రా పోదాం."

"బజారుపట్టిన ఆడవాళ్ళకు ఉద్యోగమిస్తే ఇలా ఉంటుంది."

సరస్వతి హాండ్‌బాగ్‌తో వెంకునాయుడిముఖం మీద కొట్టింది

"అంతపొగరుగా ఉందా!" వెంకునాయుడు సరస్వతి మీదకు రాబోయాడు.

"నాయుడూ! ఆగు! అర్ధదానిమీద చేయి వేసుకుంటే చంపేస్తాను."

"పోరా కుంటిదొరవా! తిన్నగా నిలబడడానికి సత్తువలేని వాడివి నాకా అడ్డుపడేది."

సరస్వతి ఇటువంటి పరిస్థితిని ఊహించి ఒక ఇనుపరాడ్డు ముక్కను దగ్గిరగా ఉంచుకుంది. సత్యనారాయణ కంట అది పడింది. వంగిదాన్ని తీసుకొని వెంకునాయుడుమీదికి విసిరాడు, దానిని తప్పించుకోవాలని నాయుడు పక్కకు తప్పుకున్నాడు — సరస్వతి ద్వారంనుండి బయటికి నడిచింది. ఇంతలో నలుగురయిదుగురు పని వాళ్లువచ్చారు.

స్టోరులోపల రెండు అడవి జంతువులు దెబ్బలాడుకుంటున్నవి. సరస్వతి అరుపులు, కేకలు వింటున్నది. కొంచెంసేపటిలో కాలికి దెబ్బతగిలి వెంకునాయుడు, ముఖమంతా పిడిగుద్దులతో వాచిపోయి సత్యనారాయణ వెలుపలికి వచ్చారు. చుట్టూచేరినవాళ్ళు విడిపించబట్టి అంతటితో సరిపోయింది.

"వీడి అంతేదో నేను చూస్తాను" బుసలుకొడుతున్నాడు సత్యనారాయణ.

"నీ అంతు నేను కనుక్కుంటాను." వెంకునాయుడు నిప్పులు చెరుగుతున్నాడు.

సరస్వతి చేతి వాచీచూసుకుంది. ఒంటిగంటన్నర కావచ్చింది. టిఫిన్ డబ్బీ పట్టుకొని ఫ్లాస్కు భుజానికి తగిలించుకొని, స్టోరు తలుపులువేసి, తాళంబిగించి, మొదటి అంతస్తుమెట్లవేపు నడిచింది.

టిఫిన్ ముగించినవాళ్లు ఒకరూ, ఒకరూ వెళ్ళిపోతున్నారు. టైపిస్టు రుక్మిణి కాఫీ తాగుతున్నది.

"హలో! రుక్మిణీ! ఈ మధ్య కనిపించలేదు!" సరస్వతి పలకరించింది.

"అవునండీ! మా నాన్నగారు పెళ్ళిసంబంధాల కని విజయవాడ తీసుకొని వెళ్లారు."

"అరే! సత్యనారాయణ ముహూర్తాలకోసం తొందరపడుతున్నాడే, మీరేమిటి ఇలా అంటున్నారు?"

"మీరుకూడా వేళాకోళమాడుతున్నారా?"

"లేదు. అతనే నాతో స్వయంగా ఇవాళ పొద్దున్న చెప్పాడు."

"కుంటి సత్యనారాయణను చేసుకోడంకన్న నిప్పులోదూకి చావటం మేలు. వీడు రోజురోజూ నా వెనుకబడి, భయపెట్టి పెళ్ళి చేసుకోమని బలవంతం చేస్తున్నాడు."

సరస్వతి నవ్వింది.

"యండిగారితో చెప్పి నాకు ప్రమోషనిప్పిస్తానని ఒకసారి అంటాడు, ఒకసారి నా ఉద్యోగం పీకించేస్తానని, నన్ను సమూలంగా నాశనం చేస్తానని అంటాడు. వీడిమూలాన్న ఉద్యోగం మానుకోవాలేమో!"

"మీకు అన్నలుకాని, చదువుకుంటున్న తమ్ముళ్ళుకానిలేరా?"

"మా తమ్ముడు ఇంటరు చదువుతున్నాడు."

"అయితే ఒకసారి ఆ కుర్రాడితో ఈ విషయం చెప్పిఉంచండి సమయం వస్తే అతడు సహాయపడతాడు."

ఇంతలో రోజ్ వచ్చింది.

"సరూ ఎందుకింత లేటయింది ?"

"రెండు అడివి మృగాలు దెబ్బలాడుకుంటుంటే చూస్తున్నాను. అందుచేత ఆలస్యమరుుంది."

"ఇవాళ పెద్ద బాసులేరుకదా అని ఒంటిగంట నుంచి నీకోసం చూచాను. నువ్వురాకపోగా, అర్జంటు లెటరు టైపు చేయడానికి వెళ్ళిపోయాను. ఇవాళ ఏంతెచ్చావు ?"

"మా అత్త పెరుగు గారెలు పెట్టింది."

"వెరీ గుడ్"

ఇద్దరూ కూర్చున్నారు, టిఫిన్ తినడానికి.

"సరూ మొన్న మన పిక్నిక్ గురించి నీ అభిప్రాయమేమిటి?"

సరస్వతి రోజ్ ముఖంలోకి చూచింది.

"ఇది మన బాస్‌లు, వాళ్ళ పెళ్ళాలు తమ స్టాఫ్‌తో కలిసిమెలిసి తిరగడానికి ఏర్పాట్లు చేసినట్లు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరుగారు అన్నారు. వెల్‌ఫేర్ ఫండులో నాలుగు వేల రూపాయలు ప్రతీ సంవత్సరం ఇటువంటి ఫంక్షన్లకు కేటాయిస్తారు. కాని ఇది పెద్దవారి పెళ్ళాలను పని వాళ్ళ ఎదురుగుండా పెరేడ్ చేయించినట్లే నాకనిపించింది. ఈ పిక్‌నిక్‌లో ఎవరెవరము కలియలేదు. ఎవరి స్టేటస్‌ను బట్టి వాళ్ళు గ్రూపులుగా మారారు." అంది రోజ్.

"నాకేమీ అర్థంకాలేదు. క్రిందటివారమే నేను షిప్‌యార్డు వాళ్ళ పిక్‌నిక్‌కి వెళ్ళాను. అక్కడ చీఫ్ ఇంజనీరు భార్యపిల్లలచేత ఆటలాడించింది. స్వయంగా వడ్డనలో పాల్గొంది. ప్రత్యేకంగా ఒకస్వీటు చేయించి తెచ్చి అందరికీ పంచిపెట్టింది. మన పిక్‌నిక్ మాత్రం మరోలాఉంది"

"బాస్ గారి భార్య, రామాచారిగారి భార్య ఏవోమాటలు — వాళ్ళ సంతానంతో ఆటలు. నీతోగాని, నాతోగాని మాట్లాడిన పాపాన్న పోలేదు కదా !

సరస్వతి కాఫీ కప్పుకడిగి,అక్కడనున్న అల్మారాలో పెట్టింది.

"సరూ నాకి పిక్‌నిక్‌లంటే తలనొప్పి. హాయిగా ఆదివారం పడుకోడానికి వీలులేకుండా అయింది."

"రోజ్ ! నేనుకూడా అదోవిధంగా ఇబ్బంది పడ్డాను. ఎందుకు వచ్చానా అనిపించింది."

రోజ్‌లేచి ముఖం పఫ్‌చేసుకుంది. పెదవులు దిద్దుకుంది లిప్‌స్టిక్‌తో.

"సరూ ! అర్జంట్ లెటరు. వెళ్లి అరెండో బాస్‌కివ్వాలి."

సరస్వతి మరో పది నిముషాలు పిక్‌నిక్ సంగతులు ఆలోచిస్తూ కూర్చుంది. రామాచారి గాని, మనోహర్ గాని వాళ్ళ భార్యలను తనకు పరిచయం చేయలేదు.

( ఇంకా ఉంది )

# కలగూరగంప

## 'భాగవతోత్తముడు - కృష్ణశాస్త్రి'

ప్రణయ కవితా ప్రస్థానానికి నిత్య పథికునిగా పరిచితుడైన కృష్ణశాస్త్రిని భక్తుడు అంటే సహించనివారే ఎక్కువ. మరి భాగవతోత్తముడుగా గుర్తిస్తే అసలు క్షమించరు కాబోలు. అయినా అతని రచనల్లో అంతర్లీనంగా వున్న గాఢ భక్తి భావాన్ని విశదం చెయ్యడమే ఈ వ్యాస లక్ష్యం. 'నవ్విపోదురు గాక! నాకేటి సిగ్గు!'

ఏ కావ్యాన్ని విమర్శింప దల్చుకొన్నా ఆ కావ్యంలోని ఇతి వృత్తాన్ని, పదాల పోహళింపుని, శయ్యా రీతుల్ని, అలంకారాల్ని, పద-భావ చిత్రాల్ని మాత్రమే చూస్తే బాహ్య రూపానికే ప్రాధాన్య మిచ్చినట్లవుతుంది. కవి ఆంతర్యాన్ని కనుక్కోవాలనుకుంటే గనుక ఆ కవి రచనా కాలాన్ని, ఆ నాటి సాంఘిక పరిస్థితుల్ని, ఉద్యమ కార్యకర్తగా అతని అభినివేశాన్ని, కృతులలో అతని భావ వ్యక్తీకరణని శ్రద్ధగా పరిశీలించాలి. సాహిత్యకారుని హృదయాధికారం విశ్వంమీద వ్యాపించిన తీరు గమనించడానికి అతని కృతులన్నీ ఆధారాలే ... కాని చాలమంది విమర్శకులు కవిపై గల వదంతులకు, కట్టు కథలకు మరిన్ని ఊహా సౌధాలు నిర్మిస్తారు. అవి ఆ కవికి చేసే ద్రోహము దారుణమే. కృష్ణశాస్త్రిని సహృదయంతో పరిశీలించిన విమర్శలు అరుదు.

కృష్ణశాస్త్రి తండ్రి తమ్మన్నశాస్త్రి, పెదతండ్రి సుబ్బరాయ శాస్త్రి శ్రీరామ భక్తులు. పిఠాపురం కుక్కుటేశ్వరస్వామి, కుంతీ మాధవస్వామి ఆలయాల పవిత్ర వాతావరణంతో చరిత్రప్రసిద్ధం. కృష్ణశాస్త్రి 'మా ఊరు పోయింది,' 'కోవెల - కొలను' వ్యాసాల్లో ఆ పట్టణంలోని ఆధ్యాత్మిక సంపదని, సర్పవరం భావనారాయణ స్వామి దేవళంలోని భగవదంకిత ప్రశాంత ప్రకృతిని రమ్యంగా, హృద్యంగా వర్ణించాడు. తర తరాల నుండి వస్తున్న సంప్రదాయం, తాత్త్వికా చింతన, కవితా వ్యాసంగం అతని మనస్సుని చందన చర్చితమూ, పరిమళ పూరితమూ చేశాయి. గుడిలోని గంటలు దేవుని పిలుపు లయ్యాయి. గుడి వాకిట జరిగే ధూప, దీప, నివేదనలు, పీఠాధిపతుల మహాతత్త్వవేత్తల ప్రసంగ ప్రవచనాలు అతని హృదయానికి హత్తుకొన్నాయి. సంస్కృత దృశ్య శ్రవ్య కావ్యాదుల పరిచయంతో శివ, శ్రీరామ, శ్రీకృష్ణ, తిరుమలేశాదులపై గాఢ భక్తి కృష్ణశాస్త్రిలో కుదురుకొంది.

బ్రహ్మ సమాజ ప్రార్థనా మందిర నిర్మాత, ఆ మత సిద్ధాంత ప్రచారకుడు, అనేక సాంఘికోద్యమాలకు నాయకుడు, కాకినాడలో పిఠాపురం రాజా కాళాశాల ప్రధానాచార్యుడయిన రఘుపతి వేంకట రత్నం నాయుడిగారి అంతేవాసియై కృష్ణశాస్త్రి ఆ గురుదేవుని సదుప దేశాల్ని ఒంటబట్టించుకున్నాడు. నాయుడిగారి శిక్షణలో ఆంగ్ల కాల్పనిక కవితారీతుల్ని, వంగ వైష్ణవ, తత్త్వాన్ని సూఫీ కవుల ప్రతీక వాద నైపుణ్యాన్ని కవితాశక్తిని అలవరచు కొన్నాడు. దరిద్రులలో, అస్పృశ్యులలో నారాయణునే దర్శించాడు. మాలలను 'శ్రీలలితేశ్వరగళ సుమాల' అన్నాడు. హరిజనవాడలో తిరిగి శుచీ శుభ్రతా, మర్యాద మన్నన, చదువు సంతలు నేర్పాడు, సంఘంచే వెలివేయబడ్డాడు. ఘోర ఏకాంత నరకాన్ని అనుభవించాడు. బ్రహ్మ సమాజ గీతాన్ని రచించాడు. పాడుతూ పాడించే వాడు భక్తి భావ బోధకమైన వేంకట పార్వతీశ్వరుల 'ఏకాంత సేవ' కు పీఠిక వ్రాసి ఇచ్చాడు అందులో భావకవుల తన్మయత్వాన్ని స్పష్టం చేశాడు.

ఆనాటి సాంఘిక సమస్యలయిన వేశ్యావృత్తిని, స్త్రీల అవిద్యని, వితంతువుల దుస్థితిని, అస్పృశ్యత దుష్టతని రూపుమాపేందుకు కృష్ణశాస్త్రి ఉద్యమాల్లో పాల్గొన్నాడు అయిన వాళ్లచేత కానివాళ్లచేత నిందలు పడ్డాడు. రెండువంద లేండ్లపాటు తన తండ్రుల వరకు ఆదరింపబడిన ఆస్థానకవి పదవిని కాదని ఆ రాజుచే 'దేవిడీమన్నా' చేయింపబడ్డాడు 'డిస్పెప్సియా' వ్యాధితో మరణవేదన ననుభవించాడు ఈ ఘోర పరిస్థితుల్లో వెలువడిన కవిత్వంలో దైవస్మరణ అధిక మౌతుంది తప్ప భౌతిక ప్రణయం, విరహం ప్రధానం కావు

సూఫీ కవుల్ని ఆదర్శంగా చేసికొని భక్తి భావననీ సామాజిక స్పృహతో పీడితుల ఆర్తారావాన్ని ఒకే గొంతుతో పలికిస్తూ, ఆత్మాశ్రయరీతితో కృష్ణపక్షం, ప్రవాసం, ఊర్వశి ఖండ కావ్యాల సంపుటిని ప్రకటించాడు. పదేళ్ల పాటు (1918-26) వివిధ పత్రికలలో ప్రచురింపబడిన కొన్ని ఖండికలకి మరికొన్ని చేర్చి ఆ సంపుటి సిద్ధం చేయించాడు. మొదట 1923లో కృష్ణపక్షం మాత్రమే శివశంకర శాస్త్రి చొరవతో ఆంధ్రుల చేతుల నలంకరించింది. విడివిడిగా వ్రాసిన ఖండికలయినా కొన్ని వస్త్వాశ్రయ రీతిలోని వాటిని మినహాయించి చూస్తే ఆ సంపుటిలో కవి వేదనా నివేదనమే కనిపిస్తుంది. కరుణా రసవృష్టి జాలువారుతుంది. అలౌకిక ప్రణయోపాసనలో అలమటించే, దైవ సంశ్లేషానికై పరితపించే జీవాత్మ 'ఆర్తి' గా, ఆ ఊర్వశియే తాను లీనం కాగోరిన పరమాత్ముని 'మూర్తి' గా కవి భావన స్పష్ట మవుతుంది.

ఆ ఖండకావ్య సంపుటిలో ఇతివృత్తం, కథన క్రమం లేవు. కేవల అనుభూతి వ్యక్తీకరణ, దైవస్మరణ ఉన్నాయి. మధ్య మధ్య వచ్చిన వస్త్వాశ్రయ రీతి ఖండికలు పరిహరించకుండా, కృష్ణశాస్త్రి వద్దంటున్నా వినక[1] శివశంకర శాస్త్రి అచ్చువేయించడంవల్ల చేరి చిక్కులు తెచ్చిపెట్టాయి. డాక్టర్ వెల్చేరు నారాయణరావు గారనట్టు, 'భావకవిత్వంలో కవి యొక్క వైయక్తికమైన అనుభూతి మాత్రమే ముఖ్యం. వస్తువుకి స్వతంత్ర అస్తిత్వం లేదు'[2] కవి తాత్త్విక భావ నాను గుణంగా ఆ సంపుటిని వివరిస్తాను.

పారిజాతం విరహియైన భక్తుని వంటిది. లోపల రక్త హృదయం, పైకి శాంత ధవళ మూర్తి,[3] అని కృష్ణశాస్త్రి ఆ సుమాన్ని ప్రశంసించాడు. తాను కూడ అలాంటి సుకుమార హృదయుడయిన భక్తుడు. ఇక్కడ విరహి శబ్దాన్ని భక్తునికి విశేషణంగా చెప్పడం విశేషం, మొదటి సంపుటి శీర్షిక 'కృష్ణ పక్షం' క్రమాభివృద్ధిని పొందే అంధకార ప్రధాన రాత్రులు పదిహేనిటికి ఆ పేరుంది. తాత్త్వికులు అంధకారాన్ని అజ్ఞానానికి ప్రతీకగా ఉపయోగిస్తారు, కృష్ణ పక్షం అనే సమాసానికి కృష్ణ సంబంధం, యమునా తీరం, నీల మేఘ పార్శ్వం, పరమాత్మ సహాయం, కృష్ణ తులసి కొమ్మ, యజుర్వేదంలో కృష్ణ శాఖ, తమాలవృక్ష శాఖ, కృష్ణ ద్వీపం- ఇలా ఎన్నో అర్థాలున్నాయి. దైవాంశాల్ని సూచించేవే ఎక్కువ.

కృష్ణ పక్షంలో కవి ప్రకృతిలోని సమస్త వస్తుజాలాన్ని ప్రేమిస్తాడు. ఆ వస్తువులకీ తనకీ భేదం లేదంటాడు. వాటిలో లీనం కావాలనుకుంటాడు. విషం అమృతంలా, అమృతం విషంలా చిత్ర గతులతో మార్చే మర్త్య జీవితంపై విరక్తు డౌతాడు. సంధ్యా సమీరణుని 'నిత్య తేజోమయానందనిలయా'నికి తనను చేర్చమంటాడు. శూన్య లోకాన్ని, శుష్క దేహాన్ని విడిచి అన్యోన్య నిబిడ నిత్యాశ్లేష కాంక్షతో మరో లోకానికి పయన మవుతాడు. 'పరమపద శాంతి పూర్ణ నిర్వాణ గీతి'ని ఆలపించమంటారు ఎవరో?

సూఫీ తత్వంపై పారసీకులు వివేచన చేస్తూ జీవాత్మ సృష్టింపబడినపుడే పరమాత్మ ప్రబోధాత్మ నొకదానిని ఆ జీవాత్మకు రక్షా కవచంగా, శిక్షా గురువుగా పంపిస్తా డంటారు. జీవాత్మ లోకాన్ని విడిచేటపుడు ప్రబోధాత్మ తన స్వస్థానానికి పోయి ఆ జీవాత్మ రాక కోసం ఎదురుచూస్తుందట. కృష్ణ పక్షాంతాన కవిని ఉద్బోధిస్తున్నది ఆ ప్రబోధాత్మయే. దాన్నే సూఫీలు 'ప్రవాసి'గా పేర్కొన్నారు.[4]

ప్రవాసారంభంలో ప్రవాసి 'ఈ అశ్రు ఝరులతో ఇరులతో ఈపాటి బ్రతుకు నీ కేపాటిదోయి?' అంటూ కవిని ఉద్బోధిస్తుంది. అతనికి ప్రేయసి అడుగు సందడులు వినిపిస్తుంటాయి. ఆ యాత్రా మార్గాన ఎన్నో అడుగు జాడలు కనిపిస్తుంటాయి. అతని కళ్లు 'పగటిని చూడని ప్రవాసంలో చైత్ర శుభోత్సవ విభాత కళ్యాణం' కోసం ప్రతీక్షిస్తుంటాయి. ఏ గూడూ లేని పులుగురాయని వంటి తాను తుది రేయి ఇరుల చాయలా నశిస్తున్నాడు. మరణించే తన కోసం చెమ్మగిల్లే కళ్లు లేవని తెలిసికొన్నాడు. తన కాష్ఠాల్లో రేగే మంట తన దేహాన్ని దహిస్తుందని తెలుసు. ఎవరో పిలుస్తున్నారు. అనుకుంటూండగానే దేహయాత్ర పూర్తయింది. మిగిలింది ఊర్వశీ సాన్నిధ్యం.

కవి ప్రేయసి త్రిజగతీపతి కోటీర దివ్య రత్నరాజినేలే వ్రజాల తురాయి. ఆమె చరణ కరుణా మధుకణం, చరణ మసృణారుణోదయ సురభికాంతి. ఆమె కోసం కవి ఆరాటపడుతున్నాడు. ఆమె వెలుగు చూపు వికసించింది. వైకుంఠ మృదుకంఠ వైజయంతీ మాలగా ఈశ్వరాలోకమే వెలికి వచ్చినట్లుంది. ఇంతలో కవికి స్వప్నంలో ప్రియ సాక్షాత్కరించింది. ప్రేయసీ ప్రియు లొకరిలో ఒకరు ఒదిగి 'నందనారామంలో మందాకినీ శీతలహరీ పరిష్వంగ' సుఖాన్ని అనుభవించారు. ఉన్మత్త భావశాలి అయిన కవి నృత్యం చేద్దామనుకున్నాడు. కానీ తాను నటరాజు కాలేడు. ఎడతెగని యాత్ర సాగించేదాక, ఎట్లో ఆ స్వామి దర్శనం సాధించేదాక అతని వలె నటించ గలిగినా చాలనుకొంటాడు. తానింకా క్రమించవలసిన అధ్యాయం ముందుందని కవి గ్రహించడంతో కావ్యం ముగుస్తుంది.

పై పరిశీలన వల్ల భగ్న ప్రేమికుని శ్రుతి మించిన దుఃఖం, భౌతిక విరహతాపం కవిలో గోచరించవు, అతని ఈశ్వరారాధనా తత్త్వమే కనిపిస్తుంది. కృష్ణశాస్త్రి దైవాన్ని 'అనంతరాగాంశుమాలికా కాంతి' గా అతని స్థానం నిత్య తేజోమయానంద నిలయంగా, ఆయన పాదాలు మసృణారుణోదయ సురభి కాంతులుగా సంకేతించాడు. ఆ పదసరోజ మృదుగజోలేశ సంపదనే వలచాడు. కాంతి దైవానికి సంకేతంగా ఉపనిషత్తులు, విశిష్టాద్వైత తత్త్వగ్రంథాలు, సూఫీవేదాంత దర్శనాలు సూచిస్తున్నాయి.

> 'నతత్ర సూర్యోభాతి న చంద్రతారకం,
> నే మా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః।
>
> తమేవ భాంత మనుభాతి సర్వం,
> తస్య భాసా సర్వమిదం విభాతి॥'

అని కఠోపనిషత్ ద్వితీయాధ్యాయంలో కాంతి 'బ్రహ్మము' యొక్క తేజోమూర్తిగా' గా చెప్పబడింది[5]

'పరమాత్మ దివ్యకాంతి స్వరూపుడు' అని విశిష్టాద్వైత తత్త్వంలో ఉంది.[6]

'ఏది రసస్వరూపమయి యీశ్వర సృష్టినలంకరించి, ప్రే
మోదయ సౌరభాప్తి హృదయోత్పలముల్ వికసింపజేసి, యా
మోద సుధా స్రవంతులను మోహన గాన రవానుభూతియై
యేది వెలుంగు నా వెలుఁగు నీప్సిత సిద్ధులు గూర్చు తేజమై[7].

అని సూఫీ వేదాంత దర్మములో ఉమర్ ఆలీషా కవిగారు వర్ణించారు. 'సూఫీలకు ఈశ్వరుడు జ్యోతి స్వరూపి' అని వాసిరెడ్డి పార్థసారధి భారతిలో (1958) ఉటంకించారు. కృష్ణశాస్త్రి పలుచోట్ల స్మరించిన 'కాంతి' దైవసంకేతమన్నది స్పష్టం. ఆ దైవానికే 'ఊర్వశి' పేరు పెట్టడానికి కారణం దైవాన్ని ప్రేయసిగా భావించడమే. సూఫీ కవులకు 'భగవంతుడే ప్రియ.'[8] జీవాత్మలు ఆమె ప్రియులు మధురభక్తి సంప్రదాయంలో మీరాబాయి 'భగవంతుడు ఒక్కడే ప్రియుడు. జీవాత్మలు ఆయన ప్రేయసు' లంటుంది మరి సూఫీ మార్మికత కృష్ణశాస్త్రికి ఎలా వర్తిస్తుంది? అని ప్రశ్నించుకొంటే దానికి కృష్ణశాస్త్రి స్వయంగా ఒప్పుకొన్న సందర్భాలున్నాయి. అవి—

1. నాయుడుగారు ... శిష్యులకు ఉర్దూ పారశీకాంగ్ల సాహిత్యాల ఘనతా, లావణ్యమూ పరిచయం చేశారు.[9]
2. ఆంగ్ల, సూఫీ, వంగవైష్ణవ సాహిత్యాలలో నా గురువుల ద్వారానే నాకు కొంచెం పరిచయం.[10]
3. ...ఇప్పటికేని నాటి సూఫీ చరితామృతమ్ము గురిపించెడు మా గురుదేవుడే లోకోత్తోచు షరాయితో ఫగిడితో నెవరో యొక ఫాదుశాహిగా'...[11]

అంటూ కృష్ణశాస్త్రి 'పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము' అనే వ్యాసంలోనూ, గురుదేవుని స్తుతి పద్యాల్లోను పేర్కొన్నాడు. అందుచేత కృష్ణశాస్త్రి సూఫీ తాత్త్వికతా ప్రభావితుడని స్పష్టమే.

కృష్ణశాస్త్రి ఊర్వశిని ప్రణయ దేవతగా, నారాయణ ముని ఊరూద్భవ అయిన దైవాంశ సంభూతురాలిగా స్వీకరించాడు అంతే కాని ఇంద్రాదుల భోగకాంతగా, ఇతరాప్సరసల సరసన కూర్చోబెట్ట దగిన సామాన్య స్త్రీగా ఊహించలేదు. వేశ్యా వృత్తి నిర్మూలనోద్యమంలో పాల్గొనడంచేత వేశ్యాకన్యలో గూడ దైవత్వాన్ని చూపేందుకే ఆ పేరుని శీర్షికగా ఉంచడమేకాక ఆ సంపుటిని ఆమెకే అంకితమివ్వడం విశేషం.

కృష్ణశాస్త్రి తన్మయభావుకత ఈ కావ్య సంపుటికే పరిమితం కాలేదు. ధనుర్దాసు, గుహుడు, మల్హణుడు, శివక్షేత్ర యాత్ర, శ్రీ ఆండాళ్లు, యమునా విహారి, కృష్ణాష్టమి—శ్రవ్యనాటికలు; కృష్ణరజని, కన్నీరు. మధుమురళి, గుడిగంటలు, మహతి — ఉపాసనా గీతాలు; ఋగ్వీథి — అనువాద పద్యాలు; తిరుప్పావు — పాటల కోవెల కొలను, శ్రీ కృష్ణావతార తత్త్వము, గుహుడు, సుగంధద్రవ్యములు—వ్యాసాలు; క్షీరసాగర మథనం, విప్రనారాయణ—యక్ష గానాలు, 'అడుగడుగున గుడి ఉంది, అందరిలో గుడి ఉంది ఆ గుడిలో దీపముంది, అదియే దైవం' ఊరకే కొలనునీరు, 'నీవుంట దాకొండపై' — చలన చిత్ర భక్తి గీతాలు ఎన్నో ఎన్నెన్నో అముద్రిత రచనలు కృష్ణశాస్త్రిని భాగవతోత్తమునిగా నిరూపిస్తాయి.

ఆ రచన లన్నిటిలో భక్తుల ఆవేదనని పరమాత్మ దర్శనానికి వారు పడే ఆరాటాన్ని, ఆ దివ్య క్షణం కోసం ఎదురుచూస్తున్నపుడు వారు పొందే ఉత్కంఠని హృదయంగమంగా కృష్ణశాస్త్రి చిత్రించాడు. అతేత్పు విగ్రహాన్నో, మూర్తినో వర్ణించకపోవడం కవి ప్రత్యేకత బ్రహ్మ సమాజ సభ్యునిగా విగ్రహారాధన చేయక పోవడమే దానికి కారణం

డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు భారతిలో 'శ్రీ, కృష్ణశాస్త్రి' అనే వ్యాసంలో "కృష్ణశాస్త్రిగారు భక్తులు అనేక భక్తికీర్తనలు రచించారు అనుతాపమూ, ప్రపత్తీ భక్తికి అంగములు. ... ... పరమేశ్వరుని యెదుట వినయముతో కన్నీరు గార్చుట గంగాస్నానము వంటిదే. కృష్ణశాస్త్రి గారికే కాక వారి పాత్రలకు కూడా ఈ కన్నీరు జీవము. ... ... ఈ కన్నీరు పూజాద్రవ్యమైంది. విధి బలీయమై ప్రేయసి నడిలేని నడిరేయి బడిపోయినది. ఆమె కొరకు పడిన నిర్వేద నౌకకు ఆయన కన్నీరే నది యైనది" అని వివరించారు.[11]

కృష్ణశాస్త్రి మూడు వంతుల రచనల్లో ఈ భక్తిభావ వ్యక్తీకరణే ఉంది. భక్తుడు కానిదే, ఆ అనుభూతి లేనిదే కవి వ్రాయలేడు.

'నా నృషిః కురుతే కావ్యమ్

**ఉపయుక్త గ్రంథ వివరాలు:-**


1. కృష్ణ పక్షం (ఖండ కావ్యాల సంపుటి) - కృష్ణశాస్త్రి సన్మాన సంఘ ప్రచురణ - మద్రాసు - 1975.
2. మహావ్యక్తులు - రాజహంస ప్రచురణలు, మద్రాసు - 1982.
3. సూఫీ వేదాంత ధర్మము, ఉమర్ ఆలీషా గ్రంథ మండలి. పిఠాపురం - 1939.
4. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం. విశాలాంధ్ర ప్రచురణాలయము, విజయవాడ - 1978.

5. ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర. 1, 2 సంపుటాలు ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాద్, 1962.

6. భారతి (సాహిత్య మాసపత్రిక) 1963.

7. ది టెన్ ఉపనిషత్స్. (ఆంగ్లగ్రంథం) బ్రాహ్మోమిషన్ కలకత్తా.

"శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, (అనంతపురం) నుండి పిహెచ్. డి. పట్టం పొందిన నా 'కృష్ణశాస్త్రి కవితా తత్త్వం' అనే సిద్ధాంత వ్యాస నిబంధంలో ఓ శీర్షికకు సంక్షిప్తరూపం ఈ వ్యాసం."

అ ధో జ్ఞా పి క లు :

1. కృష్ణపక్షం (1975 - పీఠిక) - 11.
2. తెలుగులో కవితా విప్లవాల స్వరూపాలు - పుట 117.
3. పుష్పలావికలు - 36.
4. ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర - ద్వితీయ సంపుటి - పేజీ 5, 6.
5. ది టెన్ ఉపనిషత్స్ - పుట 73.
6. ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర - ప్రథమ సంపుటి - పుట 325.
7. సూఫీ వేదాంత దర్శము - 1.
8, మహావ్యక్తులు - పుట 65.
9, 10. అప్పుడు పుట్టివుంటే - పుటలు 26.47.
11 పల్లకి - పుట 22.
12. శ్రీకృష్ణశాస్త్రి (వ్యాసం) - భారతి, జూన్ 1963 - పుట 3.

డా॥ బొందలపాటి కేశవహనుమంతరావు

# మధురభావుకుండు - పెమ్మరాజు లక్ష్మీపతి

ఆధునిక సాహిత్యమునకు 'భావోద్దీపన', 'భావైక్యత', 'సన్నివేశంలో' తలదూర్చడం సామాజిక స్పృహతో గత సమాజం నుండి భవిష్యత్తునూహించుకుంటూ ముందుకు దూకడం ప్రధాన లక్షణాలు. ఇరవయ్యో శతాబ్దపు పూర్వార్ధంలో ముఖ్యంగా నెరిగిన ప్రక్రియలలో 'ఖండకావ్య పద్ధతి' ఒకటి. 'ఖండికలు' దీపకళికలవలె వెలుగొందుతూ సనాతనులను-అధునాతనులను కూడా రంజింప చేశాయి. 'ఖండిక'లో వస్తువు ఏదైనా ఎవరిదైనా లక్ష్యం ఒక్కటే.

1920 - 40 సంవత్సరముల మధ్య ఖండకావ్య పద్ధతికి చేతనైన కృషిసల్పి 'తెలుగు సరస్వతికి' చిన్న ముత్యాలహారం సమర్పించిన వారిలో కీ॥ శే॥ పెమ్మరాజు లక్ష్మీపతి గారు ఒకరు.

1899 జూన్ 1వ తేదీన సామాన్యకుటుంబంలో జన్మించారు. పిప్పర కాపురస్తులు మంగిపూడి వేంకట శర్మ, పురుషోత్తమ శర్మ గారల ఆబాల్య సాన్నిహిత్యంలో సంస్కారాభిలాష. సాహిత్య రంగంలో సేద్యం కొత్త పుంతలు త్రొక్కినవి. దుగ్గిరాల గోపాల కృష్ణయ్య - కాశీనాధుని నాగేశ్వరరావు గారి సహాయ సహకారాలతో విద్యాభ్యాసం చేశారు. అనారోగ్య కారణాలవలన కళాశాల విద్యను విరమించి ఉత్తమమైన ఉపాధ్యాయ వృత్తిని చేబట్టారు.

మాటలో చమత్కారం, సున్నితమైన హాస్యం లక్ష్మీపతి గారి వ్యక్తిత్వంలో కనిపించే లక్షణాలు. నిరాడంబరమైన ఖద్దరు దుస్తులు, పలకరిస్తే చిలకరించే మందహాసం, పరిశీలనలో మాటలో ప్రతి కదలికలో - కవి పోకడలు కనుపించేవి.

లక్ష్మీపతి రచించినది చిన్న ఖండకావ్య సంపుటి మాత్రమే, అందలి ఒక్కొక్క వస్తువు ఒక్కొక్క విధమైన భావ పుంజములను వెదజల్లుతుంది. 1930 సం॥ నాటికి భావవిహంగములను భాషాకాశంలో స్వేచ్ఛగా విహరింపజేసిన బహుకొద్ది మందిలో లక్ష్మీపతి గారొక్కరు.

"గ్రీష్మము" అను ఖండికలో లక్ష్మీపతి చేసిన ప్రకృతి పరిశీలన - వర్ణన - అమూల్యమైనది గ్రీష్మము యొక్క ప్రభావమును తెల్పుచు—

'నీడలకునైన నిలువగ నీడలేక
యవని యంతయుఁ దేజోమయత్వమంద
తన ప్రతాపంబు కేంద్రీకృతంబు జేసి
వెలుగుచున్నాడు రవి వినువీధి నొకడె' అన్నారు.

గ్రీష్మమునకు వ్యక్తిత్వము నాపాదించి వసంతముతో పోలిక దెచ్చి గ్రీష్మమును ప్రశ్నించిన విధము బహు సున్నితము.

'విరిసెన పూలతోడ తలదిండు లొనర్చి, చిగుళ్ళ పైపయిన్
బరచిన పండువెన్నెలం పానుపులన్ మృదు నిద్ర చెంది, బం
గరు కలం గరంగ ననకారు హాయల్ చిలికించు ప్రాయ, మి
త్తరి పటు రోహిణీసమయ దారుణవహ్ని తపింపజేతురే?"

కవికి కలిగిన ప్రకృతితో సాన్నిహిత్యం మనోహరం కదా! వసంతంలో సుఖానుభూతికి నిర్మల హృదయానికి, గ్రీష్మ తాపపు సంతాపమునకు గల అనుభవ భేదమును చెప్పుటకు తనంత తానుగా భారం మీద వేసుకొనిన విధం - కవి ప్రకృతిలో తనొక భాగస్వామి కావడం కాదా!

ప్రకృతితో తన్మయత్వం లక్ష్మీపతి కొక ఆసక్తి. ఆ ఆసక్తిని వ్యక్తం చేయడం కోసం ఆతురతలో —

"అలినై క్రోలితి కమ్మతేనెలు, పికంబై పాడితిన్, బాల శీ
గలునై యాడితి, న వ్వసంత సమైక్యస్ఫూర్తి వ ర్ధిల్లి కో
మల శిల్పంబులు గూర్చి, యీ చటుల గ్రీష్మాఖండతేజోవిని
శ్చలతన్ గ్రాలెదు నీ భయంకర మనోజ్ఞత్వంబు గీర్తించెదన్."

వసంత శోభ కవిని తన్మయుని చేసింది. వాటిని మరువలేక పోవడం, తీక్షణమౌ గ్రీష్మముయొక్క "భయంకర మనోజ్ఞత్వంబును కీర్తించడం" కవి కర్తవ్యంగా పెట్టుకున్నారు, గ్రీష్మమును 'భయానకప్రియా' అని సంబోధిస్తూ - భీషణమైన గ్రీష్మ తాప మును పార్వతి శివుని నిమిత్తం చేసిన తపస్సుతో ఉపమానమును చూపుట హృద్యమంగా ఉంది.

'గరళము ద్రావినట్టి కఱకంఠుని, జిచ్చరకన్నుదాల్చుదే
వర పతిగా జపించు హిమపర్వతరాజకుమారి వోలె సు
స్థిర దీక్షమై తపముఁ జేసెదు నీ మహనీయ దివ్య రూ
ప రమయె, నాకు నిత్తరి యుపాస్య తలంప భయానకప్రియా!'

తాను వసంతంలో 'కుమార కవిట'. గ్రీష్మములో తాను తాంత్రికుడట, తనకు తాను అభిమానించిన ఋతువులకు సంబంధ సాదృశములను ఊహించుకొనుచు —

"సరస మధుమాస సరస సరస్వతివి నాడు
కడగి నిను బాడిన కుమార కవిని నేను
ప్రకట తేజః కరాళ కాళి కవు నేడు
తీక్ష్ణతమ రక్తిగొల్పు తాంత్రికుడ నేను."

ప్రకృతి ఒక్కటే కాలాంతరంలో ఋతుభేదం స్వానుభవ వశంగా రూపాంతరమై ఋతుభేదం కనుపిస్తుంది. ఆ అనుభూతి భావుకునకు దివ్యమైన పతాకం.

లక్ష్మీపతి గారికి "తిక్కన" అంటే ప్రత్యేకమైన గౌరవము, అభిమానం. అంతేకాదు 'భారత కథకు—తిక్కనకు, తెలుగు భాషకు తిక్కనకు—తనకు తిక్కనకు—లక్ష్మీపతి పెంచి పోషించిన బంధుత్వ రీతి బహు ప్రశంసా పాత్రము. తిక్కన నాడు తాను లేకపోయితినని బాధపడుతూ —

'జయ మహామాత్య శేఖరా! జయ మహాధ్వ
ర ప్రదీపిత! జయ కవి బ్రహ్మ! జయమ
టంచు నుతులను గొన్న నీయతుల మూర్తి
గానతేమైతి మకట తిక్కన్న నాడు.'

లక్ష్మీపతిగారు ఊహించిన 'మాధురీ గరిమ' ఆపాదించిన 'ఆంధ్రత్వ మహిమ' తిక్కన కూడా ఊహించాడో లేదో!

తెలుగు కవిత్వ మెన్నగ నిదేయని తత్‌జ్ఞులు మెచ్చునట్టు లు
జ్వలులయినట్టి పాండు కురు వంశ్యుల నెల్లరఁ దెల్గువారలై
మెలగెడునట్లు మార్చితి వమేయ కళాచతురత్వ మొప్ప నీ
తెలుగున వ్యాసుడే యను నుతిం గనజాలితివౌర! తిక్కనా!

తిక్కన తెలుగు కవితా మాధురిని కడుపార జుర్రిన అనేక మంది తెలుగు కవులు "భారత వంశము-తెలుగు వారు" అని తోచు నంతగా తిక్కన భారత రచన చేసెనని ప్రశంసించిరి. కాని లక్ష్మీపతి "పాండు కురు వంశ్యులనెల్ల తెల్గు వారలై మెలగెడునట్లు మార్చితివి" అని "తెలుగున వ్యాసుడేనని" ప్రతిపాదించారు. అభిమాన ప్రకటనలో ఆధునికుల కంటె ఒక అడుగు ముందుకు వేశారు. తిక్కనతో ప్రత్యక్ష బంధుత్వ రీతిని పెంచుకున్నట్టు రచన సాగించారు. ఎంత చెప్పుకున్నను తృప్తిపడక —

"అనఘ! త్వదీయ దివ్య మహిమాతిశయంబు నుతించుపట్ల నే
మనుటకు తోచ కింక భువి నింతటి వాడితరుం డెవండు లే
డనుచు వచింపగా వలయు నంతియ కాని నుతింపగా దొరం
కొనిన పదంబు లెందు కలుగున్ పుడమిం గల బాసలన్నిటన్."

- అన్ని బాసల కందని మహనీయుడుగా తిక్కనకు నివాళు లిచ్చారు.

గాంధీజీ అంటే లక్ష్మీపతిగారికి పంచప్రాణములు. గాంధీజీ కారుణ్య ప్రభావమునకు, ఆదర్శ భావములకు, జాతీయ భావనా పరంపరకు చకితులైన లక్షలాది భారతీయ రచయితలలో లక్ష్మీపతి ఒకరు. 'మోహనోదయము' అనే ఖండిక ముఖ్యంగా గమనించవలె. రాజకీయ లక్ష్యం ప్రధానంగా ఆదర్శములను, ఆదర్శ పురుషులను శంకించి తర్క వితర్కములకు ఆస్పదము చేసిన కాలం కాదది. గాంధీజీకి దైవత్వ మాపాదించి లక్ష్యసాధన కుపక్రమించిన కాలమిది. నాలుగు దశాబ్దాలు 'రాజకీయ' అవగాహనలో తెచ్చిన మార్పు విపరీతం —

"అది కలశార్ణవం బమృత మార్య జగంబు, ప్రపంచశాంతి కా
స్పదమగు చంద్రబింబ మది, చల్లనిదైవము గాంధి యార్యభూ
హృదయము దానదోచి రచియించుచున్నది జ్యోత్స్న, భూమినె
ల్లదిశల, భారతావని కళా నిలయంబుగ మారిపోవగన్"

అని గాంధీ యెడ - గాంధేయము యెడ బావము స్పష్టం చేశారు. గాంధీలో 'ఆర్యప్రపంచ లక్ష్మి'ని చూచిన వ్యక్తి ఆయన. గాంధీజీని అవతార పురుషుడుగా ఎన్ని - దశావతారములలోని లక్షణములను ఆయనకు ఆపాదించారు. గాంధీజీని జీసస్‌తో పోల్చుతూ —

'హర్షాశ్రుధార లొలుక
సిలువపై నిల్చి చూచెడు 'జీస' సతడు" — అని గాంధీజీలో త్యాగమూర్తిని - గాంధీజీ నిర్యాణమునకు ఒక దశాబ్దం ముందుగానే - ప్రశంసించి ఆనందించారు.

ఆర్యవిజ్ఞాన భాస్కరుడైన 'అరవిందులు' అనిన ఆయనకు అపరిమితమైన అభిమానం. 'అరవింద యోగి' అనే ఖండికలో తాను అరవిందులతో పోల్చుకుంటూ —

అమర లోకోద్భవ విభూతి నంది, నవసుధ
పైని ప్రవహించు 'గంగా స్రవంతి యతడు'
ఆ మనోహర పీఠికా హతుల జెలగి
మిట్టిపడుచున్న "ఒక చిరుమీన మేను"

ఘోషణాతిమోహనముగ కుంభవృష్టి
గురియు చుండెడి "నీల మేఘుండతండు"
ఆ యమృత ధార లొకటి రెండాస్వాదించి
తనివిసని చొక్కు "చిన్ని చాతకము నేను"

అని ఉపమానములతో ఋషి పుంగవుని ఘనతకు - ఉన్నతికి విలువ చెప్పారు

ఆడంబరంగా కనుపించే వారంటే ఆయనకు చాలా అసహ్యం. ఒక విలాస పురుషుని వర్ణిస్తూ చిత్రమైన - పదునైన పదజాలమును వాడారు.

"ఒడ్డాణమునుబోలు తోలు పటకాను
బొలుపారగా నడుమున బిగించి -

ఒక పురుషుడు విలాసంగా కండువాను వల్లెవాటుగా వేయగా- పైటవలె వేసిన వల్లెవాటు కండువా గూర్చి —

"పురుష వేశ్యయొ నాదగి తిరుగుచుండు" అని వ్యంగ్యంగా చెప్పారు. ఏమాత్రం ఆడంబరం - వేషంలో - మాటలో కనుపించినా ఆయన సున్నిత విమర్శకు గురియయ్యేడిది. నొప్పి లేకుండా సూదులు గుచ్చుచున్నట్టుండేది. నిత్య సాంఘిక జీవనంలో అత్యల్ప విషయాలు కూడా ఆయన దృష్టినుండి తప్పించుకోలేవు.

"ప్రణయార్పణము" అనునది కథావస్తువులో నిబద్ధితమైన కరుణరస పూరితమైన ఖండిక. —1940 సంవత్సరమునకు పూర్వం ఈ ప్రయత్నం అధునాతనమే.

"ధా మను మ్రోతతోడ నకటా పడిపోయెను ప్రాణహీనమై
యా మిధునంబునందు నొక యండజ మయ్యెడ బుప్ప పల్లవ
స్తోమము రాలె ధూమపరిధూసరితంబుగ నా క్షణంబునన్
వ్యోమతలంబుపై నెగిరి పోయెను దక్కిన పక్షి గ్రక్కునన్."

కరుణరస పూరితమైన అక్షర పంక్తి కిది మచ్చుతునక. 'మనసు మార్దవమైనకాని మాట మార్దవము కాదు' అన్నది లక్ష్మీపతి గారికి అన్వయిస్తుంది.

పెమ్మరాజు లక్ష్మీపతిగారికి పింగళి లక్ష్మీకాంతంగారు, కాటూరి వెంకటేశ్వరరావుగారు నచ్చిన కవులు. తరుచు 'భారతి'లో పద్యరచనలు ప్రకటితమయ్యేవి. ఆయన దరఖాస్తు చెయ్యకుండగానే 1940 సం॥ ప్రాంతంలో – అనేక సాహిత్య సంఘాలలో సభ్యత్వము లభింప చేశారు. సరసుడు-సహృదయుడు-దేశభక్తి పరిపూరితుడు అయిన లక్ష్మీపతి తన 44వ ఏట – 1943 సంవత్సరం సెప్టెంబరు నెలలో కాలంచేశారు — నక్షత్రం చిన్నదైనా సహజ కాంతులకు కరువుండదు కదా! లక్ష్మీపతి ప్రతి పద్యం ఒక చిన్న నక్షత్రం.

శ్రీ వీరభద్రరావ్ పవిన్ద

# చెక్కభజన (పులివెందుల మండలం)

జానపద నృత్యాల్లో చెక్కభజన ఒకటి. ఇవి ముఖ్యంగా పల్లెప్రజలు పాల్గొనుటకు సులభశైలిలో రూపొందినాయి. ప్రచార నృత్యాలు పల్లెప్రజల కొరకు ఏర్పడిన నృత్యరీతులు అయినప్పటికీ వాటిని ప్రత్యేకంగా కొద్దిమంది కళాకారులు ఎక్కువ శ్రమించి, అభ్యసించి ప్రదర్శించే సంప్రదాయ నృత్యాలు. జానపద నృత్యాలు అలాకాకుండా ప్రజలందరూ పాల్గొని ఆనందించే సులభశైలి కళా కేళికలు. వీటిని ప్రజా కళలుగా చెప్పవచ్చు. ఇవి కొన్ని ఏకపాత్ర నృత్యాలు, కొన్ని బృంద నృత్యాలు, కొన్ని ప్రత్యేకంగా స్త్రీలచే, పురుషులచే ప్రదర్శించునట్టివి. ఇలాంటి వాటిలో బృందంగా ఏర్పడి చేసే 'చెక్కభజన' నృత్యాన్ని ఏవిధంగా చేస్తున్నారో చర్చించటం ఈ వ్యాసోద్దేశ్యం.

చెక్కభజనను పలకలభజన, పలకలకోలన్న అని అంటారు. చెక్కలతో చేసే భజన కాబట్టి 'చెక్క భజన' అని పేరు వచ్చింది. దీంట్లో ఎంతమందైనా పాల్గొనవచ్చు. కానీ నృత్యంలో చిన్నవాళ్ళు, పెద్దవాళ్లూ కలిసి ఉంటారు. చెక్కలు రెండు జానెలు పొడవు, బెత్తెడు వెడల్పు కల్గిఉంటాయి. వాటికి చివరలో రేకుతో చేయబడిన బిల్ల లాంటివి ఆమర్చి ఉంటారు. అలాంటివి రెంటికీ అమిర్చి ఉంటారు కుడి చేతికో ధరించే ఈ చెక్కలు రెండూ ఒకే ప్రమాణంలో ఉంటాయి. పసుపుపచ్చని గుడ్డను నడుముకు కట్టుకుని ఉంటారు. కొన్ని చోట్ల ఇతర రంగుల గుడ్డలు కటుకొంటారు. ఏ రంగు గుడ్డను కట్టినా అది ఒకే రంగులో ఉంటుంది. గురువు అందర్ని గుండ్రాకారంగా నిలబెట్టి తాను మధ్యలో చెక్కల్ని తీసుకొని నిలబడతాడు. వెంటనే "శ్రీమద్ రమారమణ గోవిందా హరీ" అని మొదలు పెడతాడు. అందరూ "గోవిందా" అని వంత పాడతారు ఇలా గురువు ఒక్కొక్క దేవుణ్ణి పేరు చెప్పి వేడుకోవటం, అందరూ చేతుల్లోని చెక్కల్ని గలగల మంటూ కదిలిస్తూ ఒకే లయలో శబ్దం చేస్తూ ఉంటారు తర్వాత గురువు చూపించే భంగిమల ననుసరించి అందరూ అవే భంగి మల్ని అనుసరిస్తారు. ఒక్కో చేతిని గాలిలో అలా పయ్యారంగా తిప్పుతూ చెక్కల్ని ఇంకో చేత్తో అందరూ ఒకే రకంగా కొడుతూ గురువును అనుసరిస్తూ ఉంటారు అలాగే రెండు కాళ్ళకు గజ్జెలు కట్టుకొని నేలమీద ఒకే మాదిరిగా కొడుతూ గుండ్రాకారంగా తిరుగు తుంటారు. ఒకే వరుసలో నిదానంగా తిరుగుతారు. గురువు ఒక్కొక్క గేయం పూర్తి అవగానే లేదా మధ్యలోగాని తాళం మార్చి బిరబిరా తిరుగుతూ పాటలోని ఒక పాదాన్ని పూర్తిగా పాడి, మరల అదే పాదాన్ని సగం పాడితే ఆటగాళ్ళు తక్కిన సగం పాడతారు. అపుడు ఆ దృశ్యం చూడముచ్చటగా ఉంటుంది గజ్జెల రవళి చెవుల్లో మార్మోగుతూ వినసొంపుగా ఉంటుంది. నృత్యభంగిమ నయనానంద కరంగా ఉంటుంది.

ఈ నృత్యంలో రామాయణం ఇతివృత్తంగా కలిగిన గేయాలే ఎక్కువగా ఉంటాయి. భారత భాగవతాదుల్లోని ఇతివృత్తాలుగా గేయాలు చాలా తక్కువ. ప్రతి గేయంలోనూ ప్రతి పాదం కూడా కొంచెం సేపు నిదానంగా, కొంచెం సేపు బిరబిరా సాగిపోతూ ఉంటుంది. అది వాళ్ళ వీలునుబట్టి ఉంటుంది గేయం నిదానంగా పాడుతున్న సమయంలో ఒకసారి నడుములు వంచి కాళ్ళ దగ్గర వరకు పోనిచ్చి అక్కడ చెక్కలనాదం చేస్తారు. తర్వాత నడుముల దగ్గర ఒకసారి చెక్కలనాదం చేసి, ఆ తర్వాత చేయి పైకెత్తి అక్కడొకసారి చెక్కలనాదం చేస్తారు. అలాగే కాళ్ళు ఒకదాని కొకటి మార్చుకుంటూ అడుగులువేస్తూ గుండ్రాకారంగా తిరుగుతారు. ఒక చేయిని మాత్రం లయానుగుణంగా గాలిలో అలా అలా త్రిప్పుతూ ఉంటారు. గురువు గేయాన్ని బిరబిరా పాడుతున్న సమయంలో అదే అడుగుల్ని బిరబిరా వేస్తారు. వీలున్నంత వరకు ఎగరటం, ఉంటుంది. ఎగురుతున్న సమయంలో గజ్జెలనాదం చెక్కలనాదం ఒకే లయలో వినిపిస్తూ మనోహరంగా ఉంటుంది.

గురువు మధ్యలో తిరుగుతూ ప్రతి గేయం మొదటిగా 'ఎత్తుగడ' ను అందిస్తాడు. అడుగులు చూపిస్తాడు వాటికనుగుణంగానే అందరూ మసలుకొంటారు. ప్రతిగేయం అయిన వెంటనే చివరలో కొద్దిసేపు లయాత్మకంగా ఎగరటం మాత్రం ఉంటుంది. అపుడు చుట్టూచేరిన జనానికి ఎంతో ఆహ్లాదకరంగానూ చూడముచ్చటగానూ ఉంటుంది. అలాంటి సమయంలో జనం ఈలలు వేయటం, ఎగరటం చేస్తుంటారు. ఈ లయాత్మకమైన శబ్దం చివర్లో మాత్రం ప్రతి గేయానికి ఉంటుంది.

ఈ నృత్యంలో మొదటిగా శారదాంబను ఇలా వేడుకొంటారు—

"అంబ బ్రోవుమా శారదాంబ బ్రోవుమా తల్లి
కంబోకందరి మహమ్మాయి కరుణ జూడుమా తల్లి
రమ్మ వేమే నిన్ను నమ్మిన వారమే తల్లి
అమ్మా కల్పవల్లి మా కోర్కె తీర్చుమా తల్లి
పరుగున రచ్చింపవే శ్రీలోక జననీ తల్లి
అరమరేలను మమ్ము కరుణ జూడుమా తల్లి
దరనిలో దుపాటిపురి అజసతి వినుమా తల్లి"

తర్వాత సీతారాములు అరణ్యవాసంలోని ఇతివృత్తాన్నంతా గేయాలాధారంగా మన కళ్ళకు కట్టినట్లు చూపిస్తారు. జానపదులు రామాయణాన్ని అల్లుకున్నంతగా మరి ఏ గ్రంథాన్ని కూడా అల్లుకో లేదు. రామాయణం ప్రీతిపాత్రమైందిగా కన్పిస్తుంది అందులో ఈ నృత్యమంతా రామాయణమే ఎక్కువగా కన్పిస్తుంది.

శ్రీరామచంద్రుడు తండ్రి మాట ప్రకారం అడవుల కెళు తున్నపుడు దృశ్యమిలా కన్పిస్తోంది——

"పోయి వచ్చెద మోసల వానగుము జనకా
మ్రొక్కెదమూ పోయివచ్చెద మయ్యా పొందుగా శెలవిమ్మ
తమ్మునకు భరతునకు రాజ్యమిచ్చియు ॥పోయి॥

అమ్మా కౌసల్యా సుమిత్ర కైక మాయమ్మ
ముగ్గురి తల్లులకు ముదముతో వందనమ్మ.
ముందుగా మ్రొక్కితిమి పొందుగా శెలవిమ్ము ॥పోయి॥

వందానమయ్యా విశ్వామిత్ర పరగునవర్యా
వందానమయ్యా నీ పాదార విందములకు
దీవించి పంపుడి దివిజలు మెచ్చగా ॥పోయి॥

హితులారా రండి స్నేహితులారా మీరైనరండి
హితులార మిము విడచి విపిన భూములకును
చనుచున్న వారము జానక లచ్చునతో ॥పోయి॥

ముని వేషములనూ జానకీ నాతా చేతోను
పొమ్మాని శెలవిచ్చె పొందుగా కైకమ్మ
సంతోసమాయెను సౌమిత్రికి నాకును ॥పోయి॥

అయోద్ది యిడచి మముగన్నట్టి
తండ్రిని బాసి నిర్దోసి యైనట్టి
తమ్ముని భరతుని రాజుగా కొలవండి ॥పోయి॥

మారీచుణ్ణి మాయ లేడిగా చూసి సీత రామున్ని ఇలా అడుగుతోంది.

"నా మనోహర రామచంద్రా
నాదు కోర్కెలు తీర్చుమా
పర్ణశాలకు వచ్చెను బంగారు
లేడిని చూడు మా
సుందరాంగా దాని కన్నులు
సుక్కలు కాబోలునూ
ప్రాణనాధా దాని దేహము
పంచవన్నెల చాయనూ"

సీత ఊర్మిళ సంభాషణలో మరది పై ఉన్న ప్రేమను తెలియ జేసే గేయమీలా ఉంది—

"వినవే వూర్మిల నా ముద్దు చెల్లెలా
రాముల తమ్ముడమ్మ నా మరది
రగులచ్చుమయ్య దేవుడమ్మ నా మరది ॥వినవే॥
యేడుయేడండ్లనాడు యెండిన గజ నిమ్మ
పండును తెమ్మానె నా మరది
రగులచ్చున దేవుడమ్మ నా మరది ॥వినవే॥
పది పదేండ్లనాడు పాడుబడ్డ బాయి కింద
పంటలు పండించె నా మరది
రగులచ్చున దేవుడమ్మ నా మరది ॥వినవే॥
పుట్టెడు నూగులు భూమిపై యగజల్లి
రాసి కట్టించినాడు నా మరది
రిగులచ్చున దేవుడమ్మ నా మరది ॥వినవే॥
రాతి గోవును తెచ్చి రచ్చలో నిలబెట్టి
పాలె పిండించె నా మరది
రగులచ్చునమయ్య దేవుడమ్మ నా మరది ॥వినవే॥

కిల కిల నగినాడు లచ్చుమయ్య దేవుడు
నవ్విన కారనం చెప్పవయ్య నీవు
నవ్విన కారనం చెప్పవయ్య నీవు
బంగారు సావిట్లో బల్లి పలికెనాది
అందుకు నవ్వితి వోవదినా
నేనందుకు నవ్వితి వోవదినా"

సంవాద రూపమైన గేయంలో మొదట గురువు ఒక పాదాన్ని పాడితే, తక్కిన ఆటగాళ్ళు దానికి వంత పాడుతారు. తర్వాత శిష్యుడు ఇంకొక పాదం పాడితే, తక్కిన ఆటగాళ్ళు దానికి వంత పాడుతారు. తర్వాత మధ్యలో ఉండే ఇద్దరూ ఎదురుబదురుగా పోటీగా ఆడటం ఉంటుంది ఇద్దరూ అభినయంగా చూడముచ్చటగా కనిపిస్తారు. చుట్టూ ఉన్నవారు మామూలుగా అడుగులు వేస్తూ ఉంటారు. ఈ సంవాద రూపకం ప్రారంభంలో లయాత్మకంగా ఆటగాళ్ళ అనే మాటలు అందరికీ వినసొంపుగా ఉంటాయి. ఈ ఆట చూస్తే నృత్యం యొక్క గొప్పదనం కనిపిస్తుంది. కానీ వ్యాసరూపంలో న్యాయం చేకూర్చటానికి వీలులేదు.

ఆకాశవాణి కడప కేంద్రంవారు రామన్న లక్షుమన్న బృందం వారి చెక్కభజన నృత్యాన్ని అపుడపుడు ప్రసారం చేస్తున్నారు. కడప జిల్లాలో ఈ బృందాలెక్కువ. పులివెందుల తాలూకాలో ఈ నృత్యానికి సంబంధించిన గేయాలు సుమారు 85 వరకు సేకరించాను. జానపద నృత్యకళ మీద పి. హెచ్. డి. చేస్తున్న ఈ వ్యాసకర్త సుమారు 28 నృత్యాల వరకు వెలికితీయటం జరుగుతోంది. అట్టడుగున పడివున్న జానపదసాహిత్యాన్ని వెలికి తీయటానికి మీలో ఏ మాత్రం అభిలాష కలిగించినట్లయితే (ఈ వ్యాసం వల్ల) వ్యాసకర్త సంతోషించగలడు.

శ్రీ చిగిచర్ల కృష్ణారెడ్డి

# కవిత్వము - మార్పు

తదాత్వే నూతనం సర్వ మాయత్యాంచ పురాతనం ।
న దోషాయై తదుభయం న గుణాయి చ కల్పతే ॥

"అనాటికది కొత్తదే. కొన్నాళ్ళపోతే పాతదౌతుంది. ఈ కొత్తదనంలో గాని, పాతదనంలో గాని రెంటిలోనూ గుణమూ లేదు. దోషమూ లేదు" అని పై శ్లోకం చెప్తూంది. "తాత తాతలనాటి కథలను త్రవ్విపోస్తానోయ్" అని విశ్వనాథ కంకణం కట్టుకుంటే "నూతన సంకేతాలను తాతలు గుర్తించలేరు" అంటూ అర్ద్ర ఢంకా బజా

యిస్తాడు. ఒకరు నిలకడ కావాలంటే వేరొకరు మార్పు కావాలంటారు. కావాలని కౌగిలించుకున్నంత మాత్రంలో ఏదీ శాశ్వతంగా నిలిచేది లేదు. అక్కరలేదని గుర్తించనంతమాత్రంలో ఏదీ మారకుండా ఆగేది లేదు. ఏళ్లూ పూళ్లూ అలాగే బ్రతికేస్తూపోతే బ్రతుకు ఇంత కంటే చవిటి పట్టు అవుతుంది. ఆగకుండా అలా అలా కొనసాగే పద్ధతికి చెందిన వ్యవస్థలో విముక్తి లేకుండా పోయినకొద్దీ - అంత హెచ్చుగానూ ఆ సమాజం పతన మౌతూనే వుంటుంది. అయినా మానవ జాతి ఎల్లప్పుడూ జిప్సీల మురాల్లా సంచార బృందం కాలేదు. ఇళ్లూ వాకిళ్లూ, ఊళ్లూ పట్టణాలూ, రాజ్యాలూ సామ్రాజ్యాలూ విస్తరించి నిలిచిపోవాలనీ, ఎప్పటికప్పుడు నిలిచిపోవాలని ప్రయత్నిస్తూనే వుంది. అంతకుమ్మించి కాలం కడు దొడ్డది అక్కడ మన కికురింపులు చెల్లవు. సువిశాల సామ్రాజ్యాలూ, సుదీర్ఘ సంస్కృతులూ లెక్కలేనన్ని కాల గర్భంలో కలిసిపోయాయి. ఇదొక నిరంతర వైరుధ్యం. "నిలకడ - మార్పు" అనే వైరుధ్యాల జంట కాలం అనే భావన చుట్టూ అల్లుకుని వుంది.

కవిత్వం శాశ్వత సత్యాలను రూపొందిస్తూ సంప్రదాయంలోని సారాన్ని చిరస్థాయిగా నిలవాలని పూర్వులు భావించారు కవిత్వంలో నిలకడ సంప్రదాయ దాస్యానికి - మార్పు ప్రగతిశీల చైతన్యానికి దారితీస్తాయని ఆధునికుల భావన. కాని ఇక్కడ మొదట నుదహరించిన శ్లోక భావాన్ని స్మరించడం విజ్ఞుల బాధ్యతగా కన్పిస్తుంది. గుణ దోషాలు కేవలం సంప్రదాయం - మార్పు అనే దృక్పథాలను ఆశ్రయించుకుని రూపొందేవి మాత్రం కావు. వాటిని నిర్ణయించే శక్తులు వేరు. భగవంతుడు సృష్టిచేసినప్పుడే మనకు ఈయదగిన పదార్థా న్నంతటినీ ఒక్కసారిగా ఇచ్చేడని, అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ అందులోంచి మనం కోల్పోయేది కాని దానికి అదనంగా చేర్చగలిగిందిగానీ ఏమీ లేదని ఒక వర్గానికి చెందిన తాత్త్వికుల భావన, "ఈ సంసార మిదెన్ని జన్మలకునేనీ మౌని వాల్మీకి భాషా సంక్రాంత ఋణంబుఁ దీర్పఁగలదా ? సత్కావ్య నిర్మాణరేఖా సామగ్రి ఋణంబుఁ దీర్పఁగలదా ?" అనే విశ్వనాథ భావన ఈ కోవకు చెందినది. వారి దృష్టిలో కవిత్వ పదార్థానికి శాశ్వతత్వం వుంది. "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అనే మాటకూడా మరొక స్థాయిలో ఈ రకమైన నిలకడనే ప్రతిపాదిస్తుంది. అయితే వాల్మీకి - బాణుల వంటి వారుకూడా అంతకుముందు లేనిదానిని సృష్టించలేదని అనగలమా ! ఆనందవర్ధనుడు "న హి వాచస్పతినాపి కోఽప్యపూర్వో విధీయతే" అని చెప్పినా సాహిత్యంలో వాల్మీకి - బాణ ప్రభృతులు ఒక నూత్న వ్యవస్థను నెలకొల్పిన విషయం ఎవరూ కాదనలేనిది. అయితే అలాంటి నూత్నావిష్కారాలు సైతం స్థల కాలావధుల్లో మునుదే విశేషింపబడి వుంటాయని — సామాన్యునికి అందకుండా దోబూచులాడే ఆ శక్తుల్ని మేధావులు తమ దర్శనం ద్వారా అంది పుచ్చుకుని ఆవిష్కరించడం ద్వారా నూత్న వ్యవస్థకు రూపకల్పన చేస్తారనే వాదం ఒకటుంది. ఆ దార్శనికుని శక్తి ఎంత బలిష్ఠమైనదైతే అంత ఎక్కువ కాలం అది నిలకడను కలిగివుంటుంది. ఆ శక్తి బలహీన మైనప్పుడు ఆ మూలకాలే ఇంకొక రకమైన అమరికను పొంది నూత్న రూపంగా అవతరిస్తాయి దానిని మనం మార్పుగా అంగీకరిస్తాం. మార్పును అంగీకరించని వారు వర్తమాన వాస్తవికతలను గతానికి చెందిన సంభావ్యములుగా — గొప్పవయినా వెనక్కునెట్టి ఇప్పటి నూతన సమ్మేళనాలను ఇదివరకెప్పుడో ఉన్నవే అని వాదించడం వుంది, కాని అందువల్ల ఉపయోగం లేదు. వస్తువు యొక్క సంభావ్యత ఎప్పుడూ ఒక ఆకారూపానికి మించిన ఉనికిని కలిగి ఉండదని తాత్త్వికుల భావన. వాస్తవికత మాత్రం ఉనికిని కలిగి వుంటుంది. ఉనికి మాత్రమే మార్పును సూచిస్తుంది. వాస్తవ పదార్థాలతో కూడిన పరిణామాత్మక ప్రపంచంలో నిలకడ గల వస్తువులు చేసే సాహసాల వర్ణనే 'మార్పు' అని వైట్‌ఫీల్డ్ అభిప్రాయం, కవితా రంగంలో ఈ సాహసాలు మనకు మూడు రీతులుగా కనిపిస్తాయి.

1. ప్రాచీనమైన వ్యవస్థకు సంబంధించిన ఆకస్మాత్సంఘటనల ద్వారా ఏర్పడిన మార్పు.
2. స్వయంప్రతిపత్తి గల నూతన వ్యవస్థ ఆవిర్భావం.
3 ప్రాచీనమైన వ్యవస్థను అంతరింప జెయ్యటం.

పురాణేతిహాసాల వ్యవస్థలో రస లోలుపత్వం ప్రవేశించి కావ్య - నాటక ప్రక్రియలను ఆవిష్కరింప జెయ్యడం ఇందులో మొదటి రకానికి చెందుతుంది. కాళిదాస - భవభూతులు ఈ రకమైన మార్పును వ్యవస్థీకృతం చెయ్యడానికి లోకంతో ఎలా తలపడ్డారో మనకందరికీ తెలియనిది కాదు. కావ్య - నాటకాల యుగం చెల్లినంత కాలం సాహిత్యంలో ఐతిహాసిక - పౌరాణిక ప్రాబల్యం నిరంతరాయంగా కొనసాగి వస్తూనే వుంది. యథార్థానికి కావ్య నాటకాంకు ప్రత్యేకమైన స్థితి లేదనవచ్చును. కాల్పనిక యుగం ఒక స్వతంత్ర పురస్కారంతో అవతరించింది. 'ఏద్దియో అపూర్వ మధురశక్తి స్ఫురియించుగాని అర్థమ్ము కాని భావగీతమ్ము లవియే' అనే భావన భావకవుల స్వయంప్రతిపత్తిని రూఢి చేస్తుంది. ఇందులోని అపూర్వ మధురశక్తి కొత్తదనాన్ని తెలియ చేస్తుంది అర్థం కాకుండా ఉండే లక్షణం స్వయంప్రతిపత్తిని వ్యక్తం చేస్తుంది. అర్థం కాలేదంటే పాతదనం లేదన్నమాట. ప్రతి కొత్త విషయాన్ని పాత విషయంతో ముడిపెట్టడంలోనే అవగాహనను ఆరంభించే రీతిగా మానవుడి బుద్ధి రూపొందించబడిం దంటాడు బెర్గ్‌సన్. అందుచేత క్రొత్తది అర్థం కావాలంటే అది ఒప్పందాల ద్వారా అభివ్యక్తం కావాలి. పాత ఒప్పందాలను పరామర్శించకపోవడం వల్లనే భావకవిత్వం అర్థంకాదనే అభియోగానికి గురయింది. ఈ రకమైన స్వయం ప్రతిపత్తిని

సాధించినా భావకవిత్వం ప్రాచీన కవిత్వం యొక్క చలామణిని ఆటంకపరచలేదు. అభ్యుదయ కవిత్వం ఆ అవకాశాన్ని అందిపుచ్చు కుంది. అదొక స్వయం ప్రతిపత్తి గల నూత్నావిష్కారంగా రూపొందడమే కాకుండా ప్రాచీన సంప్రదాయాన్ని అంతరింపజేసే ప్రబల శక్తిగా పరిణమించింది. ఇందుకు కేవలం కవిత్వం కారణ మనుకుంటే అది ఒట్టి భ్రమే అవుతుంది. కవితా ప్రపంచాన్ని బాహ్య ప్రపంచం పరిపాలించడమే ఇందుకు కారణం. ఆధునిక యుగ లక్షణాలను కాదని ఏ ఒక్క మార్పుని కవితా రంగంలో వ్యవస్థీకృతం చేయలేక పోయారన్న సంగతి మన మిక్కడ విస్మరించ కూడదు. సమాజంలో కాని కవిత్వంలో గాని తాత్త్వికులు కవులు కావాలను కున్న మార్పులు ఒక్కసారిగా రావు మార్పుతో కూడిన భావాలను స్వీకరించడానికి ప్రజలు సిద్ధంగా వుండాలి. ఒకొక్కసారి ప్రజలు సిద్ధంగా వున్నా పరిస్థితులు అనుకూలించకపోతే మార్పులు రావు. అనూరుడిలా జనించిన అనేక మార్పులు ఆభాస రూపంగా నిలవడం మనకు తెలుసు అభ్యుదయ కవిత్వంతో పాటు తెలుగు కవితా రంగంలోకి అర్థాంతరంగా దుమికిన అతి నవ్య కవితా ధోరణులు తెలుగు కవితా ప్రియులకు మింగుడుపడక పోవడానికి కారణమిదే. ప్రజలు గురజాడను గ్రహించడానికే కొంతకాలం పట్టింది. సంప్ర దాయం నుండి విడిపడ్డ వారైనా ఆధునికులు సైతం ఎప్పటికప్పుడు ఒక వ్యవస్థను రూపొందించడానికి ప్రయత్నం చేస్తూ వుంటారు. అయితే సృష్టిలో నియతమైన దేదీ లేదని మార్పు మాత్రమే సత్యమైన దనే తాత్త్విక సూత్రం ఆధునిక కవిత్వానికి సైతం వర్తిస్తుంది. వస్తువు - రూపం - సంవిధానం అనే కవిత్వాంశాల విషయంలో పూర్వుల మీద తీవ్రంగా ధ్వజమెత్తిన ఆధునికులు అవే అంశాలకు సంబంధించి అనేక ఆరోపణలను, నైరాశ్యాలను ఎదుర్కోవలసిన సమయ మాసన్నమవుతుంది.

తాత్త్వికులు కొందరు ద్రవ్యం శాశ్వత మన్నారు కవిత్వంలో ద్రవ్యం, రూపం శాశ్వతమేనన్న అభిప్రాయం కొన్ని శతాబ్దాల పాటు అప్రతిహతంగా నిలిచింది. ఆధునికులలో అనేకులు మార్పుని కోరే ఎడతెగని దాహాన్ని కలిగివున్నట్టే ఈ శతాబ్దానికి పూర్వులైన కవులు సంప్రదాయ పరిరక్షణ పట్ల అంతటి దృఢమైన దీక్షను పాటించడమే అందుకు కారణ మనిపిస్తుంది. వస్తువు ఉదాత్తము - రసవంతము కావాలన్నది వారి సాధారణ నిబంధన. 'కాదేదీ కవిత కనర్హం' అనే భావన వారికున్నా అది గౌణం. సతత మనన ధారణ లకు యోగ్యమైన, పరిచితమైన ఛందం వారి కవితకు రూపా న్నిచ్చింది. కవిత్వానికీ పాండిత్యానికీ చుట్టరికం లేదని ఈ శతాబ్దా నికి పూర్వం తేలలేదన్న చెళ్లపిళ్లవారి మాట అక్షరాల నిజం. సంవిధానంలో సైతం వారి నవ్యత ఒక సంయమనాన్ని కలిగి వుంది. చాటువులు - ముక్తకాలు అడపా దడపా వస్తూన్నా ఆనాడు కవి లక్ష్యం కావ్యం లేదా మహాకావ్య నిబంధనం. కల్పన వారి కవితకు అలౌకికత్వాన్ని సంతరించింది. శబ్దార్థ సమన్వయ శోభితమైన అనిర్వచనీయత వారి మార్గం. ప్రాచీన కవిత అక్షరాస్యులకు అక్షయానందాన్ని అందిస్తూ నిరక్షరాస్యులకు సైతం వేర్వేరు పరిధుల్లో నిరంతరాకర్షణగా మిగిలింది ఇప్పటికీ ఆ శక్తి పూర్తిగా పట్టిపోలేదు ఆధునిక కవిత వేపు ఆశగా చూసే అనేకులు ఈ భూమికను విస్మరించలేని అవస్థలో వున్నారు.

ఆధునికులు పై అభిప్రాయాలను త్రోసిరాజని శాశ్వత వస్తువుకు బదులు సమకాలీన సత్యాన్ని, పద్యానికి బదులు వచన కవితను చేపట్టారు. సంవిధానంలో సైతం అనేక మార్పులను అమలు చేసేరు. మొదట హారు పాండిత్యంమీద దెబ్బతీసేరు. అందుకే 'తొలి నాళుల పద్యార్థము తెలియనిచో పారకునిది తెలియమి —— యీ నాళుల వ్రాసిన కవి దోషము' అని విశ్వనాథ ఆక్రోశించడం జరిగింది. అయితే యీ పరిస్థితి ఎంతోకాలం కొనసాగలేదు. వాస్తవిక వాదం మరికొంత ముందుకుపోయి కల్పనను కాదుపొమ్మ న్నారు. అప్పుడు 'కవితాకామినికే వచ్చింది ఖాయిలా - అసలు గూటిలోనించే అదృశ్యమైందా కోయిల' అని నారాయణబాబు నెత్తి మొత్తుకున్నాడు. తోకల్తోకలుగా రాసుకుంటూ పోవడం ప్రాచీన ఛాందస మన్నారు. "ఇప్పటి కవికి అంత ఏకాగ్రత లేదు, అంత సాధకుడూ కాడు. తపస్సు తక్కువ ఇతనికి ఉదాత్తావేశం కూడా కొంచెం తక్కువేమో. మహాకావ్యం సృష్టించే ఆ మహా ముహూర్తం పోయింది." అంటూ కృష్ణశాస్త్రి బహిరంగంగా వెక్కివెక్కి రోదించేరు. శబ్దార్థాలు కవిత్వం కాదు పొమ్మన్నారు. కవిత్వం పిట్టలా ఎగిరిపోతుందని "నువ్వెంత సర్కసువాళ్ల వెల్తుర్ని నొక్కినా దాని రెక్కల్ని కాల్చదు" అని ఘంటానాదంగా చెప్పేరు. అయితే ఇలాంటివాళ్లు "నిర్వచనంలేని కవితా కంటక వనాంతరాల ప్రవాసులై నిర్వాసులై పోతున్నారు" అంటూ తిలక్, అతని అనుయాయులు నిష్కర్షగా వీరిపట్ల వైముఖ్యాన్ని ప్రదర్శించేరు. కవితకు కథ కావాలని కుందుర్తి వర్గం ఆరాటపడితే సామాజిక స్పృహతో కూడిన భావం చాలంటూ శ్రీశ్రీ వర్గం అడ్డునిలిచింది. అంతటితో కవిత్వ రూపం నినాదాలపుట్టగా మారిందన్న అభియోగం అవతరించింది. ఆరుద్రకు "మంచి కవిత యొక సమస్యగా మారి" నట్లనిపించింది "పద్యంతో బొడ్డుపేగు తెంచుకోకుండా వున్నంత కాలం ఆధునికత ఆ దరిదాపులకే రాదు" అని రమణారెడ్డి అభి ప్రాయం. కాని ఆ బొడ్డుపేగు తెంచుకోకుండా వున్న కారణంచేతనే శ్రీశ్రీ ప్రభృతుల కవితలు కొన్ని కవితాభిమానుల నోళ్లకు పట్టి ఇప్పటివరకూ నిలిచివున్నాయని. ఆ పేగు తెంచుకున్న రచనలు నోటికి పట్టవని, మననానికి అందవని స్పష్టంచేయవలసి వస్తూంది.

"వ్యవధిలేని అవధానం వెళిపోయిం దెళిపోయింది" అంటూ రుక్మిణీనాథశాస్త్రి బాజాలు కొట్టేడు. అయితే ప్రాచీనుల వస్తువు - రూప - సంవిధానం వందల సంవత్సరాల పాటు రసపిపాసువులను ఉర్రూతలూగించాయి. ఆధునిక కవిత్వంలో ఈ మూడూ ఒక వ్యవస్థగా బలపడక ముందే కేవలం మూడు, నాలుగు దశాబ్దాలకే పట్టిపోయి కవిత్వం నిలుస్తుందా? అనే ప్రశ్న ఎదురైంది. తాతలను పద త్రొక్కిన అరుద్రే

'పద్యాల సేద్యానికి యోగ్యమైనది కాదీ కార్తె
ఉద్యమాల ఉన్మాదాలలో ఉత్పాదిత మవుతున్నది ఆర్తి'

అంటూ నైరాశ్యానికి లోనవడం ఆధునిక వ్యవస్థలోని లోపమా? కృష్ణశాస్త్రి భావించినట్లు కవుల శక్తి హీనతా?

'నేస్తం, ఇక కవిత లేదు
దైనందిన ప్రాతఃకాంతిని నవత లేదు
ఏమని అడుగవద్దు
కనులు మూసిన కవితకు ఇది నా కడపటి ముద్దు'—

అంటూ బైరాగి కవితకు వీడ్కోలు చెప్పిన సందర్భాలున్నాయి. ఇప్పుడు తెలుగు దేశంలో కవిత్వం పేరుతో వస్తున్న చెత్తంతా చదువుతూ వుంటే ఒక ఎడారిలో నడుస్తున్నట్లుందని గుంటూరు శేషేంద్రశర్మ అంటే ఈ రోజుల్లో ఆయనొక్కడే మంచి కవిత్వం వ్రాస్తున్నాడని శ్రీశ్రీ ఆయనకో కితాబు నివ్వడం అందరికీ తెలిసిందే ఎవరైతే ఆధునిక కవులలో ఎన్నిక చేయదగ్గవారని అనేకులు భావిస్తున్నారో వారంతా ప్రత్యక్షంగానో పరోక్షంగానో తమను మినహాయించుకొని ఆధునిక కవితపై కొన్ని అభియోగాలు చేస్తున్నట్లే కనిపిస్తుంది. అందుచేత ఈ కవితకు నిలకడ వుంటుందా అన్న సందేహం కొందరిని బాధిస్తూంది.

'చైతన్యవంతమైన ప్రాణికి మార్పు మాత్రమే ఉనికిని కల్పిస్తుంది. మార్పు పొందడమంటే వికాసాన్ని పొందడమే తనను తాను నిరంతరం పునస్సృష్టించుకోవడమే వికాసం' అంటాడు బెర్గ్సన్. ఈ వికాసం కాలం అనే ప్రమాణం ఆసరాగా కొనసాగుతుంది. నిరంతర సృజన శీలురు అరుదుగా పుట్టారు. అందుకే 'కాచిత్కవీనాం నవా దృష్టిః' అన్నారు అభిజ్ఞులు. ఎన్ని మారినా మానవతా విలువలకు మార్పు లేదు దానిని కాంక్షించడమే నిజమైన అభ్యుదయం. అందుకే మానవుని అనూహ్య సాహసాభియానాలన్నింటిలోనూ కనిపించే ఆత్మీయతా లక్షణం ఒకటుంటుంది మార్పు మధ్య వ్యవస్థని - వ్యవస్థ మధ్య మార్పుని సంరక్షించుకోవడమే అభ్యుదయంలోని కళాత్మకత అందుకె "పాత కొత్తల మేలి కలయిక"తో క్రొమ్మెరుంగులు జిమ్మిన గురజాడ అభ్యుదయ కవితకు అసలైన నాయకుడు. ఏ ఉద్యమానికి ఆ నినాదాన్ని చేబట్టిన కాలజ్ఞాను లందరూ కాల పరీక్షకు తట్టుకోవలసిన అవసరం కనిపిస్తూంది. నేటి మనుష్యులు రేపటి తీర్పుల నందించలేరు. భవిష్యద్ద్వారాలు విశాలంగా తెరుచుకుని వున్నాయి స్వేచ్ఛకు ఎల్లలులేని నేల దత్తం చేయబడివుంది. అంత వరకు ప్రతి యథార్థ వస్తువు శాశ్వతంగా ఉంటుందని అంగీకరిస్తూనే ప్రతి ఉదయం తన పరివర్తన ప్రమాణంతో కూడిన నూత్నసత్యాన్ని కలిగి ఉంటుందని అంగీకరించాలి. ఇప్పటికింకా "గాలి గాలంతా కవిత్వమే-భూమి తనువంతా కవిత్వమే" అంటున్నారు శివారెడ్డి "రేపు ఎటువంటి కవిత్వం వస్తుందో చెప్పలేను" అన్నారు శ్రీశ్రీ.

డా॥ యం. ఎ. నరసింహమూర్తి

# లేఖలు

## చరిత్ర విరుద్ధం

శ్రీ వెనిగళ్ళ రాంబాబుగారి శిల్ప విలాపం (భారతి ఫిబ్రవరి 84) చదివిన తర్వాత నాలో ఎన్నో సందేహాలు మొలకెత్తాయి. రాంబాబుగారు బహుశా కరుణశ్రీ వల్ల ప్రేరితమై 'పుష్ప విలాపాన్ని' శిలా విలాపంగా రూపొందించడానికి యత్నించారు. కానీ ఈ కవిత చాలా పేలవమై చరిత్ర విరుద్ధంగా రూపొందింది. బౌద్ధ మతం భారత దేశంలో అంతరించడానికి - అసలు పూర్తిగా అంతరించిందా? (భారత దేశంలో 1971లో 40 లక్షల మంది బౌద్ధులు ఉన్నారని జనాభా లెక్కలు తెలుపుతాయి.) కారణం బౌద్ధ మతంలోని లోపాలే కాని "కుటిల హైందవ జాతి కుట్రవల్ల" కాదు. దేవుడే లేడని, అంతా శూన్యమని వాదించిన బౌద్ధులు సంఘ మర్యాదను, సంస్కృతిని అతిక్రమించినారు. సనాతనమైన ధర్మాన్ని త్రోసిరాజనడం ఒక ఎత్తు, దానికి పర్యాయంగా ఒక నిర్దిష్టమైన అనుసరణీయమైన సాంఘిక మర్యాదను పెంపొందించడం మరో ఎత్తు. మొదటిది చాలా తేలిక. రెండవది చాలా కష్టం, ఈ కష్ట సాధ్యమైన కృషిని సఫలీకృతం చేయడంలో బౌద్ధం పరాజయమైనది. ఇది చారిత్రిక సత్యం. బౌద్ధ విహారాలు "లంజ దిబ్బలైనాయి" సాంఘిక బాధ్యత నైతిక బాధ్యత లోపించిన రాజులచే అహింసా సిద్ధాంతాలు మరీ విపరీత స్థాయికి కొనిపోబడి, రాజ్యాలను నిర్వీర్యం చేసింది. విదేశ శత్రువులకు ఆహ్వానం పంపింది. హిందూ దేశం విచ్ఛిన్నం అవడానికి తోడ్పడింది. చరిత్ర సత్యం ఇలా వుండగా ఏవో తమ భావోద్రేకంతో చరిత్రకు ద్రోహం తలపెట్టడం ప్రతిభావంతుల లక్షణం కాదు. అసలు బౌద్ధ మతం భారత దేశంలో జన్మించింది. దానిలోని విశిష్టమైన గుణాలు ఎప్పుడో హిందూ మతంలో ఆవిర్భవించినాయి. ఇస్లాంవలె అది హిందూ మతానికి విరుద్ధం కాదు, విదేశ మతం కాదు

ఒక్క అమరావతీ విషయం ఏమోగాని ఎల్లోరా, అజంతాలలో హిందూ దేవాలయాలు, బౌద్ధగుహలు సమీపంగా విరాజిల్లుచున్నాయి. దేశంలో 80% శాతం కల "కుటిల హిందువులు" అశోక చక్రాన్ని

తమ రాజ్యానికి చిహ్నంగా ఎన్నుకొన్నారు. అన్ని మతాలను సమంగా భావించి సెక్యూలర్ రాజ్యాన్ని స్థాపించిన - దారిసిపోయే తద్దినాన్ని కొనితెచ్చుకొన్న - హిందువులు నిజంగా" దుర్జనులే మరి"

ఇక "కరుణ" "అహింస" "పరోపకారం" వంటి గుణాలు రంగరించుకొనిన బౌద్ధ మతానికి ప్రతీకంగా నిల్చుకొన్న ఆ శిల్పంచే కవీశ్వరుడు అనిపించిన వాక్కులు గమనించండి : "హిందూ మతము నిలువెల్ల హింస చేసి (అసలు మతాన్ని హింస చేయడమేమిటో) కరుణ లేకుండ నద్దాని ధరణి నుండి కనుమరించక.........." భేష్ నిజంగా బౌద్ధ మతంలోని ఇంత వఱకూ అవగాహన కాని అంశాలను వెలుగులకి తెచ్చి, బౌద్ధ మతం అసలు రంగును చూపించాడు.

ఒకవైపు సర్దార్జీలు మేము వేరే జాతి అని, దలితులు మేము వేరే జాతి అని, క్రైస్తవులు అందరిని మతం మార్చడానికి తమకు రాజ్యాంగ హక్కున్నది అని వాదిస్తుంటే తమ ఇందిలోనే బందీ అయిన హిందువులు నిజంగా "దిరిపములే"

**డా॥ యం. మురళీధర్,** బొంబాయి.

# గ్రాంధికంలో వ్యావహారికం

ఫిబ్రవరి, 1984 సంచికలో శ్రీ వెనిగళ్ల రాంబాబుగారు వ్రాసిన "మౌన గీతం (అను) శిల్ప విలాపం" అనే కవితలో కొన్ని స్ఖాలిత్యాలు కనిపించాయి. వాటిని మీ దృష్టికి, పాఠకుల దృష్టికి తేవాలని ఈ లేఖ వ్రాస్తున్నాను.

కవిగారు దీన్ని తేటగీతుల్లో వ్రాసినట్లు కొద్దిపాటి పరిశీలన వల్లనే తెలుస్తుంది. ఛందోబద్ధమైనంతమాత్రాన గ్రాంధికమే వాడాలన్న నియమం లేకపోవచ్చు శ్రీశ్రీగారి "సిరిసిరిమువ్వ శతకం"లో వలె వ్యావహారికం వాడవచ్చు కాని రాంబాబుగారు ఖండికను గ్రాంధికంలో వ్రాస్తూ, వ్యావహారికపు అతుకు లుంచడం దురదృష్టకరం. వారు సంప్రదాయ రీతిలో తేటగీతుల్లో వ్రాస్తూ కొన్ని దోషాలు దొర్లించారు. ఉదాహరణకు కొన్నింటిని వాటి శుద్ధరూపాల్తో యిస్తున్నాను.

సద్దు ఓ ప్రతిమనుండి [సద్దొక ప్రతిమనుండి]; ప్రతిమిట్లు [ప్రతిమ యిట్లు]; రమ్ము మోయి [రమ్మోయి]; అలవర్చి [అలవరచి]; ఏను యిప్పటిదానను [ఏ నిప్పటిదానను]; సభ్యతేది [సభ్యత యేది]; అర్హతేది [అర్హత యేది] మొదలగునవి.

బౌద్ధశిల్పం తన బాధను వ్యక్తంచేస్తూ, "ఏను యిప్పటిదానను కాను" అని ప్రారంభిస్తు- "నిల్చినాడ, పుట్టినాడ, జీవించినాడ" అనడం జరిగింది. స్త్రీలింగమో పుంలింగమో తెలుపనక్కరలేదనుకుంటే, అప్రాణివాచకమని భావించినా, "దానను" అని కొనసాగించాలి.

సంధి చేయని తావులందు విసంధి పాటించవచ్చు గాని కృతకమైన యడాగమాలు వాడారు రాంబాబుగారు.

**గు. కృష్ణమూర్తి నాయుండు,** ప్రియా అగ్రహారం.

# అను వా దా లు

గాథాసప్తశతి అనువాదాలకు సంబంధించి 1983 డిసెంబరులో మదిపేడు ప్రభాకరరావుగారు, 1984 సెప్టెంబరులో సూర్యదేవర రవికుమార్‌గారు కొన్ని వివరణ లిచ్చారు. వారితోబాటు, నాకు తెలిసిన కొన్ని అనుమానాలను తెలియజేస్తాను. 1980 - 82 మధ్యకాలంలో రెండేళ్ల గాథాసప్తశతి పాఠం చెప్పవలసి వచ్చింది. అందులో విభిన్న అనువాదాలను తులనాత్మకంగా చెప్పవలసివచ్చింది. అందుకోసం చాలా అనువాదాలు సేకరించాను. కొన్ని దొరకలేదు.

పై ఇద్దరు మిత్రులు పేర్కొన్నవారిలో రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మగారు, కూచిభొట్ల ప్రభాకరశాస్త్రిగారు (ఈయన ఒక్కరే అనువదించ లేదు కూచిభొట్ల వీరరాఘవశాస్త్రిగారితో కలిసి చేశారు), ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు, కోవెల సంపత్కుమారాచార్యగారు, దిగుమర్తి సీతారామస్వామిగారు, తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారు, వాసిరెడ్డి వెంకట సుబ్బయ్యగారు మాత్రమే కాక ఇంకా కొందరు అనువాదకు లున్నారు.

ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు 1960 అగష్టు భారతిలో "గాథామాధురి" అని ఇరవై రెండు గాథల్ని అనువదించారు. ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారి గాథాసప్తశతిని (అనువాదాన్ని) తిరుమల రామచంద్రగారు సమీక్షిస్తూ శాస్త్రిగారి అనువాదం కన్నా, మల్లంపల్లి శరభయ్యగారి పద్యాలు బాగున్నాయంటూ రెండు మూడు పద్యాలుదహరించారు (భారతి, ఏప్రిల్ 1959.) నేను వెంటనే శరభయ్యగారికి ఆ పద్యాలను పంపమని ఉత్తరం రాశాను. వారు "ఆ పద్యాలు నాకు గుర్తు లేవు. నీ దగ్గర ఉన్నవి రాసి పంపిస్తే సంతోషిస్తాను" అని రాశారు. రాసి పంపాను

రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు నాలుగు వందల గాథల్ని మాత్రమే అనువదించినట్లు ప్రభాకరరావుగారు అన్నారు. కాని 1931 ప్రచురణలో 395 గాథలు ప్రచురించినట్లు, 1964 లో 784 గాథ లున్నట్లు తెలుస్తుంది. '64 లో ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు ప్రచురిస్తూ ప్రకాశకుల విజ్ఞప్తిలో ఈ విషయం పేర్కొన్నారు.

అనువాదాలన్నీ ఈనాడు దొరకడం లేదు. అన్నీ లభిస్తే తులనాత్మక పరిశీలనకు అవకాశం కలుగుతుంది.

**రాచపాళెం చంద్రశేఖర రెడ్డి,** అనంతపురం.

# గ్రంథ విమర్శలు

## ప్రసన్న కథావిపంచి

[నన్నయ భారతంలోని కొన్ని ఉపాఖ్యానాలకు సరస వ్యాఖ్యానం. డెమ్మీసైజు 416 పుటలు వెల: రూ. 13=00 ప్రకాశకులు. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-500004]

సంస్కృత పురాణేతి హాసాలననుసరించి తెలుగులో వ్రాయబడిన గ్రంథాలలోకూడా, మూలసంస్కృతం మాదిరిగా ప్రధాన కథతో పాటు మరికొన్నికథలు సందర్భానుసారంగా చెప్పబడుతూ ఉన్నవి. అవి మూలకథకు మెరుగు పెట్టేవిగానూ, కొన్నిచోట్ల ముఖ్యకథకంటె ఎంతో రసవంతంగానూ ఉంటాయి. కవిత్రయంవారి భారతంలో ఈ ఉపాఖ్యానాలు మిక్కిలి రమణీయంగా కానవస్తాయి. అందువల్లనే కమనీయ గ్రంథాల పద్యభాగంలో తరచుగా వీటిని చేర్చడం జరుగుతున్నది. ఆదికవి నన్నయభట్టుగారి భారతభాగంలోని కథలు ఎంతో ప్రసన్నత కలిగిఉంటాయి. సాహిత్యాభిమానుల ఉపయోగార్థం ప్రసన్నభావయుక్తములైన నన్నయగారి ఉపాఖ్యానాలను ఆంధ్రప్రదేశ్ ఎనిమిదింటిని తీర్చి సమర్థులైన విద్వాంసుల వ్యాఖ్యానాలతో సాహిత్య అకాడమివారు "ప్రసన్నకథావిపంచి" అనే పేరుతో ఈసంపుటాన్ని ప్రకటించారు. విపంచి సప్తస్వరాలను పలికించి సహృదయులకు ఆమోదాన్ని కలిగించినట్లే సరళ వ్యాఖ్యానాలతో కూడిన ఈ ఉపాఖ్యానాలు అందరికి సంతృప్తిని కలిగించ గలవని చెప్పవచ్చును.

వీటిలో మొదటిది ఉదంకోపాఖ్యానం-వ్యాఖ్యాత. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు. రెండవది గరుడోపాఖ్యానం-వ్యాఖ్యాత. డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు, మూడవది యయాతి చరిత్ర- వ్యాఖ్యాత ఖండవిల్లి లక్ష్మీరంజనంగారు. నాల్గవది శకుంతలో పాఖ్యానం-వాఖ్యాత మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు. అయిదవది నలోపాఖ్యానం వ్యాఖ్యాత డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు. తర్వాతి మూడూ వరుసగా రురూపాఖ్యానం, ఆస్తీకోపాఖ్యానం, ఆజగరో పాఖ్యానమున్నూ. వీనివ్యాఖ్యాత జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు.

ఉపాఖ్యానాల ఎన్నిక బాగానే ఉన్నది. వ్యాఖ్యాతలూ సమర్థులైన విద్వాంసులే కానివ్యాఖ్యలన్నీ ఒకపద్ధతిలోలేవు. హనుమచ్ఛాస్త్రిగారు మూలంలోని కఠినపదాలకు మాత్రం అర్థం ఇస్తూ, భావాన్ని తెలిపి, తమకుతోచిన విశేషాలను వివరించారు. వేంకటావధానిగారు ప్రతిపదార్థ తాత్పర్యాలను ఇచ్చారు. యయాతిచరిత్రమూలం ఇయ్యబడలేదు. వ్యాఖ్యాత. లక్ష్మీరంజనంగారు, మూలగద్యపద్యాల సం
వాటి ఆద్యంతాలను ఇచ్చి అర్థతాత్పర్యాలను, అవసరమైనచోట
పాలను తెలియజేశారు మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి
అన్నిటికీ అర్థం వ్రాయలేదు. అక్కడక్కడ కొన్నిటిలో కఠిన
లకు మాత్రం అర్థంవ్రాస్తూ, భావాన్ని, విశేషార్థాలనూ తెలియజే
డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు కఠిన పదాలకు అర్థాల
తాత్పర్యాలనూ, కొన్నిచోట్ల విశేషాలనూ ఇచ్చారు. జంధ్యాల పా
శాస్త్రిగారు కఠిన పదాలకు అర్థాలనూ. తాత్పర్యాలనూ వ్రా
ఉపాఖ్యానాలన్నింటికీ ఒకేమాదిరి వ్యాఖ్యానం ఉంటే ఇంత
బాగుండేది.

ఉపాఖ్యానాలు నన్నయ భారతభాగంలోని పర్వాల క్రమ
అనుసరించిగాని, ఆశ్వాసాలను అనుసరించిగాని లేవు. ఇవి క్ర
తప్పించి ముద్రించడంలో అభిప్రాయమేమో తెలియడంలేదు. యయ
చరిత్ర మూలాన్నికూడా ప్రకటించడం ఎలానో అవసరం. మ
లేనందున పాఠకులకు ఎంతో అసౌకర్యంగా ఉంటున్నది.

ముఖ్యమైన ఉపాఖ్యానాలను అర్థతాత్పర్యాలతో ప్రకటించ
ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ వారి సంకల్పం ప్రశంసనీయమై
అకాడమీవారు తిక్కన, ఎర్రనల రచనలలోని ఉపాఖ్యానాలను, ప్ర
ప్రబంధాలలోని రసవంతమైన ఉపాఖ్యానాలనూ కూడా ఈ విధం
ముద్రించి ప్రకటిస్తే ఆంధ్రసాహిత్యాభిమానులకు ఎంతోఉపయోగ
ఉంటుంది.

## తాలాంకనందినీ పరిణయము

[గ్రంథకర్త ఆసూరి మరింగంటి వేంకట నరసింహాచా
గారు. సంపాదకులు- శ్రీరంగాచార్యగారు. డెమ్మీ 64 + 386 +
పుటలు, వెల 12 రూ. లు. గట్టిబైండు. ప్రకాశకులు- ఆంధ్రప్ర
సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-400

బలరాముని పుత్రికఅయిన శశిరేఖతో అర్జునుని కుమారు
అభిమన్యునికి జరిగిన వివాహ కథను తెలిపే ఇతిహాస
ప్రబంధంయిది. తాలాంకుడు బలరాముడు. నందిని శశిరేఖ.
వివాహ వృత్తాంతం తెలుపుతున్నందున దీనికిపేరు గ్రంథకర్త
చమత్కారంగా పెట్టబడింది. ఇదివరకు ఈ కథను ప్రబంధయుగం
అప్పప్పకవి శశిరేఖాపరిణయమనే పేరుతో ప్రబంధంగా వ్రాశా
ఇది మరొక పద్యకృతి.

ఈ కథను అందరూ చెప్పుకుంటారుగాని, భారతంలోగాని, ·రి వంశంలోగాని, భాగవతంలోగాని ఇది కానరాదు. పురాణాలలో ఏ కథలను కల్పించి చెప్పుకోడం మనవారికి పరిపాటే గాని కొత్త దు.

శశిరేఖాభిమన్యుల శైశవంలోనే వారిద్దరికీ వివాహం జరిపించా నే సంకల్పం బలరామునికి లేకపోలేదు. కాని పాండవులు రాజ్య ష్టులై, వనవాసం చెయ్యవలసి వచ్చినందున, అతడు తన అభిప్రా యాన్ని మార్చుకుని దుర్యోధనుని కూమారుడు లక్ష్మణకుమారునికి శిరేఖ నిచ్చి వివాహం చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు. ఇందులో శకుని పాత్రకూడా కొంతపని చేసింది. సుభద్రాభిమన్యులు విచా ంతో ద్వారకనుండి వస్తున్నప్పుడు ఘటోత్కచుడు సంగతి తెలుసు 'ని తన మాయా ప్రభావం వల్ల ఆ వివాహం తప్పిస్తాడు. చివరకు శిరేఖాభిమన్యులకు వివాహం జరుగుతుంది. పాండవులు అజ్ఞాత సంలో ఉన్నందున ఆ పెండ్లికి రాలేకపోయారు. అజ్ఞాతవాసం ుగిసిన తర్వాత తమ సమక్షంలో ఉత్తరాభిమన్యులకు వివాహం, రిపించి, శశిరేఖా పరిణయానికి వెళ్ళని లోపం తీర్చుకున్నారు. ఇది ుందలి ప్రధాన కథాంశం. అప్పప్పకవి శశిరేఖా పరిణయ కథకూ, ుయి తాలాంకనందినీ పరిణయ కథకూ, వ్యత్యాసం కానవస్తుంది. ఈ వి, ఆ కథను కొంత మార్చి గ్రంథం చివర ఉత్తరాభిమన్యుల ువాహ కథను చేర్చి క్రొత్తదనాన్ని తీసుకువచ్చాడు.

గ్రంథకర్త తెలంగాణాకు చెందిన సూర్యాపేట నివాసి అని ంపాదకులు వ్రాస్తున్నారు. గ్రంథకర్త గొప్ప పండితుడు. మహా వి. ఈ శతాబ్దికి చెందినవారు. ఈయన ప్రబంధములు, నాటకములు, యక్షగానములు, స్తోత్రములు, శతకములు, మున్నగు పెక్కు గ్రంథములను రచించినారు. ఈ ప్రబంధములో తమ ప్రతిభా పాండిత్యములను వెళ్ళడించుచు చిత్రకవిత్వమును, బంధకవిత్వమును కూడ చెప్పారు. రచన సరళంగానూ రసవంతంగానూ సాగింది. ఒక్క ఉదాహరణ- —

"కుంతీసూనుల నిట్లరణ్యము నకుం
గ్రోధాత్ముండై పంపి, ని
శ్చింతం జెంది సుయోధనుం డతులిత
శ్రీ గర్వదుర్వారవి
భ్రాంతాపస్మృతి మిన్ను మన్ను వివరిం
పన్ లేక మద్యన్మదా
క్రాంతుండై కురురాజ్య సంపదలనే
కచ్ఛత్రుండై యేలగన్" [ద్వితీయాశ్వాసం. ప 8]

సంపాదకులు బహుశ్రమల కోర్చి తాళపత్రగ్రంథములను పరిశోధించి పరిష్కరించారు. తాళపత్రప్రతి వ్రాతల నమూనాలను ఫోటో తీయించి యిందు చేర్చి, గ్రంథం చివర పద్యాను క్రమణికను ఇచ్చినారు. అముద్రితమై మూలపడియున్న ఈ గ్రంథాన్ని వెలికితీసి ప్రకటింపజేసిన సంపాదకులకూ, ప్రకటించిన ఆం. ప్ర. సాహిత్య అకాడమి వారికి ఆంధ్రులు కృతజ్ఞులై ఉండాలి. పాఠకులు సంపాద కుల విపుల పీఠిక నుండి రచయిత చరిత్రను, గ్రంథవైశిష్ట్యాన్నీ గ్రహించగలరు.

బులుసు వేంకటరమణయ్య

# "అంతంలేని అమావాస్య"

[దడాల చంటబ్బాయి, శ్రీరామా ప్రెస్, పాయకరావుపేట, వెల 10-00]

215 పేజీల యీ నవల మాల మాదిగలకు ఖామందులకువున్న తరతమ భేదాలను చూప ప్రయత్నించింది. ఖామందు నాగభూషణం గారి భార్య సరళ తమింటి పాలేరు మాల ఎంకడి మీద మదంతో విరు చుకు పడితే ఆ ఎంకడు ఆమెకు శతక నీతులు చెప్పిపోతాడు. ఆమె భర్తతో ఏం చెప్పిందో చదువరికి కూడా తెలీదు గానీ నాగభూషణం ఎంకణ్ణి చంపించేస్తాడు. ఎంకడి పినతల్లి కొడుకు నాగభూషణం మీద పగదీర్చుకోడానికి సమయం కోసం 77 వ పేజీలో పొంచిచూస్తూం టాడు. అంతే ఆనక యీ కథ కనబడదు. అక్కణ్ణుంచి ప్రసిడెంటు రంగనాయకుల కథ ఆరంభమవుతుంది.

రివాజుగా అతని కూతురు అరుణమాల ప్రసాద్‌ను ప్రేమిస్తుంది. దాని కాయన తోకమీద నిలుచున్న పాములా ఎగిసి పడ్డాడు. చదువరి వూహించే విధంగా అతన్ని చంపించేస్తాడు. ఈ నవలలో 99 వ పేజీనుంచి 163 వరకు ఎలక్షన్ల వర్ణన. ఆ ఎన్నికలలో సామాన్య మయిన పోలిటిక్స్.

ఈ నవల చదువరిని ఆకట్టుకోదు. రచనలోగాని, కథలో గాని, కథనంలోగాని ఏ విధమైన ప్రత్యేకతా లేదు. ఇటీవల వస్తున్న తెలుగు సినిమాల పోకడలో "విలనీ" కథలో తిరుగుతూంటుంది.

కనీసం ముఖపత్ర చిత్ర రచన కూడా చక్కగా లేదు. ఖరీదు పది రూపాయలు.

# అన్వేషణ అనుభూతి

[డా॥ మోపిదేవి కృష్ణస్వామి, ది వరల్డ్ టీచర్ ట్రస్ట్ సోదర బృందం, అమలాపురం, వెల : 3-00]

52 పేజీల యీ పుస్తకంలో మొదటి ఏడు పేజీలలోని "పరి చయం" లో పార్వతీకుమార్, "కృతజ్ఞతలు" లో వాడపల్లి చక్రపాణి రచయితను గగన మార్గానికి లేవనెత్తారు.

కథ : అన్వేషణ అనుభూతిలో రచయిత తన చిన్నపుడు కలలో సరస్వతీదేవి తన నామె యింటికి తీసుకువెళ్ళి నోరు చూపమని నీ నోట్లో నే నుంటాను అని నోట్లో జొరబడి స్థిరనివాసమేర్పరచు కున్నట్లు ప్రకటించారు. తనను తాను చాలా గొప్పగా "...యుగే యుగే" పద్ధతిలో మొదటి 20 పేజీలు చదివించి, అనక మిగిలిన 17 పేజీలలో ఎక్కిరాల కృష్ణమాచార్యగారిని అదే పద్ధతిలో చూపారు.

ఇది రచయిత స్వీయ చిన్న కథ. సామాన్య పాఠకునికి అంతగా రుచించదు. ఎ. కె వరల్డ్ ట్రస్ట్ సోదర బృందంలో రచయితకు మంచి మెచ్చుకోలు, ఒప్పుకోలు వుండి వుండచ్చు. ఈ చిన్నారి పుస్తకంలో రచయిత తాను సమాజానికో, మానవాళికో చేసిన పనులు ఏవైనా వుంటే వాటిలో కొన్ని చదువరి ముందుంచి వుంటుంటే బాగుండి వుండేది. ఇ. కె. గారి గురించి మరి కొంచెం రాసినా బాగుండేది.

"క్వ సూర్యప్రభవోవంశః
క్వ చాల్ప విషయామతిః"

అని కాళిదాసంతటి వాడే అంటూ, రఘువంశ రచన ఆరంభించాడు.

ఓం తత్ సత్యం.

"ఫాలాక్షుడు"

# యుద్ధం

[కె. వి. యస్. వర్మ, క్రాంతి ప్రచురణ : విజయవాడ, వెల : 5-00]

"యుద్ధం" లో బ్రాహ్మణ్యం అగచాట్లు...వో బ్రాహ్మణ పసి హృదయం బ్రాహ్మణ్యానికి ఎదురు తిరుగుతుంది. పౌరోహిత్యం చేసుకునే తన తండ్రి జంధ్యం కసిగా తెంపేస్తాడాకుర్రాడు. తన పిలక బ్లేడుతో కోసేసుకోవాలని పరుగెత్తాడు. "జాలి" లో ముష్టి అడుక్కునేది ధైర్యంగా దేవుని డబ్బులు, ప్రసాదం జబర్దస్తీగా తీసుకుని అదేమన్న పూజారితో "అసలా దేవుడు ముండాకొడుకుంటే నిన్ను బతక నిత్తాడా" అని సింహంలా గర్జిస్తుంది. "అటుకులు" లో పనుగు దాలు అనే వో యువతి జీవితాన్ని బాగా అర్థం చేసుకుని చేతగాని మొగుర్లో రక్కున చీరిప్పి పారేసినట్టు పారేసి మిల్లు వోనర్ని పట్టుకుని పెద్దదై పోతుంది. "జైల్లో చంద్రుడు" లో ఖైదీగా జైల్లో వుంటున్న ధర్మారావనే డాక్టరు తోటి ఖైదీలకు వైద్యం చేసి తృప్తి పడుతుంటాడు.

ఇవి గాక యిందులో మరో ఎనిమిది కథలున్నాయి. కథలు క్లుప్తంగా చిన్న సందేశమిస్తున్నట్టున్నాయి. అయినా కథనం బాగుండడం వల్ల చదువరిని ఆకట్టుకుంటాయి. ఈ పన్నెండు కథలూ లోగడ వివిధ పత్రికలలో పడ్డట్టు" ఇదీ దారి" లో చెప్పబడింది.

పెద్దిభొట్ల సుబ్బరామయ్యగారు "నన్ను డిస్టర్బ్ చేశాయి. ప్రశంశా వాక్యాలతో చదువరిని కాస్త తికమక పెట్టారు. ప్రశంశ ఒక్కింత ఎక్కువై ఎక్కువ తీపి తింటేలా...ఉన్నది.'

తెలుగు చదువరి మెచ్చుకునేట్టు రచయిత వర్మ యీ "యుద్ధం" రూపొందించారు.

భూపతిరాజు.

# దైవ ప్రవక్తలు

[మూడు భాగములుగ ప్రచురించబడినవి. మూలం: మౌలానా అబూ సలీం అబ్దుల్ హై. మొదటి భాగం— అనువాదం : షేక్ హమీదుల్లా షరీఫ్. పేజీలు. 28. వెల : రు 1-75. రెండవ భాగం— అనువాదం : ఇఖ్బాల్ అహ్మద్. పేజీలు: 32. వెల : రు 1-80. మూడవ భాగం — అనువాదం : ముహమ్మద్ ఇఖ్బాల్ అహ్మద్. పేజీలు : 30; వెల : రు 1-50. ప్రకాశకులు : తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, లక్కడ్ కోట్. చత్తా బజార్, హైదరాబాద్-500 002]

మొదటి భాగంలో హజ్రత్ ఆదం, హజ్రత్ నూహ్, హజ్రత్ హూద్ ప్రవక్తల గూర్చి క్లుప్తంగ వివరింపబడింది. భగవంతుడు ఆదమ్ హవ్వాలను మొదటి మానవ దంపతులుగా సృష్టించి, స్వర్గంలో వారికి సర్వ సౌఖ్యాలు ఏర్పరచి, ఒక వృక్షము దరిదాపులకు వెళ్ళకూడదని శాసించాడు. కాని ఆ దంపతులు సైతాన్ మోసానికి గురియై దైవాజ్ఞ ధిక్కరించి, ఆ వృక్ష ఫలమును సేవించారు. వెంటనే దైవ మహిమ గ్రహించి దేవుని సన్నిధికో తప్పిదం ఒప్పుకున్నారు. అప్పుడు దేవుడు వారిని మన్నించి తొలిమానవులుగ భూలోకానికి పంపించాడు. హజ్రత్ ఆదమ్ తొలి ప్రవక్త అయినాడు. అతని తర్వాత ఆవిర్భవించిన మరో ప్రవక్త హజ్రత్ నూహ్. ఇతని ఆదేశాలు పాటించినవారు రక్షింపబడి, ధిక్కరించినవారు ప్రళయ ప్రవాహములో కొట్టుకొనిపోయారు. ఆ తర్వాత 'ఆద్' జాతిని ఉద్ధరించే నిమిత్తం అవతరించిన ప్రవక్త 'హజ్రత్ హూద్'. ఇతను విగ్రహారాధన, బహుదేవోపాసనను ధిక్కరించి ఏకేశ్వరోపాసనను ప్రచారం చేశాడు. ధిక్కరించినవారు తుఫానులో నష్టపోయారు.

రెండవ భాగంలో హజ్రత్ సాలెహ్, హజ్రత్ ఇబ్రాహీం, హజ్రత్ లూత్ ప్రవక్తల గూర్చి వివరింపబడింది. సమూద్ జాతిని ఉద్ధరించుటకు వచ్చిన ప్రవక్త సాలెహ్. ఇతని బోధనలు విన్నవారు రక్షింపబడి, ధిక్కరించినవారు భూకంపంలో కలిసిపోయారు. విగ్రహారాధనను ధిక్కరించినవాడు హజ్రత్ ఇబ్రాహీమ్. తన కుమారులయిన హజ్రత్ ఇస్మాయిల్, హజ్రత్ ఇస్‌హాఖ్‌లను ధార్మిక సేవకు

నియోగించాడు. హజ్రత్ ఇబ్రాహీమ్ సోదరుని కుమారుడు హజ్రత్ లూత్. ఇతను సిరియా దేశంలోని మృత సముద్ర ప్రాంతములో దైవబోధనలు చేశాడు.

మూడవ భాగంలో హజ్రత్ యూసుఫ్ చరిత్ర వివరింపబడినది. అతనిని సవతి తల్లి బిడ్డలు అడవిలోని బావిలో పడవేశారు. మదీనా నుండి ఈజిప్టు వెలుతున్న బిడారలు అతనిని రక్షించి, ఈజిప్టు ఖజానాకు అధిపతి అయిన అజీజ్‌కు అమ్మివేశారు. అజీజ్ అతనిని స్వంత కుమారునిలాగ పెంచుకోసాగాడు. అజీజ్ భార్య, జులైఖా యూసుఫ్ అందానికి మోహించి తిరస్కరింపబడి అతనిపై తిరిగి నిందారోపణ చేసింది. ఫలితంగా యూసుఫ్ జైలులో నిర్బంధింప బడ్డాడు. అతని సజ్జనత్వం తెలుసుకున్న ప్రభువు యూసుఫ్‌ను చెఱ నుండి విడిపించి ఆహారశాఖకు అధికారిగ నియమించాడు. చివరకు యూసుఫ్ తన తల్లిదండ్రులను సింహాసనం మీద కూర్చుండబెడతాడు. మోసం చేసిన సోదరులను క్షమించాడు.

మూడు సంపుటాలలో ముస్లిం ప్రవక్తల జీవితాలు క్లుప్తంగ వివరింపబడినవి. కొంతవరకు అరేబియా చరిత్ర కూడ తెలుస్తుంది కనుక ముస్లిమేతరులు కూడ చదువతగిన పుస్తకములు.

# నేను ఆరాధించే ఇస్లాం

[మూలం : ఆడియార్. అనువాదం : శ్రీమతి మాలతీ చందూర్. క్రౌను సైజు. పేజీలు : 160. వెల : రు 8 00. ప్రకాశకులు : తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, లక్కడ్ కోట్, ఛత్తా బజార్, హైదరాబాద్-500 002.]

తమిళంలో 'నాన్ కాదలిక్కుమ్' ఇస్లామ్ అన్న మకుటంతో శ్రీ ఆడియార్ ద్వారా వెలువడిన వ్యాసపరంపరను శ్రీమతి మాలతీ చందూర్ తెలుగులో అనువదించి 'గీటురాయి' వారపత్రికలో ప్రచురించారు. ఇందులో ఇస్లామ్ ఔన్నత్యము, దివ్యఖుర్ ఆన్ పవిత్రతను గూర్చి వివరించారు.

మహమ్మద్ ప్రవక్తను మానవజాతికి మనోహరమైన ఆదర్శమూర్తిగ, ఆగ్రహంతో అరవటంగాని, అన్యాయానికి తలవంచటంగాని చెయ్యని అపురూపమయిన జీవితం గడిపిన మానవతామూర్తిగ, ఆడి తప్పని సత్యసంధునిగ, గృహస్థుగ ఉండి దైవసందేశ ప్రబోధము చేసిన ప్రవక్తగ, అద్భుతమలు చెయ్యని అద్భుత నాయకునిగ, విశ్వ కారుణ్య స్వరూపునిగ కీర్తించారు. భవిష్యత్ పురాణములో వేద వ్యాసుడు మహమ్మద్ ప్రవక్త రాకను సూచించినట్లున్నది.

అల్ ఖుర్ ఆన్ గుప్తం కాని గొప్పగ్రంథంగ ప్రపంచ విజ్ఞాన సర్వస్వంగా పేర్కొంటూ, దీనికి వేదము, ఇతిహాసము, కావ్యము- మూడు లక్షణాలు ఉన్నవని చెప్పారు. ఇస్లామ్‌లో మహిళల రక్షణ హక్కులను గూర్చి చర్చించబడింది. ఇస్లాం ధర్మంలోని కొన్ని తాత్విక శబ్దాలకు అర్థాలు చెప్పబడినాయి. ఇస్లామును పరిశుభ్రతకు మరో పేరుగ, కమ్యూని జంకంటే ఉన్నతమైన వ్యవస్థగ కీర్తించారు.

ఇస్లాం ఔన్నత్యాన్ని గురించి అన్నాదొరై బెర్నార్డ్ షా, నెపోలియన్ బొనాపార్టీ, జాతిపిత మహాత్మాగాంధీ, శామ్యూల్ జాన్సన్, థాడ్‌వెల్, సరోజినీదేవిగార్ల అభిప్రాయాలు తెలుపబడినవి.

పుస్తకములో ఆద్యంతములు విగ్రహారాధనను తీవ్రంగా ఖండించారు రచయిత. దేవతా విగ్రహములు, చిత్రములు నిర్మాలించటం సమర్థించారు- "మనదేశంలో కూడా 'శ్రీరంగనాథుని, చిదంబరంలోని నటరాజుని ఫిరంగినోట్లోదూర్చి- పేల్చే రోజు ఎప్పుడు రానున్నదో!...." అంటూ పాటలు పాడారుతప్ప ఆఖరికి కుగ్రామం లోని వినాయకుని విగ్రహంకూడ కదపలేకపోయారు. పగల కొట్టటం వారికి సాధ్యమూకాలేదు" అంటారు.

"సంస్కృత భాష ప్రాకృత భాషనుండి వచ్చినది" అని వ్రాసారు. అది సరికాదు.

"మత గ్రంథాల్లో భాషలు అన్నీ, ఇంచుమించు అన్ని మత గ్రంథాల భాషలూ సజీవంగ లేవు." అని వ్రాశారు. వేద వాఙ్మయము, ఉపనిషత్ వాఙ్మయము, గీతావాఙ్మయము ఆదినుండి నేటివరకు ఎట్టి మార్పులు, ఒడుదుడుకులు లేకుండగ స్వరయుక్తంగ యుగయుగాల ప్రవాహన్యాయంగ ఉందనుట సత్యము.

ఏమతానికైనా తాత్విక, వ్యవహార పక్షాలు సమపాళ్ళలో ఉంటయి. ఈ గ్రంథంలో వ్యవహార పక్షం వైపు ఎక్కువ మొగ్గు కానవస్తుంది. ఆ మొగ్గును అపాదించుట కొరకు, అన్యధర్మశాస్త్రాలను, ఆచార్యులను, భాషలను చులకన భావంతో చూసినట్లనిపిస్తుంది. రచయితలో తాత్వికచింతనకంటె రాజకీయశైలి ఎక్కువగ కానవస్తుంది.

ధర్మానికి మూలం తత్త్వం. ధార్మిక తత్త్వాలను నిజ జీవితంలో ఆరాధించేవారు. ఇతరుల భావాలను, బోధనలను చులకన చేయరు.——

కేప్టెన్ షేక్ మౌలాలి

# ఆధునికాంధ్ర సారస్వతము

[డాక్టర్. వుప్పల లక్ష్మణరావు. వెల :- రు. 2. 00 ప్రతులకు:- డా॥ పి. రాజారామ్: కవితా క్లినిక్, శివ లైన్; లక్ష్మి పురం గుంటూరు. 522007]

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల్ల సంఘం గుంటూరు జిల్లా శాఖవారు ప్రచురించిన చిన్నపుస్తకం ఇది. అభ్యుదయ రచయితల సంఘం గుంటూరు శాఖవారు పులుపుల వెంకట శివయ్య గారి స్మారక కమిటీని ఒక దానిని ఏర్పాటుచేసి 1977 నుంచి పని చెయ్యటం ప్రారంభించింది. 1980 నుంచి ఆ కమిటీ తరపున సంవత్స రానికో రచయితను సత్కరించటం ప్రారంభించాము. 1988వ సంవత్స రానికి ఆ సత్కారం డా॥ వుప్పల లక్ష్మణరావుగారికి ఇవ్వటానికి నిశ్చ యించారు. వారు వయోభారం చేత సభకు రాకపోయిన కారణంగా వారు పంపిన 'ఆధునికాంధ్ర సారస్వతం' అనే వ్యాసాన్ని ఈ చిన్న పుస్తకంగా కమిటీ వారు ప్రచురించారు. ఈ వ్యాసంతో పాటు వుప్పల లక్ష్మణరావుగారి జీవిత సంగ్రహాన్ని అతిక్లుప్తంగా పుస్తకం మొదట్లో ఇచ్చారు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో పరిచయం ఉండి వుప్పల లక్ష్మణ రావుగారి పేరు వినని వారు ఉండరు. ఆయన జీవితాన్ని, ఆయన సాహిత్యం నుంచి, దాని నిబద్ధత నుంచి వేరుచేసి చూడటం అసాధ్య మయిన విషయం. జీవితంలోనూ సాహిత్యంలోనూ కూడా ఒకే విధంగా కనిపించే అరుదైన వ్యక్తులలో లక్ష్మణరావుగారు ఒకరు.

కందుకూరితో మొదలై గురజాడ వారి దగ్గర్నుంచి శ్రీ శ్రీ దాకాను వచన కవిత్వం వరకూ ఈ చిన్న వ్యాసం తెలుగు సాహి త్యాన్ని సమీక్షించింది. సమాజంలో వస్తున్న భావాలమార్పు, అది సాహిత్యంలో ప్రతిబింబించిన తీరు ఈ వ్యాసంలో లక్ష్మణరావుగారు అతిమామూలు మనిషికి కూడా అందేటట్లుగా రాశారు. అయితే దిగం బర కవులమీద లక్ష్మణరావుగారు పెట్టిన అభియోగం నూటికి నూరు పాళ్ళు నిజమైంది కాదు, దిగంబర కవిత్వంలో తిట్లు, బూతులు, జుగప్సే కాదు కవిత్వం కూడా ఉంది. ఆ కవిత్వం వెనుక సమకాలీన సమాజం పట్ల కావలసినంత కసి ఉంది; ఆర్తి ఉంది, ఆవేదన ఉంది. వీటిని వేటినీ పట్టించుకోకుండా అ. ర. సం. దృక్పధంలోంచి మాత్రమే దిగంబర కవులను అంచనా వెయ్యటం పాక్షికమేగాని సత్యం కాదు." కవిత్వం కవిలోని అవినాభావమైన విషయం గనక. ఆ భావమూ, ఆ అనుభవమూ, ఆ ప్రేరణ అతనికి పుట్టడానికి గల కారణాలను మనం తెలుసుకున్నప్పుడే కవి సమ్యక్ దర్శన పాఠకుడికి లభిస్తుంది." అన్న లక్ష్మణరావు గారు దిగంబర కవిత వెనుక ఉన్న ప్రేరణను, ఆనాటి పరిస్థితులను పసిగట్ట లేకపోయారా. మొత్తంమీద ఈ చిన్న వ్యాసంలో ఆధునిక సాహిత్య ప్రక్రియల మీద లక్ష్మణరావు గారి విహంగావలోకనం కనబడుతుంది.

# స్తబ్దత-చలనం

పాపినేని శివశంకర్

వెల :- రు. 3-00లు

ప్రతులకు: 1) రచయిత; నెక్కల్లు; గుంటూరుజిల్లా; -522 2
2) నవోదయ పబ్లిషర్స్, ఆరండల్ పేట: గుంటూర
కారల్ మార్క్స్ రోడ్డు, విజయవాడ-2

1970 తరువాత తెలుగు కవిత్వానికి గ్రహణం పట్టిందని అ దించేవాళ్లు లెక్కకు మించే ఉన్నారు. వారి వారి అంతరాత్మ కూరుకుపోయి స్వకీయ వేదనానుభవమే కవిత్వమనీ మిగిలినద ఉత్తిచెత్త అని భావించే మేధావంతులైన కవులు తక్కు ఉన్నారు. సమాజానికి, దాని వికృతికి చెందిన కవిత్వమంతా ని ప్రాయమని, కవితా విలువలు అసలు లేనేలేవనే నిరాశావాదు ఉన్నారు. ఇంతమంది ఇన్నిరకాలుగా వర్తమాన కవిత్వాన్ని గు అనుకొంటున్నా మహత్తుగల కవిత్వం వస్తూనే ఉంది. అం సాక్ష్యమే ఈ స్తబ్దత-చలన కవితా సంకలనం.

వస్తు దృక్పథంలో ఈ కవి పూర్తిగా సమాజకవి. సమాజం యొక్క వర్తమాన గమకదిశ, భవిష్యత్తులో అది తిరగ సిన మలుపు ఈ కవిత్వానికి ఊపిరి. ఈ వ్యవస్థ స్వరూపా చిత్రించడంలో కవి ఎక్కడా వచనత్వంలోకి, వాచాలత్వంలోకి పోలేదు. అడవి ఈ వ్యవస్థకు ప్రాతినిధ్యం వహిస్తుంది.

"అలసి పోయిన అడవి నిద్రపోతోంది,
ఆదమరచిన అడవి నిద్రపోతోంది
అర్ధరాత్రి
ఎక్కడో గాయపడ్డ లేడి అరుపుతప్ప
ఏదో కీచురాళ్ళవేదనా సంగీతం తప్ప అంతా నిశ్శ

ఇక్కడివరకూ ఈవ్యవస్థలో ఒక భాగానికి ప్రతీకలద రూపకల్పన చేసిన కవి ఈ భాగం ఇట్లా ఉండటానికి కారణ మరో భాగాన్నికూడా స్వభావసిద్ధమైన ప్రతీకల్తో చిత్రిస్తాడు.

"పొదచాటున సింహం ఎరకోసం కదుల్తోంది,
ఎర మింగిన కొండచిలువ మత్తుగా మెదుల్తోంది
పులి పంజా నెత్తుటి జీర మెరుస్తోంది
వాసన పట్టిన కొంకెనక్క ఆత్రంగా వెదుకుతోంది
ఆదమరచిన అడవి నిద్రపోతోంది"
ఆకులాడని అడవి నిద్రపోతోంది"

ఈ చివరి రెండు పాదాల్లోనూ జనం యొక్క ఆలోచనా సాహిత్యం, చైతన్యరాహిత్యం వెల్లడవుతోంది. మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం జడత్వంలోంచే చైతన్యం పుడుతుంది; పుట్టాలి. నెత్తురును పౌడర్‌గా మేకప్ చేసుకునేవాళ్ళు, శాంతిగానం చేస్తూ స్వేచ్ఛను స్వేచ్ఛగా ఉరి తీసేవాళ్ళు, ఆదర్శాలను, ఆత్మలను ఖూనీ చేసేవాళ్ళు-నెత్తుటికిక్కు తలకెక్కి శాంతి భద్రతల సంరక్షణకు ముళ్ళ కంచెల చట్టాలు నిర్మిస్తూ, పల్లెల్లో పట్టణాల్లో ఇనుపబూట్లను కవాతు చేయిస్తూ భూమి గుండెలమీద నిరంకుశ పతాకాలు ఎగరేస్తుంటే సాంఘిక జీవితం కుళ్ళటంకాక మరేమిటి?

"జీవితం కుళ్ళిపోయింది నేస్తం
దీనికి శస్త్ర చికిత్స తప్పదు
జీవితం మలినమైంది నేస్తం
దీన్ని పోరాటంలో ముంచెత్తక తప్పదు"

అని ఈ స్తబ్దతలోంచి చలనం దిశగా ప్రయాణించమనే సందేశం అందిస్తున్నాడు కవి.

ఈ దేశం ఎంత అందంగా ఉందో కవి చాలా వ్యంగ్యం గానూ, కవితాత్మకంగానూ చెబుతున్నాడు.

"నాగేటి చాళ్ళల్లో ఎర్రటి సెలయేళ్ళ నడుగు
నగరం కాళ్ళ కింద
దారిద్ర్యం దైన్యపు పరిమళాన్నడుగు
పెంటల పేవ్‌మెంటుపై పీనుగలో
అజంతా ఆకలి భంగిమనడుగు
సెంటరులో చెరచబడిన
చిన్నారి అరమోడ్పు కన్నుల నడుగు
అవాతల యోని సంభోగం మరిగిన
పోలీసువాడి లాఠీనడుగు
ఎక్కు పెట్టిన బందూకుల
ఎదురు కాల్పు సంగీతాన్నడుగు
ఉరి కొమ్మలు రాల్చే ఊపిరి పువ్వుల్నడుగు
ఆకాశ మెత్తున అందాల రాజమహళ్ళ జైళ్ళ
వాటి గోడల్నడుగు"

ఇలా ఈ దేశ నైసర్గిక సౌందర్యాన్ని వర్ణిస్తాడు కవి. సమాజాన్ని పట్టించుకోని కవులకు, కవితకు చరమగీతం పాడాడు ఈకవి. ఈ వ్యవస్థలోని సర్వ దౌర్భాగ్యాల్ని, పీడనను, దోపిడిని కవిత్వాక్షరమయంచేసి దీనిపై పోరాడవలసిన అవసరాన్ని కంఠదఘ్నంగా గుర్తించి హెచ్చరించాడు.

"మనసులకు మేకప్, మాటలకు మేకప్
మనిషి మనిషికీ మధ్య ఇనుపతెర
మనసు మనసుకీ మధ్య మైళ్ళదూరం
ప్రతివాడూ రెండోవాడికి మూలధనం"

అయిన ఈ వ్యవస్థను నిర్మూలిస్తేనే కాని ఆరోగ్యవంతమైన వ్యవస్థ పుట్టదు. అట్లాంటి వ్యవస్థావిర్భావానికి మూలమైన భావచైతన్యానికి ఇట్లాంటి సంకలనాలు ఎన్నైనా రావాలి.

## నిప్పురవ్వలు (కవితా సంపుటి)

[కామిశెట్టి శివశంకర్ వెల:- రు. 8-00లు ప్రతులకు:-
1) కామిశెట్టి శివశంకర్; మార్వాడీగుడి వీధి; గుంటూరు-522003
2) నవోదయా పబ్లిషర్స్; విజయవాడ-2; గుంటూరు-2
3) విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; విజయవాడ-4

ఈ కవితా సంకలనం ప్రథమ ముద్రణ 1971 లో జరిగినది. ద్వితీయ ముద్రణ 1984. ఇది ద్వితీయ ముద్రణ పొందిన ప్రతి 'దీనికి నిప్పురవ్వ జ్వాలగామారి విప్లవాన్ని రగిలించాలని' రామ మోహన్‌రాయ్‌గారు ఆముఖ రచన చేశారు. ఎ.వి. శర్మగారు శివశంకర్‌గారి, వ్యక్తిత్వాన్ని కవిత్వాన్ని విశ్లేషించారు. ఆధునిక వచన కవిత్వానికి కాలం చెల్లలేదని ఇటువంటి కవితా సంకలనాలు ఇంకా ఋజువు చేస్తున్నాయి. శివశంకర్‌గారి కవిత్వంలో నిజాయితీ ఉందని ఆయన మాటలే ఋజువు పరుస్తున్నాయి.

"సిద్ధాంత నిబద్ధత గురించి
తెలిసిన కొంచెం కంటె
తెలియని దెంతో ఉందని
తెలుసుకొని-
ఇవాళ ఓనమాలు నేర్చుకొంటున్నానని
ఇంకా పదాలకి అర్థాలు కూర్చుకొంటున్నానని
ఒప్పుకోవడం తప్పుకోవడంకాదు
ఇలా చెప్పుకోవటం మెచ్చుకోలుకి కాదు"

అంటారాయన ఇప్పుడున్న స్థితి మారాలని: ఈ వ్యవస్థ పతనం కాకపోతే ఈస్థితి మారదని, అందరి బతుకులు సుఖంగా గడిచే సమాజం రావాలని ఈ కవి ఆశయం.

"నా శ్వాస, నా ధ్యాస, నా ఆశ
శోకం లేని సుఖ లోకం కోసం
నా కరం, నా కలం, నారుధిరం
చీకటి కానని వెలుగు దారి కోసం"

అది ఆయన కవితాన్వేషణను వ్యక్తం చేశారు.

కవులూ, కళాకారులూ ఈ వ్యవస్థకు అమ్ముడుపోకుండా పీడిత తాడిత పక్షం వహించి సమతా వ్యవస్థ నిర్మాణంకోసం అహ రహం కృషి చెయ్యాలని ఈ కవి వేదన. అందుకు వ్యతిరేకులైన వారిని గురించి, పక్కా అవకాశవాదకవులను గురించి ఇట్లు అంటున్నారీయన.

"ఆత్మవంచననే ఊపిరిగాపీలుస్తూ
బుర్రనీ బుద్ధినీ అద్దెకిచ్చేసినవాడా
బిరుదులతో బలిసిన పిరుదులతో
ఆస్థానాల్లో స్థానాలకోసం
సత్కారాలకోసం, సన్మానాలకోసం
అహరహమూ తపించి
ఇన్నాళ్ళుగా సుఖించినవాడా"

ఇన్నాళ్ల దైన్యాన్ని, హైన్యాన్ని, స్తబ్దతను, ఆర్ద్రతను, కన్నీళ్ళను, అసహాయతను వదిలి కారుచీకట్లు తొలగించడానికి, క్రాంతి కాగడా వెలిగించగ నాకి సమాజంలో ప్రతి ఒక్కడూ పోరాటంలో భాగస్వామి కావాలని ఈ కవి ఆకాంక్ష.

## తమోనలం (కవితాసంకలనం)

[వెల:- రు. 8-00లు ప్రతులకు: శశి పబ్లికేషన్స్: 20-10-18 రాగిమానువీధి; మిట్టూరు; చిత్తూరు;

డి. మహేష్‌కుమార్, మహమ్మద్ హారీస్ కె.యస్. రమణ, జాసిం యూసిఫ్, కె. మదన్‌మోహన్ అనే ఐదుగురు కవులు ఎవరి కవిత్వం వారు విడివిడిగా కలిపి ప్రచురించిన కవితా సంకలనం ఇది, "వ్యక్తి విరుద్ధ భావాల సంగమ బిందువు. సహజాత వైరుధ్యాలవు. సహజాత ప్రేరణ విధాన వైరుధ్యాలకు మూలమైన మానవుడు తనను తెలిసికోలేక తనతో తాను పోరాడుతున్నాడు. అనంత ప్రకృతి మార్మిక లక్షణాలు సంపన్నస్వరూప వైరుధ్యాలు, వ్యక్తి అంతరంగిక సంఘర్షణలు మానవునికి మానవుని జ్ఞానానికి అతివేదనని ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నాయి. ఈ సమస్యా సంక్షుభితాంతర్మధన తమోనల వీచిలో...." ఈ తమోనలం అనే కవితా సంకలనాన్ని వెలయిస్తున్నట్లు ఈ కవులు చెప్పుకున్నారు.

ఈ కవుల అభివ్యక్తీకరణ పద్ధతి బలమైంది. కవిత్వానికి చెందిన భావుకతలో వీళ్లు సిద్ధహస్తులు. కవిత్వాన్ని కవిత్వంగా రాయటంలో ఆరితేరిన వాళ్ళని ఈ ఖండికలు చెప్పక చెబుతున్నాయి. అయితే ఈ సంకలనం చదివిన పాఠకునికి 'వీళ్ళు చెప్పేదేమిటి ?' అనే ప్రశ్న మిగిలిపోతుంది. వర్తమానకాలం, సమాజం అంతా అంధకారమే అనుకుందాం. ఇక్కడ జీవితాలు కదిలే శవాలే అనుకుందాం. ఈ అంధకారం వెలుగు, ఈ జడత్వంలోంచి చైతన్యం వచ్చేమార్గం ఏమిటి ? మనిషి తనను తాను తెలుసుకోవడమేనా ? అదే అయితే ఆ తెలుసుకోవడమనేది ఏ దిశగా పోతుంది. వ్యక్తి చైతన్యానికి, సంఘ చైతన్యానికి ఏమీ సంబంధం లేదా ? ఇత్యాదులైన ప్రశ్నలు చదువరికి కలగడంలో ఆశ్చర్యం ఏమీ ఉండదు.

"యీ నరకాన్నొక లోకంగా
మార్చేందుకు
యెంత రక్తం సముద్రమై పొంగుతుందో ?
యెన్ని కంఠాలు తెగి
మౌన హిమసౌధనంలోకి నిష్క్రమిస్తాయో ?
భ్రమ...
కన్నీటి కంఠానిక
రంగులు వెలిసి పోతున్న ఆశా వర్ణ చిత్రం
యిక్కడ
ప్రతి వొకడూ తొడలు విరిగిన దుర్యోధనుడే" అంటూ చివరకు ఇది కదలని కదలలేని నరకం." అని మహేష్‌కుమార్ చెబుతున్నారు.

నూతన శిశూదయం జరగాలంటే పురిటి నెప్పులూ తప్పవు. రక్తస్రావమూ తప్పదు. వజ్రం వజ్రంతోనే కదా తెగేది ?

"నిప్పుల వికృత సిఫిలిస్ సంస్కృతుల
మబ్బుల నీడలు
ఆకలితో ఆకలి తీర్చలేని అశక్తతతో
యెండిన స్తనాల బిరుసెక్క చీటలు వారిన
చుంచుకాలు చెట్ల మోళ్ళు
యే హృదిని చేరలేని కన్నీటి చారికల
అర్థాంతర అదృశ్య గమనాలు సెలయేళ్ళు
యీగలు ముసురుతున్న తెరుచుకున్న
నాగరికత నోళ్ల నగరాలు ఊళ్ళు
కనీనికల్లో కలల మరీచికలు
వెంటాడు తున్న వ్యహారభావ పరివ్రాజకులు
కనురెప్పల వేదికలపై నిదరిస్తున్న తడి మంటలు
మానస మరు భూముల్లో చితి పంటలు"

ఇట్లా వాస్తవికతను అధివాస్తవికంగా చిత్రిస్తూ మార్మికతవైపో అంతర్మథనవైపో కవులు పయనిస్తే ప్రయోజనం నిష్ప్రయోజనమే. ఈ కవితాశక్తిని, సమిష్టివైపు కేంద్రీకరిస్తే కవిత్వం ఉజ్వలం కాదా?

శ్రీ టి. ఎల్. కాంతారావు

# ప్రేమ + సెక్స్ = నీతి

[రచన : మల్లాది సుబ్బమ్మ; వెల : రు. 17 లు; ప్రచురణ ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్, హైదరాబాద్-500028]

కర్నల్ కమలాకరరావు, మేజర్ గున్నేశ్వరరావు, నీరజ ఈ పెద్ద కథలోని ప్రధాన పాత్రలు. ఈ పాత్రల చుట్టూ రామలింగం, అతని భార్య సౌభాగ్యమ్మ, అదే భవనంలో అద్దెకుంటున్న నళిని, ప్రభాకరం, పద్మజ, ప్రకాష్, పద్మిని, వెంకట్రావు, సూర్యారావు, రుక్మిణి, మోహనరావు, చిత్రావతి, సావిత్రి, రాధమ్మ, గోపాలం, తదితర పాత్రలు తిరుగుతయ్. ఈ కథలో హత్య, సెక్స్, సాంఘిక సంస్కరణ వంటి సమస్యలను రచయిత్రి పాత్రల ద్వారా చర్చించారు. సెక్స్ సమస్యలను పలు కోణాలనుంచి రచయిత్రి సందర్భోచితంగా చర్చించారు. చివరి మాటలో శ్రీ యం. వి. రామమూర్తిగారు ఉదహరించిన సందేహాలు మాత్రమే కాక యింకా పెక్కు సమస్యలు ఉత్పన్నమవుతాయి. యీ 288 పుటల పెద్దకథ తీరిగ్గా చదవగలిగితే సమాధానాలు దొరకవు. సమాధానాలు చెప్పకుండా కథను నడిపించడం ఒక శిల్పం. అయితే ఇదెక్కడి గొడవరా బాబూ అనిపించరాదు. వ్యభిచార నిరోధక చట్టాన్ని సవరించవలసిన ఆవశ్యకతను విజ్ఞులందరూ ఎన్నడో గుర్తించారు. అలాగే భారత శిక్షాస్మృతిలోని 497వ సెక్షనును కూడా తొలగించవలసిందే. కథను బాగా నడిపించారు రచయిత్రి. కానీ ఈ కథ చెప్పడానికి ఇన్ని పాత్రలు అవసరమా? ఇన్నిపాత్రలను ప్రవేశపెట్టడం ద్వారా రచయిత్రి యేమి సాధించగలిగారు. "రచయిత చెప్పదలచిన అంశాన్ని సూటిగా చెప్పేదే మంచి కథ" అన్నాడు ఓ ఆంగ్ల కథా రచయిత. మొత్తంమీద పట్టుదలగల ఈ రచయిత్రికి వనరులు పుష్కలంగా వున్నాయి కనుక ముమ్ముందు ఇంకా మంచికథలు నవలలు వ్రాస్తారని ఆశించవచ్చునా?

# విజయ జ్యోతి

[రచన. డాక్టరు ధనకుధరం లక్ష్మీనరసింహాచార్యులు, వెల: రు. 2; ప్రచురణ శ్రీవాణీ గ్రంథమాల, తెనాలి.]

అఖిల విశ్వకళ్యాణమూ అయిన మన భారతీయ సాంస్కృతిక ఆధ్యాత్మిక ప్రధాన శిఖరాధిరోహణ చేసింది. సంస్కృత సాహిత్యాన్ని సామాన్యులకుసైతం సుగమం సులభంచేసేందుకు ఉపాసనాయోగ్యాలైన పెక్కు పుస్తకాలను శ్రీవాణీ గ్రంథమాలద్వారా పదిహేడేండ్లుగాఅడిగిన వారందరకూ అమూల్యంగా అందజేయడం ప్రస్తుత పరిస్థితులలో ప్రశంసింపదగిన సంగతే. ఇరువది తొమ్మిది పుటలు ఈ చిన్న పుస్తకంలో ధర్మం అంటే ఏమిటి? జ్ఞానం అంటే ఏమిటి? మాధవ తత్త్వం అంటే ఏమిటి? సాధన ఎట్లు చేయవలెను? గాయత్రీ ఉపాసన ప్రతీకోపాసన,ప్రతిరూపోపాసన, భావోపాసన, పరోపాసనవంటి అంశాలనుసరళంగా సులభశైలిలో ఈ రచయిత వివరించారు. గీతోపాసన విషయాన్ని విశదం చేశారు.శ్రీమద్భాగవతోపాసన వీటన్నింటిలో సులభసాధ్యంకాదా? మతాచార్యులు ప్రతిపాదించిన ఉపాసనా విధానాలలోని తేడాబాహ్యమయినదేగాని వాటిలక్ష్యంఒక్కటేగదా? శ్రీవల్లభాచార్యులు ప్రబోధించిన శుద్ధద్వైతోపాసన గురించి మరింత వివరించి ఉండవలసింది. శివాద్వైతోపాసన గురించి 27వ పుటలో క్లుప్తముగానే అయినా వివరంగా వ్రాశారు. వీరశైవోపాసన సంగతి అంత స్పష్టంగాలేదు. ఈ పుస్తకంలో "ఈశ్వర విభూతి (శక్తి)ని పొందటమే ముక్తి" కాదా? జంగములు మాత్రమే వీరశైవోపాసకులనటం సమంజసమా? వీటన్నింటికంటే "అహింసా పరమోధర్మః" అన్న మహాత్మాగాంధీ ప్రవచించిన ఉపాసన గొప్పదికాదా?

శ్రీ ఏ. యస్. అవధాని




*Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247.*













**అమృతాంజన్‌కే**
**తెలుసు**
**ఒంటి నొప్పులు**
**మరియు**
**బెణుకుల బాధ**

మృదువైన మూలపదార్థము వల్ల
ఉపయోగించుట సులభము

క్రొత్త కార్క్ అమరిక వల్ల
మందు శక్తికి రక్షణ








1984 ఒలింపిక్స్ క్రీడలలో
పాల్గొన్న భారత క్రీడాకారులకు
అధికారపూర్వకంగా పెయిన్ బామ్
సరఫరా చేసినవారు.

**అమృతాంజన్**

ఏ ఇతర బాధలు కల్గించని
శీఘ్ర నివారిణిని నమ్మండి

OBM 8777 TG